శ్రీరస్తు.

శ్రీమద్ధన్వంతరయేనమః.

శ్రీమద్రాధీచవంశభూషణుండును శ్రీ బలదేవసూనుండును

సకలాయుర్వేద సంప్రదాయ సార్వభౌముండునునగు

జ్ఞానరసరామకవివర్యునిచే సుశ్రుతాది వివిధాయుర్వేద

గ్రంథప్రమాణోక్తముగ రచియింపఁబడిన

# అనుపానరత్నాకరము.

ఆంధ్రతాత్పర్యము.



లేట్, పిడుగు - సుబ్బరామయ్యగారిచే

తెనుగుతాత్పర్యము వ్రాయఁబడియె.

రెండవకూర్పు.

పిడుగు - వెంకటకృష్ణారావు పంతులుగారిచే

హిందూరత్నాకర ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

చెన్నపురి.

1922.

దీని వెల  రూ. 1

శ్రీరస్తు.

# విషయసూచిక.


| విషయము. | సంఖ్య. |
| --- | --- |
| ప్రథమస్తరంగము. | |
| అనుపానపరిభాష | 1 |
| కొన్నిరోగములకు క్షీరానుపానము | 6 |
| యోగరాజగుగ్గుల్వనుపానములు | 8 |
| నారాయణచూర్ణానుపానములు | 9 |
| నిర్గుండ్యనుపానములు | 10 |
| భృంగరాజానుపానములు | ,, |
| సకలరోగములకు హారీతక్యాదిపానములు | 11 |
| అన్యచ్చ | ,, |
| గుడూచ్యనుపానములు | 12 |
| నేత్రరోగమునకు పునర్నవానుపానము | 13 |
| త్రిఫలానుపానములు | ,, |
| ద్వితీయస్తరంగము. | |
| మృత్యుంజయాదిరసములకు అనుపానములు | 15 |
| వసంతకుసుమాకరరసానుపానములు | ,, |
| లోకనాథరసానుపానములు | 16 |
| స్వర్ణమాలినీవసంతరసానుపానములు | 17 |
| బృహన్మాలినీవసంతరసానుపానములు | 18 |
| పాశుపతరసానుపానములు | ,, |
| పర్పటీరసానుపానములు | 19 |
| జయాజయన్త్యనుపానములు | ,, |
| తృతీయస్తరంగము. | |
| సువర్ణభస్మానుపానములు | 22 |
| గ్రంథాంతరే | 23 |
| రౌప్యభస్మానుపానములు | ,, |
| గ్రంథాంతరే | 24 |
| తామ్రభస్మానుపానములు | ,, |
| గ్రంథాంతరే | 25 |
| వంగభస్మానుపానములు | ,, |
| జసదభస్మానుపానములు | 27 |
| నాగానుపానములు | 28 |
| లోహానుపానములు | ,, |
| స్వర్ణమాక్షికానుపానములు | 29 |
| రౌప్యమాక్షికానుపానములు | ,, |
| తుత్థానుపానములు | 30 |
| శిలాజితుభస్మానుపానము | ,, |
| పారదభస్మానుపానములు | 31 |
| రససిందూరానుపానములు | 32 |
| గ్రంథాంతరే | 33 |
| రసకర్పూరానుపానములు | 35 |
| గంధకానుపానములు | ,, |
| హింగులానుపానములు | 36 |
| అభ్రకానుపానములు | ,, |
| అన్యచ్చ | ,, |
| అన్యచ్చ | 37 |
| అన్యచ్చ | 38 |
| హరితాళానుపానములు | ,, |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| మనశ్శిలానుపానములు | 39 |
| గ్రంథాంతరే | ,, |
| సౌవీరానుపానములు | 40 |
| ఖర్పరానుపానములు | 41 |
| వజ్రభస్మానుపానములు | ,, |
| వైక్రాంతానుపానములు | 42 |
| నీలవైక్రాంతభస్మానుపానములు | ,, |
| ప్రవాళభస్మానుపానములు | ,, |
| రసోపరసాద్యౌషధములకన్నిటికిని కొన్నిరోగములయందనుపానములు | 43 |
| విషానుపానములు | 44 |
| చతుర్థస్తరంగము. | |
| సప్తధాతుశోధన | 49 |
| ఉపధాతు (అనగా) సువర్ణమాక్షిక శోధన | ,, |
| రౌప్యమాక్షికశోధన | 51 |
| తుత్థశోధన | ,, |
| కాంస్యరీతిశోధన | ,, |
| సిందూరశోధన | ,, |
| శిలాజతుశోధన | ,, |
| రససంస్కారము | 50 |
| రసాష్టాదశసంస్కారవివరణము | ,, |
| స్వేదనవిధి | ,, |
| మర్దనవిధి | 52 |
| మూర్ఛనవిధి | ,, |
| ఉత్థాపనవిధి | 53 |
| ఊర్ధ్వపాతనవిధి | ,, |
| అధఃపాతనవిధి | 54 |
| తిర్యక్పాతనము | ,, |
| బోధనము | 55 |
| నియామనము | ,, |
| సందీపనము | ,, |
| రసశోధన | 56 |
| అన్యచ్చ | 57 |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| అన్యచ్చ | 57 |
| (ఉపరసశోధనములు) | |
| గంధకశోధన | ,, |
| హింగుళశోధన | ,, |
| అభ్రకశోధన | 58 |
| హరితాళశోధన | ,, |
| మనశ్శిలశోధన | ,, |
| అన్యచ్చ | 59 |
| ఖర్పరశోధన | ,, |
| కంకుష్ఠాదిశోధన | ,, |
| సర్వోపరసశోధన | ,, |
| (రత్నశోధన) | |
| వజ్రశోధన | ,, |
| సర్వరత్నశోధన | 60 |
| విషశోధన | ,, |
| ఉపవిషశోధన | ,, |
| నేపాళశోధన | ,, |
| పంచమస్తరంగము. | |
| స్వర్ణమారణము | 61 |
| రౌప్యమారణము | ,, |
| తామ్రమారణము | 62 |
| వంగమారణము | 63 |
| జసదమారణము | 64 |
| నాగమారణము | ,, |
| లోహమారణము | ,, |
| స్వర్ణమాక్షికమారణము | 65 |
| రౌప్యమాక్షికమారణము | ,, |
| తుత్థమారణము | ,, |
| కాంస్యము ఇత్తడి వీటిమారణము | ,, |
| సిందూరమారణనిషేధము | ,, |
| శిలాజతుమారణవిధి | 66 |
| మండూరవిధి | ,, |
| రసమారణము | ,, |
| అన్యచ్చ | 67 |

| విషయము. | పంక్తి. |
|---|---|
| రససిందూరవిధి | 67 |
| రసకర్పూరవిధి | ,, |
| హింగుళమారణము | 68 |
| అభ్రికమారణము | 69 |
| గ్రంథాంతరే | ,, |
| అన్యచ్చ | 70 |
| హరితాళమారణము | 71 |
| వజ్రమారణము | ,, |
| ప్రవాళమారణము | 72 |
| సర్వరత్నమారణము | ,, |
| షష్ఠస్తరంగము | |
| పక్వసువర్ణభస్మగుణము | 73 |
| అపక్వసువర్ణభస్మదోషము | 74 |
| అపక్వస్వర్ణదోషశాంతి | 75 |
| పక్వరౌప్యభస్మగుణము | ,, |
| అపక్వరౌప్యభస్మదోషము | 76 |
| అపక్వరౌప్యదోషశాంతి | ,, |
| పక్వతామ్రభస్మగుణము | ,, |
| అపక్వతామ్రభస్మదోషము | 77 |
| అపక్వతామ్రదోషశాంతి | 78 |
| పక్వవంగభస్మగుణము | ,, |
| వంగేశ్వరగుణము | ,, |
| అపక్వవంగభస్మదోషము | 79 |
| అపక్వవంగదోషశాంతి | 80 |
| పక్వజసదభస్మగుణము | ,, |
| అపక్వజసదభస్మదోషము | ,, |
| అపక్వజసదదోషశాంతి | ,, |
| పక్వనాగభస్మగుణము | 81 |
| అపక్వనాగభస్మదోషము | 83 |
| అపక్వనాగదోషశాంతి | ,, |
| పక్వలోహభస్మగుణము | ,, |
| అపక్వలోహభస్మదోషము ఈ హెడ్డింగు 84 పేజీలో శ్లోక ఆరంభమునకు వుంచుకోవలెను | 84 |

| విషయము | పంక్తి. |
|---|---|
| అపక్వలోహభస్మశాంతి | 85 |
| అపక్వలోహజన్యకీటశాంతి | ,, |
| పక్వసువర్ణమాక్షికభస్మగుణము | 86 |
| అపక్వస్వర్ణమాక్షికభస్మదోషము | 87 |
| అపక్వస్వర్ణమాక్షికదోషశాంతి | ,, |
| పక్వరౌప్యమాక్షికభస్మగుణము | ,, |
| అపక్వరౌప్యమాక్షికభస్మ వేకా దోషము | ,, |
| అపక్వరౌప్యమాక్షికదోషశాంతి | 88 |
| తుత్థభస్మగుణదోషములు | ,, |
| అపక్వతుత్థదోషశాంతి | ,, |
| పక్వశిలాజతుభస్మగుణము | ,, |
| అపక్వశిలాజతుభస్మదోషము | ,, |
| అశుద్ధశిలాజతుదోషశాంతి | 89 |
| శుద్ధపారదభస్మపక్వగుణము | ,, |
| అన్యచ్చ | ,, |
| అశుద్ధాపక్వపారదదోషశాంతి | ,, |
| అన్యచ్చ | ,, |
| రససిందూరశుద్ధభస్మగుణము | 91 |
| రససిందూరఅపక్వదోషతచ్ఛాంతి | ,, |
| రసకర్పూరపక్వగుణము | ,, |
| రసకర్పూరఅపక్వదోషము | ,, |
| అశుద్ధరసకర్పూరదోషశాంతి | 92 |
| శుద్ధగంధకభస్మగుణము | ,, |
| అశుద్ధగంధకభస్మదోషము | ,, |
| అశుద్ధగంధకదోషశాంతి | ,, |
| శుద్ధహింగుళగుణము | 93 |
| అశుద్ధహింగుళదోషము | ,, |
| అశుద్ధహింగుళదోషశాంతి | ,, |
| పక్వఅభ్రికభస్మగుణము | ,, |
| గ్రంథాంతరే | 94 |
| మతాంతరే | ,, |
| అపక్వఅభ్రికభస్మదోషము | ,, |
| అపక్వాభ్రికదోషశాంతి | 95 |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| పక్వహరితాళభస్మగుణము | 95 |
| అపక్వహరితాళభస్మదోషము | ,, |
| అపక్వహరితాళభస్మదోషశాంతి | ,, |
| పక్వమనశ్శిలగుణము | 97 |
| అపక్వమనశ్శిలదోషము | ,, |
| అశుద్ధమనశ్శిలదోషశాంతి | ,, |
| శుద్ధసౌవీరభస్మగుణము | 98 |
| అశుద్ధసౌవీరభస్మదోషము | ,, |
| అశుద్ధసౌవీరదోషశాంతి | ,, |
| పక్వఖర్పరభస్మగుణము | ,, |
| అపక్వఖర్పరభస్మదోషము | 99 |
| అశుద్ధఖర్పరభస్మదోషశాంతి | ,, |
| పక్వవజ్రభస్మగుణము | ,, |
| అశుద్ధాపక్వవజ్రభస్మదోషము | ,, |
| అశుద్ధాపక్వవజ్రభస్మదోషశాంతి | 100 |
| పక్వవైక్రాంతభస్మగుణము | ,, |
| అపక్వవైక్రాంతభస్మదోషము | ,, |
| అశుద్ధాపక్వవైక్రాంతభస్మదోషశాంతి | ,, |
| పక్వప్రవాళభస్మగుణము | ,, |
| అపక్వప్రవాళభస్మదోషము | 101 |
| అశుద్ధప్రవాళభస్మదోషశాంతి | ,, |
| మౌక్తికాదిదోషశాంతి | ,, |
| వజ్రమందారయోర్విషశాంతి | ,, |
| విషముష్టివిత్తులదోషశాంతి | ,, |
| అశుద్ధభల్లాతకదోషశాంతి | 102 |
| అశుద్ధకర్పూరదోషశాంతి | ,, |
| అశుద్ధగురుగింజలదోషశాంతి | ,, |
| అశుద్ధగన్నేరువిషదోషశాంతి | ,, |
| అశుద్ధనేపాళగింజలదోషశాంతి | ,, |
| అశుద్ధనవాసాగరదోషశాంతి | 103 |
| శీతలాదాహదోషశాంతి | ,, |
| అశుద్ధవత్సనాభిదోషశాంతి | ,, |
| అశుద్ధఖదిరదోషశాంతి | ,, |
| దుష్టవాతజాదిరోగదోషశాంతి | ,, |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| భ్రమరమాక్షికవిషదోషశాంతి | 104 |
| జంగమవిషదోషశాంతి | ,, |
| కోద్రవధాన్యదోషశాంతి | ,, |
| నాగఫేనవిషదోషశాంతి | ,, |
| మూషకాద్యల్పజంతువిషదోషశాంతి | 105 |
| దంష్ట్రివిషదోషశాంతి | ,, |
| ఉమ్మెత్తవిత్తులవిషదోషశాంతి | ,, |
| వృశ్చికవిషదోషశాంతి | ,, |
| మృగాంకవిషదోషశాంతి | ,, |
| తుమ్మెదలకాటుచేజనించుదోషమునకు శాంతి | 106 |
| సర్పాదివిషదోషశాంతి | ,, |
| పోకలుమొదలగువానిదోషశాంతి | ,, |
| శ్వానవిషదోషశాంతి | ,, |
| సింహబాలవిషదోషశాంతి | ,, |
| శరటవిషదోషశాంతి | 107 |
| యూకాదిదంశనవిషదోషశాంతి | ,, |
| దుష్టజంతువిషదోషశాంత | ,, |
| గృహగోధికావిషదోషశాంతి | ,, |
| చెవులయందుప్రవేశించినజోరీగ వికారశాంతి | ,, |
| శ్వేతమూషకకృతగ్రంధిదోషశాంతి | 108 |
| భ్రమరకృతజలోదరదోషశాంతి | ,, |
| సర్వవిషములదోషశాంతి | ,, |
| **సప్తమస్తరంగము.** | |
| యోగరాజగుగ్గులు | 109 |
| నారాయణచూర్ణవిధి | 110 |
| మత్యుంజయరసనిర్మాణవిధి | 111 |
| వసంతకుసుమాకరసనిర్మాణవిధి | 112 |
| లోకనాధరసనిర్మాణవిధి | 113 |
| స్వర్ణమాలినీవసంతరసనిర్మాణవిధి | 116 |
| బృహన్మాలినీవసంతరసనిర్మాణవిధి | 117 |
| పాశుపతరసనిర్మాణవిధి | ,, |
| పర్పటీరసనిర్మాణవిధి | 118 |

| విషయము. | సంఖ్య. |
|---|---|
| జయావతీనిర్మాణవిధి | 119 |
| జయంతీవటీనిర్మాణవిధి | 120 |
| అష్టమస్తరంగము. | |
| ధాతువులవివరము | 121 |
| ఉపధాతువులు | ,, |
| రసములు | ,, |
| ఉపరసములు | 122 |
| విషములు | ,, |
| ఉపవిషములు | ,, |
| రత్నములు | ,, |
| ఉపరత్నములు | 123 |




# ప్రకటన.

అస్మద్దేశీయులారా! నే నీక్రింద బొందుపరచిన యంశంబులను సావధానం బుగ జదువంగోరెద.

ఇచ్చెన్నపురంబున మత్పితామహుండగు, పిడుగు - సుబ్బరామయ్యాగారు "హిందూరత్నాకరం" బను ముద్రాక్షరశాలను స్థాపించి పెక్కు వైద్య యితర గ్రంథములను ముద్రింపించి సుమారు 20 సంవత్సరములవరకు తచ్ఛాలాకార్యంబులను నిరభ్యంతరముగానున్ను జాగరూకతతోడనున్ను జరిపించుచూవచ్చి కీర్తిశేషులైరి. పదంపడి సుబ్బరామయ్యగారి పుత్రుండును మజ్జనకుండునైన పిడుగు - వెంకట్రావు పంతులుగారున్ను నేనున్ను కలసి సదరు ముద్రాక్షరశాలాకార్యంబులను జరిపించుచూవచ్చితిమి. అయితే యిప్పుడు మా తండ్రిగారు పుత్రుడనైన నన్ను విడనాడి మాకుగల పిత్రార్జితపు సొత్తులను విభజించు కొనియె. ఈ విభజనలో సదరు ముద్రాక్షరశాల నాయధీనంబయ్యె.

చదువరులారా! ఇక మీదట నేనే సదరు ముద్రాక్షరశాలను జరిపించుదును. ఇదివరలో అచ్చుపడినగ్రంథములుగాక ఇతర సంస్కృత ఆంధ్ర గ్రంథములనుకూడా బాగుగా ముద్రింపించి మంచిబైండ్లుతోటి సులభమైన వెలలకే స్వల్పలాభముతోటి విక్రయించ నిశ్చయించియున్నాడను. కనుక నాయందు కరుణవహించి వారివారికి వలయు గ్రంథములకును అచ్చుపనులకును ఆర్డర్లను పంపుదురని వేడుచున్నాడను.

వలయువారలు ఈ క్రింది విలాసమగు నా పేరటికివ్రాసి తెప్పించుకొని నన్ను గౌరవింతురని తమ ఘనతను ప్రార్థించుచున్నాడను.

పిడుగు - వెంకటకృష్ణారావుపంతులు,

ప్రింటర్, పబ్లిషర్ అండ్ బుక్కుసెల్లర్,

2/40, పెద్దునాయుని వీధి, మద్రాసు.



# అనుపానరత్నాకరము.

## ఆంధ్ర తాత్పర్యము.



### ప్రథమస్తరంగము.

శ్లో॥ ప్రణమ్యశ్రీగణేశ్వరంహరంవిష్ణుందివాకరం ।
శివాంరత్నాకరంకుర్వేఽనుపానస్యయథామతి ॥

తా॥ విఘ్నేశ్వరుడు శివుడు విష్ణువు సూర్యుడు పార్వతీదేవి వీరలను నమస్కరించి నాబుద్ధికి గోచరమైనంతవరకు " అనుపానరత్నాకరము " అను గ్రంథమును రచించు చున్నాడను.

#### అనుపానపరిభాష.

శ్లో॥ అమ్లేంకేచిద్విహితామనుష్యామాధుర్యయోగేప్రణయోభవంతి।
తథామ్లయోగేమధురేణతృప్తాస్తేషాంయథేష్టంప్రవదంతిపథ్యం॥

తా॥ కొందరుపులుసుయందు ప్రీతిగలవారును కొందరుతీపుయందు ప్రీతిగలవారుగను మఱికొందరు తీపుగను పుల్లగను నుండు వాటియందు ఆసక్తిగలవారుగను నుందురు. అట్టివారికి హితముగనుండు పథ్యములను వైద్యవేత్తలు చెప్పుచున్నారు. అవి యెట్టివనిన.

శ్లో॥ శీతోష్ణతోయాసవమద్యయూషఫలామ్లధాన్యామ్లపయోరసానాం । యస్యానుపానంతుహితంభవేద్యత్తస్మైప్రదేయంత్విహమాత్రయాతత్ ॥

తా॥ శీతోదకము వుష్ణోదకము చెఱుకుకల్లు కల్లు కట్టు అనగా (పెసలు మొదలగువానిని వుడకపెట్టిననీరు) పండ్లపులుసు ధాన్యములయొక్క పులుసు పాలు

ఫలరసములు వీటియందు యెవనికెవనికి యేయేఅనుపానము హితముగనుండునో అట్టి వారికి ఆయా అనుపానమును ఆయా ప్రమాణప్రకారముగ ఔషధ సహితముగ నియ్యవలయును.

శ్లో॥ వ్యాధించకాలంచవిభావ్యధీరైర్ద్రవ్యాణియోజ్యానిచతానితాని।
సర్వానుపానేషువరంవదంతిమేధ్యంయదంభశ్శుచిభాజనస్థం ॥

తా॥ విద్వాంసులగువారు వైద్యశ్రేష్ఠులు వ్యాధినిన్ని కాలమునున్ను అనుసరించి ఆయా అనుపానములను చేర్చవలయును. మఱియు శుద్ధపాత్రలయందుం (మట్టి పాత్ర) చబడిన శుద్ధోదకము సమస్త అనుపానములయందును శ్రేష్ఠమైనదిగనుండు.

శ్లో॥ లోకస్యజన్మప్రభృతిప్రశస్తాస్తోయాత్మకాస్సర్వరసాశ్చదృష్టాః ।
సంక్షేపఏషోఽభిహితోఽనుపానేష్వతః పరంవిస్తరతోఽభిధాస్యే॥

తా॥ సమస్తరసములును ఉదకాంతర్భూతముగ నుండుటవలన జనులకు జన్మ ప్రభృతి మరణపర్యంతము ఉదకము ప్రశస్తమైన అనుపానమని యెఱుంగవలయు. ఇట్టిఉదకము సమస్త అనుపానములయందు సంక్షేపముగ జెప్పబడినది. ఇకను విశేషముగ అనుపానములను జెప్పబోవుచున్నాను.

శ్లో॥ ఉష్ణోదకానుపానంతుస్నేహానామథశస్యతే।
ఋతేభల్లాతకస్నేహాత్ స్నేహాత్తౌవరకాత్తథా ॥

తా॥ జీడిగింజలు వగరుపదార్థములు వీటియొక్క తైలములకుతప్ప యితరములయిన తైలములకు ఉష్ణోదకము అనుపానమగుచున్నది.

శ్లో॥ అనుపానంవదంత్యేకేతైలేయూషామ్లకాంజకే।
శీతోదకంమాక్షికస్యపిష్టాన్నస్యదసర్వశః ॥

తా॥ కొందరుతైలమునకు పులికట్టు పులికడుగు యివి అనుపానములని చెప్పుచున్నారు. మఱియు తేనె పేలపిండి మొదలయిన పిండిపదార్థములు వీటికి సర్వసమ్మతముగ శీతోదకము అనుపానమగుచున్నది

శ్లో॥ దధిపయసిమద్యార్తేవిషజుష్టేతథైవచ।
కేచిత్పిష్టమయస్యాహురనుపానంసుఖోదకం ॥

తా॥ మద్యము విషము వీటివలన గలిగిన వికారమునకు పెరుగు పాలు యివి అనుపానములగుచున్నవి. పైజెప్పబడిన పేలపిండి మొదలయిన వాటివలన గలిగిన వికారములకు సుఖోష్ణోదకము అనుపానమని కొందరు వచించెదరు.

శ్లో॥ పయోమాంసరసోవాపిశాలిముద్గాదిభోజనాం ।
యుద్ధాద్ధ్వాతపసంతాపవిషమద్యరుజాసుచ ॥

తా॥ సంబావిద్యాను పులగము వీటినిభుజించుట యుద్ధముచేయుట దారినడుచుట యెండవేడిమిచే కొట్టుబడుట నిప్పుసెగచే గాసినొందుట విషపానము మద్యపానము వీటివలన గలిగినరోగములకు పాలుగాని మాంసరసముగాని అనుపానమగుచున్నది.

శ్లో॥ మాషాదేరనుపానంతుధాన్యామ్లందధిమస్తువా ।
మద్యంమద్యోచితానాంతుసర్వమాంసేషుపూజితం ॥

తా॥ మినుములు మొదలయినవాటికి ధాన్యపులుసుగాని పెరుగుగాని పెరుగు మీదితేటగాని అనుపాన మగుచున్నది. మఱియు మద్యపానాభ్యాసము గలవారికి సర్వమాంసములయందును మద్యానుపానమే శ్రేష్ఠమగుచున్నది.

శ్లో॥ అమద్యపానాముదకంఫలామ్లంవాప్రశస్యతే ।
క్షీరంఘర్మాధ్వభాష్యస్త్రీక్లాంతానామమృతోపమం ॥

తా॥ మద్యపానాభ్యాసము లేనివారికి (సర్వమాంసములయందును) వుదకము గాని పులుసుగల పండ్లరసముగాని ప్రశస్తమైన అనుపానముగ నుండు. ఎండమొదలయిన వానివలన గలిగినతాపము మిగులమాటలాడుట స్త్రీసంభోగమువలన గలిగిన శ్రమ వీటికి క్షీరము అమృత తుల్యానుపానముగ నుండు.

శ్లో॥ సురాకృశానాంస్థూలానామనుపానంమధూదకం ।
నిరామయానాంచిత్రంతుభుక్తమధ్యేప్రకీర్తితం ॥

తా॥ చిక్కినవారికి మద్యము అనుపానము బలిసినవారికి వుదక సహితమగు తేనె అనుపానము రోగరహితులకు భోజన మధ్యమునందు నానావిధపదార్థములు అనుపానములని చెప్పబడుచున్నవి.

శ్లో॥ స్నిగ్ధోష్ణంమారుతేపథ్యంకఫేరూక్షోష్ణమిష్యతే ।
అనుపానంహితంచాపిపిత్తేమధురశీతలం ॥

తా॥ వాతరోగమునకు కొంచెము వుష్ణముగనుండు పదార్థమున్ను కఫరోగమునకు మిక్కిలి వుష్ణపదార్థమున్ను పిత్తరోగమునకు తీపుగను చల్లగనుండు పదార్థమున్ను హితమైన అనుపానముగ నుండును.

శ్లో॥ హితంశోణితపిత్తిభ్యఃక్షీరమిక్షురసస్తథా ।
అర్కశేలుశిరీషాణామాసవాస్తువిషార్తిషు ॥

తా॥ రక్తపిత్తరోగముగల వారలకు పాలుగాని చెరుకురసముగాని అనుపానముగనుండు. విషజనిత రోగముగలవారలకు జిల్లేడు విరిగి దిరిశన వీటియొక్క మద్యములు అనుపానములుగ నుండు.

శ్లో॥ అతఃపరంతువర్ణానామనుపానంపృథక్పృథక్ ।
ప్రవక్ష్యామానుపూర్వేణసర్వేషామేవమేశ్రుణు ॥

తా॥ ఇకమీదట వర్గములన్నిటికి అనుపానములను వేర్వేరుగ చెప్పబోవుచున్నాను.

శ్లో॥ భవంతిచాత్రసర్వేషాంమాహేంద్రంతోయముత్తమం ।
సాత్మ్యంయస్యతుయత్తోయంతత్తస్మైహితముచ్యతే ॥

తా॥ మహేంద్రోదకము సమస్త అనుపానముల యందును వుత్తమమైనది. ఎవనికి యేవుదకము వికారమును కలుగజేయకుండునో ఆవుదకము వానికి హితముగ నుండునని చెప్పబడును.

శ్లో॥ వుష్ణంవాతేకఫేతోయంపిత్తేరక్తేచశీతలం ।
దోషవద్గురువాభుక్తమతిమాత్రమథాపివా ।
యథోక్తేనానుపానేనసుఖమన్నంప్రజీర్యతే ॥

తా॥ వాతరోగము కఫరోగము వీటియందు వుష్ణోదకమును. పిత్తరోగము రక్తజనితరోగము వీటియందు శీతోదకమును అపానములుగ నుండును. భుజింపబడిన పదార్థము వాతపిత్తశ్లేష్మములలో నేదైన కలుగజేయునదిగ నుండినను గురుత్వమును గలుగజేయునదిగ నుండినను అధికమైనను పైచెప్పబడిన వుచితానుపానముల చేత జీర్ణింపబడును.

శ్లో॥ రోచనంబృంహణంవృష్యందోషసంఘాతభేదనం ।
తర్పణంమార్దవకరంశ్రమక్లమహారంసుఖం ॥
దీపనందోషశమనంపిపాసాచ్ఛేదనంపరం ।
బల్యంవర్ణకరంసమ్యగనుపానంసదోచ్యతే ॥

తా॥ ఏయేపదార్థమునకు ఏయేఅనుపానము వుచితముగ జెప్పబడియున్నదో ఆయా అనుపానము రుచికరముగను వృద్ధికరమైగను వీర్యవృద్ధికరముగను సమస్తదోషములను పోగొట్టునదిగను తృప్తికరముగను మృదుత్వమును కలుగజేయునదిగను శ్రమము గ్లాని వీటినిపోగొట్టునదిగను బలకరముగను కాంతిని కలుగజేయునదిగను నుండు.

శ్లో॥ తదాదౌకర్షయేత్పీతంస్థాపయేన్మధ్యసేవితం ।
పశ్చాత్పీతంబృంహయతితస్మాద్వీక్ష్యప్రయోజయేత్ ॥
స్థిరతాంగతమక్లిన్నమన్నమద్రవపాయినాం ।
భవత్యాబాధజననమనుపానమతఃపిబేత్ ॥

తా॥ అట్టిఅనుపానము భోజనాదియందు సేవింపబడ సేని శరీరమునకు దౌర్బల్యము మధ్యమునందు సేవింపబడ సేని భుజింపబడిన పదార్థమును శరీరమునందు యిమిడికయు భుజింపబడిన పిదప సేవింపబడ సేని శరీరపుష్టి వీటిని గలుగంజేయుగాన చక్కగ ఆలోచించి అనుపానములను పైజెప్పబడిన ప్రకారముగ సేవింప వలయును. ద్రవపదార్థమును సేవించినవారికి భుజింపబడిన అన్నము మృదుత్వమును జెందక స్థిరత్వమును పొందినదై శరీరమునకు భాధను గలుగజేయుగాన అనుపానమును తప్పక సేవింపవలయు.

శ్లో॥ నపిబేచ్ఛ్వాసకాసార్తోరోగేచాప్యూర్ధ్వజత్రుగే ।
క్షతోరస్కఃప్రసేకీచయస్య చోపహతస్స్వరః ॥

తా॥ శ్వాస కాసరోగములు గలవాడును ఊర్ధ్వజత్రురోగము గలవాడును రొమ్మునొప్పి గలవాడును ప్రసేకరోగము గలవాడును హీనస్వరము గలవాడును యిట్టిరోగములు ప్రకోపించి యున్నపుడు వుదకమును పానము చేయకూడదు.

శ్లో॥ పీత్వాఽధ్వభాష్యాధ్వయనగేయస్వప్నాశీలయేత్ ।
ప్రదూష్యామాశయంతద్ధితస్యకంఠోరసిస్థితం ॥
స్యందాగ్నిసాదచ్ఛర్ద్యాదీనామయాన్ జనయేద్బహూన్ ॥

తా॥ అనుపానమును సేవించిన తోడనే దూరినడచుట మిగుల సంభాషించుట అధ్యయనము చేయుట గానము చేయుట నిద్రించుట వీటిని వర్జింపవలయును. అటుల వర్జింపనియెడల పానముజేయఁబడిన అనుపానము ఆమాశయమును చెరిచి కంఠము రొమ్ము వీటియందునిలచి వోకరించి కఫముపడుట అగ్నిమాంద్యము వమనము యివి మొదలైన అనేకరోగములను గలుగఁజేయు.

శ్లో॥ గురులాఘువచింతేయంస్వభావంనాతివర్తతే।
తథాసంస్కారమాత్రాంతకాలాంశ్చాపేక్ష్యతరోత్తరం॥

తా॥ మనుష్యునియొక్క స్వభావము సంస్కారము ప్రమాణము రోగాంత కాలము వీట్లయొక్క న్యూనాధిక భావముల ననుసరించి అధికముగగాని లఘువుగగాని అనుపానమును సేవించవలయును.

శ్లో॥ మందకర్మానలారోగ్యాఃసుకుమారాస్సుఖోచితాః।
జన్తవోయేతుతేషాంహిచింతేయంపరికీర్తితా॥

తా॥ మందముగ పనిజేయువారు మందాగ్నిగలవారు మిగుల ఆరోగ్యము నపేక్షించువారు సుకుమారులుగ నుండువారిని ఆట్టివారికి పైచెప్పబడిన అనుపానములు విధింపబడియున్నవి.

శ్లో॥ బలినఃకరభక్ష్యాశ్చయేచదీప్తాగ్నయోనరాః।
కర్మనిత్యాశ్చయేతేషాంనావస్యంపరికీర్తయేత్॥

తా॥ యెట్టివారు బలవంతులుగను కఠినభక్షణ చేయువారుగను అగ్నిదీపము గలవారుగను యెల్లపుడు పనిచేయువారుగను నుందురో అట్టివారికి పైజెప్పబడిన అనుపానములు అవస్యకముగావు.

## కొన్నిరోగములకు క్షీరానుపానము.

శ్లో॥ క్షీరోచితస్యప్రక్షీణశ్లేష్మణోదాహతృడ్వతః।
క్షీరంపిత్తానిలార్తస్యపథ్యమప్యతిసారిణః॥

తా॥ క్షీణశ్లేష్మము తాపము దప్పి పిత్తము వాతము వీటిచేపీడ అతిసారము యివిగలవానికి పాలు అనుపానముగ నుండు.

శ్లో॥ తద్వపుర్లంఘనోత్తప్తంప్లుష్టంవనమివాగ్నినా ।
దివ్యాంబుజీవనోత్తస్యజ్వరంచాశునియచ్ఛతి ॥

తా॥ కార్చిచ్చుచే దహింపబడిన వనము వర్షోదకముచే మరలచిగిరించు చందంబున లంఘనముచేత గాశిజెందినవాడు యెండచేత తపింపబడినవాడు క్షీరాముపానముచే జీవించు. అట్టివానికిజ్వరము శీఘ్రముగనశించు.

శ్లో॥ సంస్కృతంశీతముష్ణంవాతస్మాద్ధారోష్ణమేవవా ।
విభజ్యకాలేయుంజీతజ్వరిణాంహన్త్యతోన్యథా॥

తా॥ కాగిచల్లారియు లేక కొంచము వుష్ణముగను లేక ధారోష్ణముగనుండు పాలును కాలమునుతెలిగి జ్వరపీడితుడు సేవింపవలయు. కాచబడినదియును ధారోష్ణముగ నుండనిదియునునైన పాలను జ్వరపీడితుడు సేవించెనేని మృత్యువశుడగును.

శ్లో॥ పయస్సశుంఠీఖర్జూరమృద్వీకాశర్కరాఘృతం ।
శృతశీతంమధుయుతంతృడ్దాహజ్వరనాశనం ॥
తద్వద్ద్రాక్షాబలాయష్టీసారివాకణచందనైః ।
చతుర్గుణేనాంభసావాపిప్పల్యావాశృతంపిబేత్ ॥

తా॥ పాలయందు శొంఠి ఖర్జూరపుకాయ ద్రాక్ష వీటిలో నేదినైననువైచి కాచి అందుశర్కరగాని నెయ్యిగాని తేనెగానివైచి చల్లార్చి అనుపానముగ సేవించిన యెడల దప్పి తాపము వీటిని నివర్తింపజేయు. మఱియు ద్రాక్ష చిట్టాముదపువేరు యష్టిమధుకము సుగంధపాలవేరు పిప్పలి చందనము వీటినివైచి కాసబడిన పాలు సేవింపబడినను లేక పాలకు నాలుగింతలు వుదకము పోసి పిప్పలివైచి నీరంతయు యిగురునటులకాచి సుఖోష్ణముగ పానముచేసినను జ్వరమును నశింపజేయు.

శ్లో॥ కాసాచ్ఛ్వాసాచ్ఛిరశ్శూలాత్పార్శ్వశూలాచ్చిరజ్వరాత్ ।
ముచ్యతేజ్వరితఃపీత్వాపఞ్చమూలీశృతంపయః ॥

తా॥ జ్వరముగలవాడు పంచమూలములను పాలలోనైచి కాచి అనుపానముగ సేవించిన యెడల చిరకాలజ్వరము నశించుటయేగాక కాస శ్వాస తలనొప్పి పార్శ్వశూల యివిగూడనశించు.

శ్లో॥ శృతమేరండమూలేనబాలంబల్వేనవాజ్వరాత్ ।
ధారోష్ణంవాపయఃపీత్వావిబద్ధానిలవర్చసః ॥

తా॥ పాలయందు ఆముదపువేరునుగాని లేక విష్ణుక్రాంతములనుగాని వైచికాచి అనుపానముగ సేవించినను లేక పాలను ధారోష్ణముగ సేవించినను జ్వరము మల బద్ధము యివి నశించు.

శ్లో॥ సరక్తపిత్తాతిసృతేస్సతృట్ శూలప్రవాహికాత్ ।
సిద్ధంశుంఠీబలావ్యాఘ్రీగోకంటకగుడైఃపయః ॥

తా॥ పాలయందు శొంఠి చిట్టాముదపువేరు వాకుడు పల్లేరు బెల్లము వీటిని వైచికాచి అనుపానముగ సేవించిన రక్తపిత్తము అతిసారము దప్పితో కూడిన శూల భేదులు యివి నివర్తించు.

శ్లో॥ శోథమూత్రశకృద్వాతవిబంధజ్వరకాసజిత్ ।
వృశ్చీకబిల్వవర్షాభూసాధితంజ్వరశోథనుత్ ॥
శిరీషసారసిద్ధంవాక్షీరమాశుజ్వరాపహం ॥

తా॥ తెల్లగలిజేరు బిల్వము గలిజేరు వీట్లను పాలయందువైచి కాచి అనుపానముగ సేవించినను లేక యిరుగుడు రసమునువైచి కాచి త్రాగినను శోఫ మూత్రరోగము భేదులు వాతము మలమూత్రములను బంధించు రోగము జ్వరకాస జ్వరశోఫ కేవలజ్వరము యివి నివర్తించు.

శ్లో॥ సౌభాగ్యపుష్టిబలశుక్రవివర్ధనాని కింసన్తినోభువిబహూనిరసాయనాని । కందర్పవర్ధినీపరంతుసితాజ్యయుక్తాదుగ్ధాదృతేన మమకోపిమతఃప్రయోగః ॥

తా॥ శరీరకాంతి శరీరపుష్టి బలము వీర్యవృద్ధి కామవృద్ధి వీటిని గలుగజేయుటకు అనేక రసాయనములుండినప్పటికిన్ని పాలనుకాచి అందు తెల్లశర్కర నెయ్యి వీటినివైచి సేవించిన పైజెప్పబడిన గుణములను గలుగజేయుటకు యితర రసాయనములు యీప్రయోగముతో సమానములుగావు.

## యోగరాజగుగ్గుల్వనుపానములు.

శ్లో॥ రాస్నాదికాథసంయుక్తోవివిధంహంతిమారుతం ।
కాంకోల్యాదిశ్రితాత్పిత్తంకఫమారగ్వధాదినా ॥
దార్వీశ్రితేనమేహాంశ్చగోమూత్రేణవపాండుతాం ।

మేదోవృద్ధించమధునాకుష్ఠేనింబస్యతేనవా।
చ్ఛిన్నాక్వాధేనవాతాస్రంశోథంశూలంకణాత్రితా॥
పాటలాక్వాథసహితోవిషమూషకజంజయేత్।
త్రిఫలాక్వాథసహితోనేత్రార్తింహంతిదారుణాం॥
పునర్నవాదేఃక్వాథేనహన్యాత్సర్వోదరాణ్యపి॥

తా॥ రోగరాజగుర్గులు అనేఔషధమును రాస్నాది కషాయముతో సేవించిన నానావిధములయిన వాతములు నశించు. కాకోల్యాది కషాయముతో సేవించిన పిత్తరోగమునశించు. ఆరగ్వధాది (రేల) కషాయముతో సేవించిన కఫరోగము నివర్తించు. మానిపసపు కషాయముతో సేవించిన మేహరోగములు నివర్తించు. గోమూత్రముతో సేవించిన పాండురోగము నశించు. తేనెతో సేవించిన మేదోవృద్ధి (అధికబలుపు) నశించు. వేపకషాయముతో సేవించిన కుష్ఠురోగముతోంకు తిప్పతీగ కషాయముతో సేవించిన వాతరక్తరోగము నివర్తించు. పిప్పలికషాయముతో సేవించిన శోఫ శూల యునివర్తించు. మొక్కపుచెట్టువేరు కషాయముతో సేవించిన యెలుకవిషము నశించు. త్రిఫలకషాయముతో సేవించిన దారుణమైన నేత్రరోగము నివర్తించు. పునర్నవాది (గలిజేరు) కషాయముతో సేవించిన సమస్త ఉదరరోగములు నశించు.

నారాయణ చూర్ణానుపానములు.

శ్లో॥ దద్యాద్యుక్తానుపానేనతథాధ్మానేసురాదిభిః।
గుల్మేబదరనీరేణవిట్సంగేదధిమస్తునా॥
ఉష్ణాంబుభిశ్చాజీర్ణేచవృక్షామ్లైఃపరికర్తృషు।
ఉష్ట్రీదుగ్ధేనోదరేషుతథాతక్రేణవాగవాం।
ప్రసన్నయావాతరోగేదాడిమాంభోభిరర్శసి।
ద్వివిధేచవిషేదద్యాత్ఘృతేనవిషనాశనం॥
చూర్ణంనారాయణంనామదుష్టరోగగణాపహం॥ 

తా॥ నారాయణ చూర్ణమును ఆయారోగములకు తగిన అనుపానములతో నివ్వవలయును. ఎట్లన్నను; మద్యము మొదలయిన వాటితో నారాయణచూర్ణమును సేవించిన కడుపుబ్బరము నివర్తించు. రేగుకషాయముతో సేవించిన గుల్మరోగము తొలగు. పెరుగుతేటతో సేవించిన మలబద్ధము నశించు. వుష్ణోదకముతో సేవించిన

అజీర్ణరోగము నివర్తించు. వృక్షామ్లములతో సేవించిన గుదరోగము నశించు. ఒంటె పాలతో సేవించిన వుదరరోగములు నివర్తించు. కల్లుతో సేవించిన వాతరోగము నశించు. దాడిమఫలరసముతో సేవించిన అర్శోరోగము (మూలవ్యాధి) నశించు. తేనెతో సేవించిన ద్వివిధవిషములు నశించు. ఇట్టిగుణములుగల నారాయణచూర్ణమును సేవించిన అనేక రోగములను బోగొట్టునని తాత్పర్యము.

## నిర్గుండ్యానుపానములు.

శ్లో॥ ప్రస్థనిర్గుండిచూర్ణస్యగోమూత్రేణసమంపిబేత్ ।
దశరాత్రప్రయోగేనకుష్ఠనాశోద్భవేద్ధ్రువం॥

తా॥ 16 పలములవావిలిచూర్ణమును గోమూత్రములోవైచి దానిని 10 భాగములుచేసి 10 దినములు సేవించిన కుష్ఠురోగము నివర్తించు.

శ్లో॥ నిర్గుండీచూర్ణమాదాయఘృతేనసహభక్షయేత్ ।
కృశస్తుదుర్బలోవాపీబలవీర్యయుతోభవేత్ ॥

తా॥ చిక్కిపోయిన వాడుగాని దుర్బలుడుగాని నిర్గుండీ చూర్ణమును నేతితో సేవించిన బలము వీర్యవృద్ధి వీటలతో గూడుకొన్న వాడగును.

శ్లో॥ నిర్గుండీచూర్ణమాదాయపిబేదుష్ణేనవారిణా ।
సప్తరాత్రప్రయోగేనరోగముక్తోభవేన్నరః ॥

తా॥ ఉష్ణోదకముతో 7 దినములు నిర్గుండీ చూర్ణమును సేవించిన సర్వరోగములు నివర్తించు.

శ్లో॥ నిర్గుండీమూలముద్ధృత్యగృహేచధారయేద్బుధః ।
నస్యంతిసర్వవిఘ్నానిగృహాన్నాగాశ్చసర్వశః ॥

తా॥ ఎవనియింట్లో వావిలివేరు వుంచబడియున్నదో వానిగృహమునందు విఘ్నములు లేకుండుటయేగాక సర్పములు సహా తొలగిపోవును.

## భృంగరాజానుపానములు.

శ్లో॥ భృంగరాజపత్రైర్రసంకృష్ణజీరసమంపిబేత్ ।
త్రైలేసహసంధద్యాన్నవలీపలితవర్జితః ॥

తా॥ గుంటగలగరాకు రసమును నల్లతీగెతోగాని సెగ మంచినూనెతోగాని చేర్చి అనుపానముగ సేవించిన వార్ధికమువలన గలిగిన శరీర శైథిల్యము వెంట్రుకలు నరసిపోవుట యివితొలగి యవ్వనమును జెందు.

శ్లో॥ భృంగరాజరసంచైవగుడూచీరససంయుతం।
మాసమాత్రప్రయోగేనసర్వవ్యాధివినశ్యతి।

తా॥ గుంటగలగరాకు రసమును తిప్పతీగె రసములోచేర్చి మాసమాత్రము సేవించిన సర్వరోగములు నివర్తించు.

సకలరోగములకు హారీతక్యాదిపానములు.

శ్లో॥ సితాయుక్తాచశరదీహేమంతేనాగరేణచ।
శిశిరేపిప్పలీయుక్తావసంతేమధునాసహ।
గ్రీష్మేచగుడసంయుక్తావర్షాసులవణేనచ।
అనేనైవవిధానేనభక్షయేద్యోహరీతకీం।
తస్యవృద్ధిర్బలంవీర్యంమారోగ్యంస్థిరయౌవనం।
అగ్నిర్దహతికాష్ఠానితనురోగాన్హరీతకీ।
కదాచిత్కుప్యతేమాతానోదరస్థాహరీతకీ।
మాతేవసర్వదాజ్ఞేయాహితధాత్రీహరీతకీ॥

తా॥ కరకచూర్ణమును శరదృతువునందు తెల్లశర్కరతోను హేమంత ఋతువునందు శొంఠిచూర్ణముతోను శిశిరఋతువునందు పిప్పలిచూర్ణముతోను వసంత ఋతువునందు తేనెతోను గ్రీష్మఋతువునందు బెల్లముతోను వర్షర్తువునందు లవణముతోను యీ ప్రకారముగ యెవడు సేవించుచున్నాడో అట్టిమనుజునికి వృద్ధి బలము వీర్యము పుట్టి ఆరోగ్యము స్థిరయౌవనము యివి గలుగుటయేగాక అగ్నికట్టెలను దహించ జేయుచందంబున సమస్తరోగములను సగా నివర్తింపజేయు. తల్లి పుత్రునికాపాడురీతి పూర్వోక్తప్రకారముగ సేవింపబడిన కరకచూర్ణము తన్నుసేవించిన వానిని కాపాడును.

అన్యచ్చ.

శ్లో॥ గ్రీష్మేతుల్యగుడాంసుసైంధవయుతాంమేఘావనద్ధాంబరే।
తుల్యాంశర్కరయాశరద్యమలయాశుంఠ్యాతుషారాగమే।

శ్లో॥ పిప్పల్యాశ్శర్కరేవసంతసమయేక్షౌద్రేణసంయోజితాం।
రాజన్ప్రాప్యహరీతకీమివరుజోనశ్యంతితేశత్రవః॥

తా॥ గ్రీష్మఋతువునందు కరకచూర్ణమును బెల్లముతో సమముగచేర్చి సేవించినను. వర్షఋతువునందు సైంధవలవణముతో సమముగచేర్చి సేవించినను శరదృతువునందు తెల్లచక్కెరతో సమముగచేర్చి సేవించినను హేమంతఋతువునందు శొంఠి చూర్ణముతో సమముగచేర్చి సేవించినను శిశిరఋతువునందు పిప్పలిచూర్ణముతో సమముగ చేర్చి సేవించినను వసంతఋతువునందు తేనెతో చేర్చి సేవించినను శూరత్వము జెందిన రాజెదట శత్రువులు నశించు చందంబున సమస్తరోగములు నశించు.

గుడూచ్యానుపానములు.

శ్లో॥ ఘృతేనవాతంసగుడావిబంధంపిత్తంసితాఢ్యామధునాకఫంచ।
వాతాస్రముగ్రంరుబుతైలమిశ్రా శుంఠ్యావాతంశమయేద్గు
డూచీ॥

తా॥ తిప్పసత్తును నేతితో సేవించిన వాతరోగము నివర్తించు. బెల్లముతో సేవించిన మలమూత్ర కట్టురోగము నశించు. తెల్లచక్కెరతో సేవించిన పిత్తరోగము నివర్తించు. తేనెతో సేవించిన కఫరోగము నశించు. ఆముదముతో సేవించిన వాత రక్తరోగము నివర్తించు. శొంఠిచూర్ణముతో సేవించిన ఆమవాతరోగము నశించు.

శ్లో॥ అమృతాస్వరసోహంతిక్షౌద్రయుక్తోహికామలాం।
శార్ఙ్గధరేణ ప్రోక్తత్వాద్శ్లోకోయంరచితోమయా॥
సమధుచ్ఛిన్నాస్వరసోనానామేహనివారణం।
వదంతిభిషజస్సర్వేశరదిందునిభాననే॥

తా॥ తిప్పతీగరసము తేనెతో సేవించిన కామిలారోగము సమస్తప్రమేహ రోగములు యివినివర్తించు.

శ్లో॥ జీర్ణజ్వరంకఫకృతం కణయాసమేతశ్ఛిన్నోద్భవోహ్యాధకషా యకపపహంతి॥

తా॥ తిప్పతీగ కషాయమునందు పిప్పలిచూర్ణమును వైచి సేవించిన కఫజన్య జీర్ణజ్వరము నివర్తించును.

శ్లో॥ అమృతాశ్వాథకల్కాభ్యాంసక్షీరంవిపచేద్ఘృతం ।
పాతరక్తంజయత్యాశుకుష్ఠంజయతిదుస్తరం ॥

తా॥ తిప్పతీగ కషాయము తిప్పతీగకల్కము పాలు వీట్లను నేతిలోవైచి పక్వముగవండి ఘృతముచే దానిని సేవించిన వాతరక్తము కుష్ఠము యివి నివర్తించు.

శ్లో॥ గుడూచీస్వరసఃకర్షంక్షౌద్రంస్యాన్మాషకోన్మితం ।
సైంధవంక్షౌద్రతుల్యంస్యాత్సర్వమేకత్రమర్దయేత్ ॥
అంజయన్నయనంతేనపిల్లార్మతిమిరంజయేత్ ।
కాచకండూలింగనాశంశుక్లాకృష్ణాగతాన్గదాన్ ॥

తా॥ కర్షమాత్రము తిప్పతీగెరసము మాషప్రమాణము తేనె మాషప్రమాణము సైంధవలవణము వీటినన్నిటిని యేకముజేసి మర్దించి నేత్రమునకు అంజనము వేసికొనిన పిల్లార్మయనే నేత్రరోగము తిమిరరోగము కాచరోగము కండ్లయందు దురద లింగనాశనము (అనగా గురుతు తెలియకపోవుట) వల్ల తెల్ల గుడ్లయందలి రోగము వీటిని నివర్తింపజేయు.

నేత్రరోగమునకు పునర్నవానుపానము.

శ్లో॥ దుగ్ధేనకండూంక్షౌద్రేణనేత్రస్రావంచసర్పిషా ।
పుష్పంతైలేనతిమిరంకాంజికేననిశాంధతా ॥
పునర్నవాజయత్యాశుభాస్కరస్తిమిరంయథా ॥

తా॥ గలిజేరురసమును పాలతో రంగరించి నేత్రములకు అంజనమిడిన కండ్లదురద తేనెతో రంగరించి అంజనమిడిన నేత్రస్రావము నేతితో రంగరించి అంజనమిడిన కండ్లయందలి పూలు మంచినూనెతో రంగరించి అంజనమిడిన తిమిరరోగము కడుగు నీటితో రంగరించి అంజనమిడిన రేచీకటి వీటిని సూర్యుడు అంధకారమును తొలగించు చందంబున యీయంజనము తొలగించు.

త్రిఫలానుపానములు.

శ్లో॥ ఏకాహరీతకీయోజ్యాద్వౌచయోజ్యౌవిభీతకౌ ।
చత్వార్యామలకాన్యేవత్రిఫలైషాప్రకీర్తితా ॥
త్రిఫలాశోథమేహఘ్నీనాశయేద్విషమజ్వరాన్ ।
దీపనీశ్లేష్మపిత్తఘ్నీకుష్ఠహంత్రీరసాయనీ ।
సర్పిర్మధుభ్యాంసంయుక్తాసైవనేత్రామయాన్జయేత్ ॥

తా॥ కరక్కాయ 1 భాగము తాండ్రికాయ 2 భాగములు, ఉసిరికపట్టు 4 భాగములు వీటినన్నిటిని, చేకముగజేర్చి చూర్ణముచేసినట్టి చూర్ణమును త్రిఫలయని బడును. ఈ త్రిఫలచూర్ణమును సేవించిన శోఫ, మేహము, విషమజ్వరములు శ్లేష్మము పిత్తము కుష్ఠరోగము వీటిని నివర్తింపం జేయుటయేగాక అగ్నిదీపనమును సగాగల్గు గంజేయును. మఱియు యీ చూర్ణమును నెయ్యి తేనె వీట్లతో రంగరించి నేత్రముల కంజనమిడిన నేత్రరోగములన్నిటిని నివర్తింపజేయును.

శ్లో॥ ఫలత్రికోద్భవంక్వాథంగోమూత్రేణైవపాయయేత్ ।
వాతశ్లేష్మకృతంహంతిశోథవృషణసంభవం ॥

తా॥ త్రిఫల కషాయమును గోమూత్రముతో వండి సేవించిన, వాతశ్లేష్మజనిత రోగము బీజమువాచుట వీటిని నశింపంజేయును.

శ్లో॥ క్షౌద్రేణత్రిఫలాక్వాథఃపీతోమేదహరఃస్మృతః ।
శీతీభూతంతథోష్ణాంబుమేదోహృత్క్షౌద్రసంయుతః ॥

తా॥ త్రిఫల కషాయమునందు తేనెవైచి చేర్చిగాని లేక చల్లారిన వేడినీళ్ళు తేనె యీరెంటిని చేర్చిగాని పుచ్చుకొనిన మేదోరోగము నివర్తించు.

శ్లో॥ త్రిఫలారగ్వధక్వాథశ్శర్కరాక్షౌద్రసంయుతః ।
రక్తపిత్తహరోదాహపిత్తశూలనివారణః ॥

తా॥ త్రిఫలములు రేలవిత్తులు వీటిని కషాయముకాచి అందు శర్కర తేనె వీటినివైచి సేవించిన రక్తపిత్తము తాపము పిత్తము శూల వీటిని నివర్తింపంజేయును.

శ్లో॥ త్రిఫలాయారసక్షౌద్రయుక్తోజయతికామిలాం ।
శార్ఙ్గధరేణచోక్తత్వాచ్ఛ్లోకోయంరచితోమయా ॥
మృతాయస్త్రిఫలాయష్టిచూర్ణంమధుఘృతాన్వితం ।
దినాంతేలేఢినిత్యంసరతౌచటకవద్భవేత్ ॥

తా॥ త్రిఫల కషాయమునందు తేనెవైచి పుచ్చుకొనిన కామిలారోగము నివర్తించు. మఱియు అయోభస్మము త్రిఫలచూర్ణము యెష్టిమధుకచూర్ణము వీటిని సేకముగజేర్చి అందు నెయ్యిగాని తేనెగానివైచి రంగరించి ప్రతిదినము రాత్రుల యందు సేవించిన మగపిచ్చుకవలె స్త్రీసంభోగమునందు పటుత్వముగలవాడగును.

గద్య॥ ఇతి శ్రీమదాంధ్రభాషానువాదభూషితే, అనుపానరత్నాకరే.
అన్నపథ్యానుపానవివేకకథనంనామ ప్రథమస్తరంగః.

శ్రీరస్తు.

# అనుపానరత్నాకరము.

## ఆంధ్ర తాత్పర్యము.

## ద్వితీయ స్తరంగము

### మృత్యుంజయాదిరసములకు అనుపానములు.

శ్లో॥ మృత్యుర్వినిర్జితో యస్మాత్తేన మృత్యుంజయో రసః
మధునా లేహనం ప్రోక్తం సర్వజ్వరనివృత్తయే ॥
దధ్యుదకానుపానేన వాతజ్వరనిబర్హణః ।
ఆర్ద్రకస్వరసైః పానం దారుణే సన్నిపాతకే ॥
జమ్బీరద్రవయోగేన హన్త్యాజీర్ణజ్వరం నాశనః ॥
అజాజీగుడసంయుక్తో విషమజ్వరనాశనః ॥

**తా॥ ఈరసము మృత్యువును జయించునది కాబట్టి మృత్యుంజయ రసమనం బడు దీనిని తేనెతో సేవించిన జ్వరము పెరుగుమీది తేటతో సేవించిన వాతజ్వరము అల్లపురసముతో సేవించిన దారుణమగు సన్నిపాతము నిమ్మపండ్లరసముతో సేవించిన అజీర్ణజ్వరము బెల్లముతో గూడిన జీలకఱ్ఱ కషాయముతో సేవించిన విషజ్వరము వీటిని నివర్తింపఁజేయు.**

### వసంతకుసుమాకర రసానుపానములు.

శ్లో॥ శిలాజితుమధూపస్త్రైః క్షయగదేషుసర్వేష్వపి ప్రమేహ్వార్దుజరా
త్రిభిస్సమధుశర్కరాభిస్సహ । సితామలయుగ్మద్రవైర్మహాతి
రక్తపిత్తేథవాసితామధుసమన్వితైర్వృషభపల్లవానాంద్రవైః।
త్రిజాతగజచందనైరపి చతుష్టిపుష్టిప్రదో మనోభవకరోపరోప
విషుశంఖపుష్పీరసైః । అభీరుకరసశర్కరామధుభిరస్త్రపిత్తా
మయేపరేషుతుయుగ్మదిసంనుగిదేషుసంయోజయేత్ ॥

తా॥ వసంతకుసుమాకర రసమును తేనెతోఁజాది అందు శిలాజత్తుభస్మము త్ర్యూషణములు వీటినిచేర్చి సేవించిన సమస్తమగు క్షయలు మానివసపుచూర్ణము శర్కర వీటిని తేనెలోవైచి యీ అనుపానముతో సేవించిన ప్రమేహములు చందన కషాయములో తెల్లచక్కెర వైచి దానితో సేవించినను లేక వృషభకమనుచెట్టు చిగుళ్ల రసమునందు తెల్లచక్కెర తేనెవైచి దానితో సేవించినను మిగుల ప్రకోపముగనుండు రక్తపిత్తము వీటిని నివర్తింపఁజేయును. త్రిజాతకము గజపిప్పలి చందనము వీటినిచేర్చి కషాయముకాచి దానితో సేవించిన సంతోషము శరీరపుష్టి కామవృద్ధి వీటినిగలుగం జేయును. శంఖపుష్పీ రసముతో సేవించిన వమనము పిల్లపీచర రసమునందు శర్కర తేనె వీటినిచేర్చి దానితో సేవించిన అమ్లపిత్తము యివినశించు. మఱియు యితరరోగములయందు తగునైన అనుపానములతో సేవించిన ఆయారోగములు నివర్తించు.

## లోకనాథ రసానుపానములు.

శ్లో॥ అరుచౌనిస్తుషంధాన్యంఘృతభృష్టంసశర్కరం। దద్యాత్తథా జ్వరేధాన్యం గుడూచీక్వాథమాహరేత్ ॥ ఉశీరవాసక క్వాథం దద్యాత్సమధుశర్కరం। రక్తపిత్తే కఫేశ్వాసేకాసే చస్వరసంక్షయే ॥ అగ్నిభృష్ట జయాచూర్ణం మధునానిశిదే యతే।నిద్రానాశేఽతిసారేచగ్రహణ్యాంమందపావకే ॥ స్నావ ర్చలాభయాకృష్ణా చూర్ణముష్ణజలైఃపిబేత్ । శూలేజీర్ణే తథాకృష్ణా మధుయుక్తాజ్వరేహితా । ప్లీహ్నోదరేవాత రక్తేశ్ఛర్ద్యాంచైవగుడాంకురే ॥ నాసికాదిషురక్తేషురసందా డిమపుష్పజం। దూర్వాయాస్స్వరసంనస్యందద్యాచ్ఛర్కర యాయుతం ॥ కోలమజ్జాకణాబర్హి పక్షభస్మాసశర్కరం॥ మధునాలేహయేచ్ఛర్దిహిక్కాకోపస్యశాంతయే । విధిరేష ప్రయోజ్యస్తుసర్వస్మిన్పోట్టలిరసే । మృగాంకేహేమగర్భేచ మౌక్తికాఖ్యేరసేతథా । ఇత్యయంలోకనాథాఖ్యో రసస్సర్వ రుజోజయేత్॥

తా॥ లోకనాథరసమును ధనియాలను చక్కగదంచి పొట్టుతీసి దానిని వేయించి చూర్ణముచేసి అందులోశర్కరకలిపి యీ అనుపానముతో సేవించిన అరుచి రోగము నివర్తించు. ధనియాలు తిప్పతీగ వీటిని కషాయముకాచి దానితో సేవించిన జ్వరము మానును. వట్టివేళ్ళు అడ్డసరము వీటిని కషాయముబెట్టి అందుశర్కర తేనె నైచి యీ అనుపానముతో సేవించిన రక్తపిత్తము కఫము శ్వాసము కాశము స్వర హీనము యివి నశించు. వసపును వేయించి చూర్ణముచేసి తేనెకలిపి యీ అనుపాన ముతో రాత్రులయందు సేవించిన నిద్రానాశము అతిసారము గ్రహణీ మందవాతము యివి నశించు. సౌవర్చలవణము కరక్కాయ పిప్పళ్ళు వీటిని చూర్ణముచేసి వేడినీళ్ల యందునైచి యీ అనుపానములో సేవించిన శూల అజీర్ణము యివి నివర్తించు. పిప్పలిచూర్ణమునందు తేనెకలిపి దీనితో సేవించిన జ్వరము నివర్తించు దాడిమపువ్వు రసముతో సేవించిన ప్లీహము వుదరరోగము వాతరక్తము వాంతి మొలక మూలము ముక్కునుంచి రక్తముకారుట యివినివర్తించు. మఱియు గరికవేళ్ల రసమునందు శర్కరనైచి యీ అనుపానములో చేర్చి నస్యముచేసిన నాసికా రక్తస్రావరోగము నివర్తించు. రేగుగిజరు పిప్పలిచూర్ణము నెమలిరెక్క భస్మము శర్కర వీటిని నేక ముగజేసి తేననైచి రంగిలించి యీ అనుపానముతో సేవించిన ప్రకోపించిన వమనము యెక్కిళ్ళు యివి శమించు. మఱియు పోటలీరసము మృగాంకరసము హేమగర్భ రసము మౌక్తికరసము యీ రసములు పైజెప్పంబడిన అనుపానములతో సేవించిన ఆయా అనుపానములయందు జెప్పంబడిన రోగములు నివర్తించు. యీ ప్రకారముగ లోకనాథరసము సమస్తరోగములను నివర్తింపం జేయునని తాత్పర్యము.

స్వర్ణమాలినీ వసంత రసానుపానములు.

శ్లో॥ జీర్ణజ్వరేధాతుగతేఽతిసారేరక్తాన్వితేరక్తజన్యప్లిరోగే।
ఘోరేవ్యథేపిత్తకృతేథరోగేబలప్రదోదుగ్ధయుతంచపథ్యం॥
వసన్తోమాలినీపూర్వస్సర్వరోగహరశ్శిశోః।
గర్భిణ్యాదేయమేతంచజయస్త్రీపుష్పకైర్యుతం।
సర్వజ్వరహరంశ్రేష్ఠంగర్భపాలనముత్తమం॥

తా॥ స్వర్ణమాలినీ వసంతరసమును పాలు అనుపానముతో సేవించిన ధాతుగత మైన జీర్ణజ్వరము రక్తాతిసారము రక్తజనిత నేత్రరోగము మిగుల పిత్తరోగము యివి నివర్తించుటయే గాక బలమును సగాగలుగంజేయును. మఱియు యీ వసంతమాలినీ

రసము శిశువులకు పైజెప్పంబడిన అనుపానములతో సేవింపజేసిన సర్వరోగ హారముగ నుండు. గర్భిణీస్త్రీలకు సోమింద పుష్పరసములో సేవింపజేసిన సర్వజ్వరములను పోగొట్టుటయేగాక గర్భమును స్థిరముగ జేయు.

బృహన్మాలినీ వసంత రసానుపానములు.

శ్లో॥ వల్లప్రమాణంమధుపిప్పలీభ్యాంజీర్ణజ్వరేధాతుగతేప్రదేయః । ఛిన్నోద్భవా సత్వసితాయుతశ్చ సర్వప్రమేహేషుచయోజనీయః ॥ కృచ్ఛ్రాశ్మరీం నిహంత్యాశు మాతులుంగార్ద్రకద్రవైః । రసోవసంతనామాయంమాలినీపదపూర్వకః ॥

తా॥ పిప్పలిచూర్ణమునందు తేనెచేర్చి అందు బృహన్మాలినీ వసంతరసమును వల్లప్రమాణముచేర్చి సేవించిన జీర్ణజ్వరము ధాతుగతజ్వరము యివినివర్తించు. తిప్ప సత్తులో శర్కరచేర్చి దానితో వల్లప్రమాణము సేవించిన సర్వప్రమేహములు నివర్తించు. మాదీఫలరసము అల్లపురసము వీటితో వల్లమాత్రము సేవించిన మూత్రకృచ్ఛ్రరోగము నివర్తించు.

పాశుపత రసానుపానములు.

శ్లో॥ తాలమూలీరసేనైవహన్యాదరామయనాశనః । మోచారసేనాతిసారంగ్రహణీంతక్రసైంధవైః ॥ సౌవర్చలవణాశుంఠీ యుతశ్శూలంవినాశయేత్ । అర్శాంసిహంతి తక్రేణపిప్పల్యారాజయక్ష్మకం॥వాతరోగంనిహంత్యాశుశుంఠీసౌవర్చలాన్వితః । శర్కరాధాన్యయోగేన శ్లేష్మరోగంచతత్క్షణాత్ । అతఃపరతరోనాస్తిధన్వంతరిమతోరసః॥

తా॥ పాశుపత రసమును నేలతాటిరసముతో సేవించిన ఉదరవ్యాధి అరటిరసముతో సేవించిన అతిసారము మజ్జిగలో సైంధవలవణమువైచి దానితోసేవించిన గ్రహణి సౌవర్చలవణము శొంఠి పిప్పలి వీటిచూర్ణముల నేకముగజేసి దానితోసేవించిన శూలము మజ్జిగతో సేవించిన అర్శస్సు పిప్పలిచూర్ణముతో సేవించిన క్షయరోగము శొంఠి సౌవర్చలవణము వీటిచూర్ణముల నేకముగజేర్చి దానితో సేవించిన వాతరోగము వేయించిన ధనియాలచూర్ణములో శర్కరజేర్చి దానితో సేవించిన

శ్లేష్మరోగము యివినివర్తించు. ఇది ధన్వంతరిచే జెప్పంబడిన మిగులశ్రేష్ఠమైన రస మని తెలియవలయు.

## పర్పటీ రసానుపానములు.

శ్లో॥ సహింగుజీరకవ్యోషైశ్చామయోద్గ్రహణీంరసః । దశమూలాం భసావాతజ్వరంత్రికటునాకఫం ॥ జ్వరంమధుకసారేణ పంచ కోలేనసర్వజం।యక్ష్మాణంమధుపిప్పల్యా గోమూత్రేణగుదాం కురాన్ ।శూలేచైరండతైలేన పాండుశోథంసగుగ్గులుః।కుష్ఠా నిభంగభల్లాతవాకుచీపంచనింబకైః। ధుత్తూరబీజసంయోగా న్మహోన్మాదవినాశినీ ॥ అపస్మారం నిహంత్యాశువ్యోష నింబదళైస్సహ । స్తనంధయ శిశూనాంతు నితరాంపర్పటీ హితా। పథ్యాయాశ్చూర్ణసంయుక్తావ్యాధీంశ్చాన్యాంత్సుదు స్తరాన్ ॥

తా॥ పర్పటీరసమును యింగువ జీలకఱ్ఱ శొంఠి పిప్పలి మిరియాలు వీటిని నేక ముగ చూర్ణించి దానితో సేవించిన గ్రహణి దశమూలకషాయముతో సేవించిన వాత జ్వరము త్రికటుకముతో సేవించిన కఫము అతిమధురపు కషాయముతో సేవించిన జ్వరము పంచకోల కషాయముతో సేవించిన సమస్తజ్వరములు పిప్పలి చూర్ణములో తేనెవైచి దానితో సేవించిన క్షయరోగము గోమూత్రముతో సేవించిన గుదాంకురము ఆముదముతో సేవించిన శూలరోగము గుగ్గిలముతో సేవించిన పాండురోగము శోఫ జీడిగింజలు కారు గచ్చ వేరు పంచనింబకములు వీటిని కషాయముబెట్టి దానితో సేవించిన కుష్ఠరోగములు వుమ్మెత్తవిత్తుల చూర్ణముతో సేవించిన మహోన్మా దము శొంఠి పిప్పలి మిరియాలు వేపాకు వీటిని కషాయముపెట్టి దానితో సేవించిన అపస్మారరోగములు కరకచూర్ణముతో సేవించిన సర్వరోగములు వీటిని నివర్తింపం జేయు. మఱియు స్తన్యపానముజేయు. శిశువులకు పర్పటీరసము మిగుల హితకర ముగనుండును.

## జయాజయస్త్యనుపానములు.

శ్లో॥ జయస్త్వివా జయావాథ క్షీరైఃపిత్తజ్వరాపహా । ముద్గామలక యూషేణపథ్యందేయంఘృతంవినా ॥ జయస్త్వివాజయావాథ

సక్షౌద్రమరిచాన్వితా । సన్నిపాతజ్వరంహంతి రసశ్చానంద
భైరవః । జయన్తీవా జయావాథవిషమజ్వరనుత్ ఘృతైః ।
సర్వజ్వరంమధువ్యోషైర్గవాంమూత్రేణశీతకం । చందనస్య
కషాయేణరక్తపిత్తజ్వరాపహా।జయంతీవాజయావాథమాక్షి
కేణచకాసజిత్ ।జయంతీవాజయావాథతండులోదకపానతః।
అశ్మరీంహంతివోచిత్రంమూత్రకృచ్ఛ్రింతుదారుణం । జయం
తీంవాజయాంవాథగోమూత్రేణయుతాంపిబేత్ ॥ హంత్యాశు
కాకణంకుష్ఠంసులేపేనచతద్ఘృతం । ద్వినిష్కంకేతకీమూలం
పిష్ట్వాతోయేనపాయయేత్ । జయంతీవాజయావాథమేహం
హంతిసురాహ్వయం ॥ జయన్తీవా జయావాథమధునామేహ
జిద్భవేత్ ।లోధ్రిముస్తాఽభయాతుల్యంకట్ఫలంచజలైస్సహ।
క్వాథయిత్వాపిబేచ్చాను మధునాసర్వమేహజిత్ । జయంతీ
వాజయావాథగుడైఃకోష్ణజలైఃపిబేత్ ॥ త్రిదోషోత్థంహరేద్బ
ల్యంరసశ్చానందభైరవః । జయంతీవాజయాహంతిశుంఖ్యాస
ర్వంభగంధరం।జయంతీవాజయావాథతక్రేణగ్రహణీప్రణుత్ ।
జయంతీవాజయావాథరసశ్చానందభైరవః। రక్తపిత్తేత్రిదోషో
త్థేశీతతోయేనపాయయేత్ । జయంతీవాజయావాథభృంగ
ద్రావైర్నిశాంధ్యనుత్ ।జయంతీవాజయావాథఘృష్ణాస్తన్యేవ
చాంజయేత్ । స్రావణంసర్వదోషోత్థం మాంసవృద్ధించనాశ
యేత్ ॥

తా॥ జయంతీ జయా వటుః మూలలో దేనినైనను పాలతో సేవించి ఫేణినివర్జించి పెసరకట్టు నెల్లికట్టు వీటినిపథ్యమిడిన పిత్తజ్వరము నివర్తించు. మరియు మిరియాల చూర్ణములో తేనెవైచి ఆనందభైరవ రసమునుచేర్చి దానితోసేవించిన సన్నిపాత జ్వరము నశించు. నేతితోసేవించిన విషమజ్వరము త్రికటుకచూర్ణములో తేనెవైచి దానితోసేవించిన సమస్తజ్వరములు గోమూత్రముతో సేవించిన శీతజ్వరము చందన కషాయముతో సేవించిన రక్తపిత్తజ్వరము తేనెతో సేవించిన కాసము కడుగునీళ్లతో

సేవించిన మూత్రరోగము దారుణమైన మూత్రకృచ్ఛ్రము యివి నివర్తించు. మఱియు కాకణకుష్ఠరోగము గలవాడు యీ జయంతీ జయావటుకములలో దేనినైనను గోమూత్రముతో సేవించి పైవటుకములను ఘృతమునందువైచి కాచి దానిని శరీరమునకు లేపనముజేసుకొనిన ఆ కాకణకుష్ఠరోగము నివర్తించు. 2 వరహాలయెత్తు మొగిలిగడ్డనునూరి నీళ్లలోకలిపి కషాయముకాచి దానితో సేవించిన సురామేహము నివర్తించు. తేనెతో సేవించిన మేహరోగము నశించు. మఱియు దీనిని తేనెతో సేవించి లొద్దుగ తుంగ ముస్తెలు కరక్కాయ కట్ఫలము వీటిని సమభాగముల నీళ్లయందునిచి కషాయముకాచి అందు తేనెవైచి పుచ్చుకొనిన సర్వమేహములు నివర్తియగు. సుఖోష్ణముగనుండు నీళ్లయందు బెల్లమువైచి కలిపి ఆనంధభైరవి మాత్రనుచాది అందులోకలిపి దానితో సేవించిన త్రిదోషజనిత గుల్మరోగమును బోగొట్టు. మఱియు పైవటుకమును శొంఠితో సేవించిన సమస్తములైన భగందర రోగములను నశింపజేయు. మజ్జిగతో సేవించిన గ్రహణీరోగము నివర్తించు. చల్లనినీళ్లయందు ఆనందభైరవినికలిపి దానితో సేవించిన త్రిదోషజనిత రక్తపిత్తరోగమునునశింపజేయు. గుంటగలగర రసముతో పైవటుకమునుచాది కండ్లకు అంజనమిడిన రేజీకటి నివర్తించు, పైవటుకమును చనుబాలతో చాది కండ్లకు అంజనమిడిన త్రిదోషజనిత స్రావణము కండ్లయందు మాంసవృద్ధి వీటిని నశింపజేయు. (స్రావణమనగా కండ్లయందు నీరుగారుట.)

గద్య॥ ఇతి శ్రీ ఆంధ్రభాషానువాద భూషితే అనుపానరత్నాకరే
మృత్యుంజయాది రసానుపాన వివేకకథనన్నామ
ద్వితీయస్తరంగః.



శ్రీరస్తు.

# అనుపానరత్నాకరము.

## ఆంధ్రతాత్పర్యము.

---

### తృతీయ స్తరంగము.

### సువర్ణాదిసప్తధాతువులకు అనుపానములు.

### సువర్ణభస్మానుపానములు.

శ్లో॥ శుత్సవ్యపిత్తస్యయోగేనస్వర్ణంతత్కాలదాహజిత్ ।
భృంగయోగాచ్చతద్వృష్యందుగ్ధయోగాద్బలప్రదం ॥
పునర్నవాయుతంనేత్ర్యంఘృతయోగేరసాయనం ।
స్మృత్యాదికృద్వచాయోగాత్ కాంతికృత్కుంకుమేనచ ।
రాజయక్ష్మాచపయసానిర్విషాచవిషంహరేత్ ।
శుంఠీలవంగమరిచైస్త్రిదోషోన్మాదహారకం ।
మధ్వామలకచూర్ణంతుసువర్ణంచేతిత్రయం ।
ప్రాశ్యాదిష్టగృహీతోపిముచ్యతేప్రాణసంకటాత్ ।
శంఖపుష్ప్యావయోర్థంచవిదార్యాచప్రజార్థకః ॥

తా॥ స్వర్ణభస్మమును చావకోవ్వుతో సేవించిన తత్కాలతాపము నివర్తించు. గుంటగలగరరసముతో సేవించిన వీర్యవృద్ధి పాలతో సేవించిన బలము గలిజేరురసముతో సేవించిన నేత్రములకుహితము నేతితో సేవించిన వయస్థాపనము వసతో సేవించిన చిత్తస్ఫురణము కుంకుమపువ్వుతో సేవించిన శరీరకాంతి వీటిని గలుగంజేయు. పాలతో సేవించిన క్షయరోగము నిర్విషాయను గ్రంధ్యముతో సేవించిన విషరోగము శొంఠి లవంగములు మిరియాలు వీటికషాయముతో సేవించిన త్రిదోషజనిత వున్మాదరోగము వుసిరికచూర్ణములో తేనెకలిపి దానితో సేవించిన ప్రాణహారకమగు ప్రబలవ్యాధులు వీటిని నివర్తింపంజేయు. శంఖపుష్పి రసముతో సేవించిన వయోవృద్ధి నేలగుమ్మడు గడ్డ రసముతో సేవించిన పుత్రోత్పత్తి వీటిని గలుగంజేయు.

## గ్రంథాంతరే.

శ్లో॥ వాజీకరం భృంగరసేన తూర్ణం దుగ్ధేనశక్తింప్రదదాతినిత్యం। పునర్నవాయుఙ్నయనామయఘ్నంజరాహంచాజ్యయుతంనరాణాం। బుద్ధిదంతువచాయుక్తందాహఘ్నంకటుకాయుతం। కాంతిదంకుంకుమేనేదంకాంతిజన్నవనీరదే॥ సద్యోదుగ్ధయుతంహంతియక్ష్మాణమతిదారుణం। లవంగశుంఠీమరిచైరున్మాదంచత్రిదోషకం। మధ్వామలకసంయుక్తంగ్రహణీంప్రబలాంహరేత్। మధునావరఖం హైమంవిషదోషనివారణం। శంఖపుష్పీరసైరాయుఃప్రదంచందనచర్చితే।విదారీకందసంయుక్తంపుత్రిదంపుత్రవత్సలే॥

తా॥ సువర్ణభస్మమును గుంటగలిజేరాకు రసముతోఁ పుచ్చుకొనిన వాజీకరణము (అనగా స్త్రీసంభోగమునందు మిగులపటుత్వము) పాలతో సేవించిన పటుత్వము యివి గలుగు. గలిజేరాకురసముతో సేవించిన నేత్రరోగము నెయ్యితో సేవించిన ముదిమి యివి నశించు వసతో సేవించిన బుద్ధివృద్ధియగును. కటుకరోహిణితో సేవించిన తాపమును తొలగంజేయు. కుంకుమపువ్వుతో సేవించిన శరీరమునకు కాంతిని గలుగంజేయు. ఆవుపాలు నురుగుతో సేవించిన మిగులదారుణమగు క్షయరోగము లవంగములు శొంఠి మిరియాలు వీనిచూర్ణములను నేకముగజేసి దానితో సేవించిన వున్మాదము త్రిదోషములు యివి నశించు. ఉసిరికెచూర్ణము తేనెలో కలిపి దీనితో సేవించిన దారుణమగు గ్రహణిరోగము తొలగు. తేనెతో సేవించిన విషోపద్రవములు నివృత్తియగు. శంఖపుష్పీరసముతో సేవించిన ఆయుర్వృద్ధి నేలగుమ్ముడుగడ్డ చూర్ణముతో సేవించిన పుత్రోత్పత్తి యివి గలుగు

## రౌప్యభస్మానుపానములు.

శ్లో॥ భస్మీభూతంరజతమమలంతత్సమంవ్యోమభానుః।
సర్వైర్వస్తుల్యంత్రికటురసవరంసారమాజ్యేనయుక్తం।
లీఢంప్రాతఃక్షపయతినృణాంయక్ష్మపాండూదరార్శ।
శ్వాసాన్ కాసాన్ నయనతిమిరంపిత్తరోగానశేషాన్॥

తా॥ శుద్ధిజేసిన రజితభస్మము అభ్రకభస్మము తామ్రభస్మము వీటినిసమముగ చేర్చి యీమూటితో సమముగ త్రికటుక రసముగాని లేక చూర్ణముగానిచేర్చి

ప్రాతఃకాలమునందు నేతితో సేవించిన క్షయరోగము పాండువు మహోదరము అర్శస్సు శ్వాస కాస తిమిరరోగము పిత్తరోగము వీటినినశింపంజేయు.

## గ్రంథాంతరే.

శ్లో॥ దాహేశర్కరయాయుక్తంవాతేపిత్తేవరాయుతం ।
త్రిసుగంధయుతంమేహేగుల్మేక్షారసమన్వితం ॥
కాసేకఫేటుహూషస్వరసేత్రికటుకాన్వితే ।
భార్గీవిశ్వయుతంశ్వాసేక్షయజిత్సశిలాజతు ।
క్షీణేమాంసరసేదేయందుగ్ధేవాలలనోత్తమే ।
యకృత్ప్లీహహరంకాంతేనరాపిప్పలిసంయుతం ।
పునర్నవాయుతంశోఫేపాండౌమండూరసంయుతం ।
వలీపలితహాంకాంతిక్షుత్కరంఘృతసంయుతం ॥

తా॥ తాపమునందు రజతభస్మమును పంచదారతోను వాతము పిత్తము వీని యందు త్రిఫలాచూర్ణముతోను మేహమునందు త్రిసుగంధ చూర్ణముతోను గుల్మము నందు సర్జక్షారముతోను కాసము కఫము వీటియందు త్రికటుకచూర్ణము అడ్డసరపు రసము వీటితోను శ్వాసమునందు గంటుభారంగి శొంఠి వీటితోడను క్షయమునందు శిలాజతుతోడను క్షీణతయందు మాంసరసముతోడను లేక ఆవుపాలతోను యకృత్తు ప్లీహమువీటియందు త్రిఫలములు పిప్పళ్ళు వీటిచూర్ణముతోను శోఫయందుగలిజేరు రసముతోను పాండురోగమునంగు మండూరముతోను పుచ్చుకొనిన పైనుదహరించిన వ్యాధులన్నియు నశించు. ఓలలనోత్తమా! యీ రజితభస్మమును నేతితో పుచ్చుకొనిన వళులు పలితము వీటిని పోగొట్టుటయేగాక ఆకలి కాంతి వీటినిసగా గలుగంజేయు.

## తామ్రభస్మానుపానములు.

శ్లో॥ దుగ్ధంఖండంచానుపానంప్రదద్యాత్స్వాజ్యంభోజ్యంత్యాజ్యమ
మ్లేనయుక్తం । వీర్యంపుష్టిందీపనందేహదార్ఢ్యందివ్యాదృష్టి
ర్జాయతేకామరూపం ॥ పూర్వేషాం మతమాలోక్యనైదై ర
శ్చాదుమిరై స్ఫుటైః । స్వబుధ్యాదాపయేత్తామ్రంరోగనాశన
మస్తుభిః॥

తా॥ తామ్రభస్మము పాలతోగాని తేనె నేతిలోగలకండ చూర్ణమువైచి దానితోగాని సేవింపజేసి పులుసునువర్జించి పథ్యంబిడిన వీర్యవృద్ధి శరీరపుష్టి అగ్ని దీపనము శరీరదార్ఢ్యము నిర్మలదృష్టి కామరూపము యివిగలుగు. మఱియు వైద్యవేత్తలు ప్రాచీన వైద్యమతములను పర్యాలోచించి స్వబుద్ధిచేత విచారించి ఆయారోగములకు తగిన అనుపానములతో యీ తామ్రభస్మమును సేవింపజేసిన ఆయారోగములు (సర్వరోగములు) నివర్తించు.

గ్రంధాంతరే.

శ్లో॥ పిప్పలీమధుసంయుక్తంసర్వరోగేషుయోజయేత్ ।
స్వబుధ్యాపిప్రియుంజీతరోగనాశనవస్తుభిః ॥

తా॥ తామ్రభస్మమును పిప్పలిచూర్ణములో తేనెవైచి దానితో సేవించిన సర్వరోగములు హరించు. మఱియు బుద్ధిమంతుడగు వైద్యుడు ఆయారోగానుగుణ్యముగ బుద్ధిచేయోచించి రోగహర ద్రవ్యములను అనుపానముగా గ్రహించి దానితో తామ్రభస్మము నిప్పించవలయు.

వంగభస్మానుపానములు.

శ్లో॥ జాతీఫలేనేతికరోతిపుష్టింవక్రేసుగంధింస్ఫుటికేనవోక్తం । ప్రా
చీనవైద్యైర్మృతరంగకోఽషశ్లోకోమయాఽయం రచితోఽ
త్రసూనం ॥ తులసీపత్రసంయుక్తఃప్రమేహంనాశయేద్ధ్రువం ।
ఘృతేనపాండురోగంచ టంకణైర్గుల్మనాశనం ॥ నిశయారక్త
పిత్తంచమధునాబలబుద్ధికృత్ । ఖండేన హాపిత్తఘ్నంనాగ
వల్ల్యాచబంధనం ॥ పిప్పల్యాచాగ్నిమంద్యత్వంనిశయావోర్ధ్వ
శ్వాసహృత్ ॥ చంపకస్వరసేనైవదుర్గంధింనాశయేద్ధ్రువం ।
నింబకస్వరసేనాఢ్యందేహేదహనశాంతయే। కస్తూరీసంయుక్త
వంగభక్షణాద్వీర్యరోధకృత్ । ఖదిరక్వాథయోగేనచర్మపక్షి
ముత్తైస్సహ।పూగఫలేనసార్ధంవాఽజీర్ణంనాశయతేక్షణాత్ ॥
నవనీతసమాయుక్తమస్త్రిజీర్ణం నవంభవేత్ । దుగ్ధసార్ధంభవే
త్తుష్టిర్యయా స్తంభనంభవేత్ । లశునైర్వాతజాంపిండాం
నాశయేన్నాత్రసంశయః । సముద్రఫలసంయోగాన్నిర్గుండ్యా

సహాంభక్షణాత్ ॥కుష్ఠంనాశయతేక్షిప్రం సింహానాదేమృగా యి వ॥అఘూతజటికాయోగాత్షండత్వంనాశయేద్ధ్రువం। దేవపుష్ప స్యసంయోగాత్సముద్రఫలయోగతః।నాగపత్రరసైర్లేపాల్లింగ వృద్ధిఃప్రజాయతే।గోరోచనలవంగేనతిలకాన్మోహానంభవేత్। ఏరండజటికాయోగేఘుష్ఠ యిత్వాచవంగకం। లేపయేచ్ఛలలా టేవై తదాశీర్షగదంజయేత్ । కొజ్జైఃపామార్గమూలేనప్లీహే టంకణసంయుతం । రసేనతైలయుక్తస్య మపస్మారనిషూ దనం । పుత్రాప్త్యైరాసభిక్షీరే స్వకాథ్యంవాతగుల్మనుత్ । యవానికాయుతంవాతేవాజిగంధాయుతంతువా । జలోదరే త్వజాక్షీరసంయుతంగుణకృద్భవేత్।జాతీఫలాశ్వగంధాభ్యాం కటిపీడానివారణం॥

తా॥ వంగభస్మమును జాజికాయతో సేవించిన పుష్టి పచ్చకర్పూరముతో సేవించిన ముఖమునందు సువాసన యివి గలుగునని ప్రాచీనవైద్యులు చెప్పియున్నం దున యిచ్చట వ్రాయుటయైనది; మఱియు తులసీరసముతో సేవించిన ప్రమేహము నేతితో సేవించిన పాండువు వెలిగారముతో సేవించిన గుల్మరోగము మానిపసపు చూర్ణముతో సేవించిన రక్తపిత్తము యివి నివర్తించు. తేనెతో సేవించిన మిగుల బల మును గలుగంజేయు. కలకండతో సేవించిన పిత్తరోగము తమలపాకుతో సేవించిన మలబద్ధము పిప్పలీచూర్ణముతో సేవించిన అగ్నిమాంద్యము పసపుతో సేవించిన ఊర్ధ్వశ్వాస సంపెంగిరసముతో సేవించిన శరీరదౌర్గంధ్యము వేపాకురసముతో సేవిం చిన శరీరతాపము వీటిని నశింపంజేయు. వంగభస్మమును కస్తూరితో సేవించిన వీర్య స్తంభనమును గలుగంజేయు. చంద్రకషాయముతో పులుగుమలముచేర్చి వంగభస్మ మునకు అనుపానముగ సేవించిన చర్మరోగము నివర్తించు; మఱియు పోకచూర్ణ మును చంద్రకషాయముతో చేర్చి సేవించిన అజీర్ణరోగము నశించు. వెన్నతో సేవిం చిన అస్థిగతరోగములు తొలుగుడును. పాలతో సేవించిన సంతోషము కరకచూర్ణ ముతో సేవించిన వీర్యస్తంభనము వీటినిగలుగంజేయు. పుల్లిపాయలరసముతో సేవిం చిన వాతరోగము సముద్రఫలము వాకిలిరసము వీటితో సేవించిన « సింహనాద మును విని యితరమృగములు బరుగిడుచందంబున " కుష్ఠరోగము శీఘ్రముగ నశించు. కొరిందవేళ్లకషాయముతో సేవించిన షండత్వము నివర్తించు. ప్రేంఖణపుష్ప సముద్ర ఫలమ్ము తమలపాకురసము వీటినిచేర్చి సేవించి లింగమునకు లేపనముజేసిన పుంస్త్వ

వృద్ధిగలుగు. గోరోచనము లవంగము తిలకచూర్ణము వీటినికలిపి దానితో సేవించిన మోహనముగలుగు. చిట్టాముదపువేరు రసములో వంగభస్మమును కలిపి చక్కగ మర్దించి లలాటమునకు లేపనముజేసిన శిరోరోగము నివర్తించు. ఉత్తరేణివేరుచెట్టు చూర్ణముతో సేవించిన కుబ్జత్వము వలిగారముతో సేవించిన ప్లీహరోగము వెల్లుల్లిరసముతో నస్యముజేసిన అపస్మారరోగము యివి నివర్తించు. గాడిదపాలతో సేవించిన పుత్రోత్పత్తిగలుగు. మజ్జిగతో సేవించిన వాతగుల్మము నివర్తించు. ఓమకషాయముతోగాని లేక పెన్నేరుగడ్డ చూర్ణముతోగాని సేవించిన వాతరోగము నశించు. మేకపాలతో సేవించిన జలోదరము నివర్తించు. జాజికాయ పెన్నేరుగడ్డ వీటిచూర్ణములతో సేవించిన కటిపీడ (అనగా మొలనొప్పి) తొలగు.

జసద భస్మానుపానములు.

శ్లో॥ శ్రుణుసఖె జసదస్య వదామ్యహం సుఖకరంహ్యనుపానమరం
వరం । వివిధతం త్రమతంసువిచార్యవై విధవగస్యగదాప
హరంన్నృణాం । జసదభస్మ ఏయేత్రిసుగంధినా ననుసఖేత్రిమ
లోద్భవమామయం । హరతిశాలిహిమేనతథాజ్వరం సహ
మృషుచ్ఛదయాలఘుమాయుజం । శిఖరదీప్యయుతంశమయే
జ్జ్వరంజసదభస్మసఖేశ్రుణుశీతజం। సుధిరజంత్వతిసారగదంవమిం
కణపిదాయుతమాశునిహంతివై । మధరసేనధనంజయమంద
తాంసయసరోగమథోషసిచాంజితం । సృశికయాధృవమాశు
సఖేధవాహరలీగోహవిషాప్రతినేనవై । సుభసితంహ్యశితంజ
సదంయదాలఘునిహంతిచమేహగదంతదా । అహిలతాదల
యుక్తమిదంసదాసహసఖేమహాపీహవిషాధవా । శిఖరదీప్యక
ణైశ్చసశర్కరైర్హరతిశూలగదంహిభయాసకం । సహకవో
ష్ణయవానికయాసఖేజయతిచాశువిబంధగదంధృవం॥

తా॥ ఓస్నేహితుడా ! నేను అనేకవైద్యశాస్త్రములను పరిశోధించి మనుష్యుల లోపల మరణసందేహము గలవారికి రోగనివర్తకముగ నుండు సత్తుభస్మమునకు శ్రేష్ఠముగనుండు అనుపానములను సంగ్రహముగ చెప్పుచున్నాను వినుము. సత్తుభస్మ

ఘును * త్రిజాతకముతో సేవించిన త్రిదోష జనితరోగములు నివర్తించు. విప్పాకు కషాయమునీళ్లతోగాని లేక ఖర్జూరపుకాయల కషాయముతోగాని సేవించిన పిత్తజ్వరము నివర్తించు. లవంగము వోమము వీటిని కషాయముబెట్టి దానిలో సేవించిన శీతజ్వరము నివర్తించు. జీలకర్ర చెక్కెర వీటితో సేవించిన రక్తాతిసారము వాంతి యివి శీఘ్రముగ తొలగు. మారేడుస్వరసముతో సేవించిన అగ్నిమాంద్యము జొల్లుయందుగాని పాత ఆవునేతియందుగాని యీసత్తుభస్మమును రంగరించి ప్రాతఃకాలమునందు నేత్రముల కంజనమిడిన నేత్రరోగము యివి హరించు. తమలపాకు రసముతోగాని రొనను నేతితోగాని సేవించిన ప్రమేహము శీఘ్రముగ నివర్తించు. లవంగము వోమము జీలకర్ర వీటినన్నిటిని కషాయముబెట్టి తెల్లచక్కెరచేర్చి దానితో సేవించిన భయంకరమగు శూలరోగము నివర్తించు. సుఖోష్ణముగనుండు కోరిందకషాయముతో సేవించిన మలబద్ధరోగము నివర్తించు.

నాగానుపానములు.

శ్లో॥ మృతంనాగం వాయుంహరతిసహమా యుఙ్చ సితయాశిరో
రోగందాహంహ్యరుచి మథనేత్రా మయమరం । ప్రలాపం
సంతాపంవివిధగదతాపంజయతివై సఖేదేయం వైద్యైర్గను
గదగణేఽన్యేస్వమతినా॥

తా॥ నాగభస్మమును శర్కరతో సేవించిన వాతము పిత్తము శిరోరోగము తాపము అరుచి నేత్రరోగము ప్రలాపము సంతాపము అనేకరోగజనిత పీడ యివి నివర్తింపుగాన వైద్యులు తమస్వబుద్ధిచే ఆలోచించి సమస్తరోగములయందును తగు అనుపానములతో నివ్వవలయు.

లోహానుపానములు.

శ్లో॥ లోహంమృతం సర్వగదేషుదేయం సదాసువైద్యైశ్చపలేన
సాకం । భార్గీమధు వ్యోషయుతం జయేద్వైకృత్స్నంతథా
ధాతువికారమాశు ॥ పునర్నవాక్వాథయుతశ్చపాండుమేహం
నిశాక్షౌద్రయుతంజయేద్వై ॥ కణామధుభ్యా మథవానరాణాం
శైలేయయుక్తంనమమూత్రకృచ్ఛ్రం ॥ నూనంకఫం గంధరసేం

* త్రిజాతకమనగా —ఏలకులు లవంగపుచెక్క ఆకుపత్రి వీటిపేరు.

ద్రవమాక్షికై స్స్యాద్ధంచతుర్జా తిసితాన్వితంజయేత్ । ...రక్త పిత్తం మృతలోహమాశుతం హన్యాత్పునర్యాపయసాతథా బలం । ద్రాక్షాకణాసింహీకమాక్షికైః కృతాశ్వాసంజయేద్దృవ గుటికాముఖేధృతా । పారావతస్యాథమృతస్యసేవనాన్మర్త్యో భవేచ్చామయహీనవిగ్రహః॥

తా॥ లోహభస్మమును శుద్ధిజేసిన పారదభస్మముతోగూడ సేవించిన సకుష్ఠ రోగములు నివర్తించు. మఱియు గంటుభారంగి తేనె త్రికటుకములు వీటితో సేవించిన ధాతుజన్య వికారములు శీఘ్రముగ నివర్తించు. గలిజేరుకషాయముతో సేవించిన పాండువు మానిపసపు తేనె వీటితోగాని పిప్పలి తేనె వీటితోగాని సేవించిన ప్రమేహము శిలాజిత్తు భస్మముతో సేవించిన మూత్రకృచ్ఛ్రము వీటిని నివర్తింపంజేయు. శుద్ధగంధకభస్మము శుద్ధపారదభస్మము తేనె వీటితో సేవించిన కఫము * చాతుర్జాతకములు తెల్లచక్కెర వీటితో సేవించిన రక్తపిత్తము వీటిని నశింపంజేయు. తెల్లగలిజేరు వేళ్లచూర్ణమును పాలలోవైచి దానితో సేవించిన బలమును గలుగంజేయు. ద్రాక్ష పిప్పలి అడ్డసరము వీటిచూర్ణములు తేనె వీటితోచేర్చి ఘుటికలుచేసినోటియందుంచుకొని దానిరసమును మ్రింగుచుండిన శ్వాసనివర్తియగు. మఱియు నీ లోహభస్మమును రోగహీనుడు తాంబూలముతో సేవించిన రోగరహితశరీరము గలవాడగు.

## స్వర్ణమాక్షికానుపానములు.

శ్లో॥ మధుపిప్పలిసంయుక్తంక్షయశ్వాసభ్రమాదికాన్ ।
హన్తిరోగచయంవిష్ణుర్యథాచక్రధరోసురాన్॥

తా॥ స్వర్ణమాక్షికభస్మమును తేనె పిప్పలిచూర్ణము వీటితో సేవించిన చక్రధారియగు మహావిష్ణు రాక్షసులను నశింపంజేయు. చందంబున " క్షయ, శ్వాస, భ్రమ వీటిని నివర్తింపంజేయు.

## రౌప్యమాక్షికానుపానములు.

శ్లో॥ లీఢోవ్యోమ వరాన్వితో విమలకోయుక్తోఘృతై స్సేవితో హన్యాద్దుర్భగకృజ్జ్వరాన్ శ్వయధుకంపాండు ప్రమేహారుచిం ।

* చాతుర్జాతకములనగా ; లవంగములు ఆకుపత్రి ఏలకులు నాగకేసరములు వీటికూటము.

మూలార్తిం గ్రహణీశ్చశూలమతులం యక్ష్మామయం కామ
లాంసర్వాన్పిత్తమరుద్గదాన్పిదుమప్రైరోగ్యైరశేషామయాన్॥
విషవ్యోషవరాజ్యేన విమలస్సేవితోయది । భగంధరాదికా
రోగాన్ప్రణాంగిచ్ఛంతిదుస్తరాః॥

తా॥ రౌప్యమాక్షికమును అభ్రికభస్మము త్రిఫలాచూర్ణము వీటిని నేతిలో నైచి దానితో సేవించిన కురూపమును గలుగంజేయు. జ్వరములు శోఫ పాండువు ప్రమేహము అరుచి మూలవ్యాధి గ్రహణి మిగుల శూల క్షయరోగము కామిల సమస్త పైత్యరోగములు వాతరోగము వీటిని నివర్తింపంజేయు మఱియు సర్వరోగ నాశన మునకు నైన అనుపానములకంటె యిరాంనుపానముల సహాయము; దీనికి అనావశ్యకము. అతివస త్రికటుకములు త్రిఫలము: వీటిని చూర్ణించి నేతిలోకలిపి దానితో సేవించిన దుస్తరమైన భగందరాద రోగములు నివర్తించు.

తుత్థానుపానములు.

శ్లో॥ ఘృతేనపందూవిషకుష్టరోగాన్ తాంబూలయోగేనకఫంతథో
గ్రం । కృమింకృమి ఘ్నేన చతుత్థభస్మక్షౌద్రాంజితంనేత్రగతం
జయేద్వై॥

తా॥ తుత్థభస్మమును నేతితో సేవించిన దురద విషము కుష్ఠరోగము తాంబూలముతో సేవించిన వుగ్రమైన కఫము వాయువిడంగములతో సేవించిన కృమిరోగము తేనెతో కలిపి అంజనమిడిన నేత్రరోగము యివి హరించు.

శిలాజితు భస్మానుపానములు.

శ్లో॥ ఏలాపిప్పలిసంయుక్తంమాసమాత్రంతుభక్షయేత్ ।
మూత్రకృచ్ఛ్రింమూత్రరోధంహంతిమేహాతధాక్షయం ।
సర్వానుపానైస్సర్వత్రరోగేషువినియోజితే ।
జయత్యభ్యాసతోనూనంస్తాన్ స్తాన్రోగాన్నసంశయః॥

తా॥ శిలాజిత్తుభస్మమును యేలకులు పిప్పలి వీటిచూర్ణములో మాసమాత్రము సేవించిన మూత్రకృచ్ఛ్రము మూత్రనిరోధము ప్రమేహము క్షయము యివి నివర్తించు. మఱియు నీభస్మమును ఆయారోగములకు తగినైన అనుపానములతో దీర్ఘకాలము సేవించిన ఆయారోగములు నిస్సంశయముగ తొలగు.

## పారద భస్మానుపానములు.

శ్లో॥ పిప్పలీమరిచైశ్శుంఠీభారంగీమధునాసహా । కాసశ్వాసప్రశమనఃశూలస్యచవినాశనః । హరిద్రాశర్కరాసార్ధంబుధిరస్య వికారనుత్ । త్ర్యూషణంత్రిఫలావాసాకామలాపాండురోగ జిత్ ।శిలాజతుతథైలాచశితోపలసమన్వితః । మూత్రకృఛ్రే ప్రశస్తోయంసత్యం నాగార్జునోదితం । లవంగకుసుమంపత్రం హింగులంచాకలంకరా । పిప్పలీవిజయాచైవ సమాన్యేతాని కారయేత్ । కర్పూరమహిఫేనానినాగాద్భాగార్ధకంక్షిపేత్। సర్వమేకత్రసంమర్ద్య ధాతువృద్ధ్యాప్రదాపయేత్ । సౌవర్చలం లవంగంచభూనింబంచహరీతకీ । అస్యానుపానయోగేనసర్వ జ్వరవినాశనః॥తథారేచకరఃప్రోక్తఃసౌవర్చలఫలత్రికం। లవం గకుసుమంచైవ దరదేనచసంయుతం ॥ తాంబూలేనసమం భక్ష్యంధాతువృద్ధింకరంపరం । విదారీమూర్ణయోగేనధాతు వృద్ధికరోమతః ॥ విజయాదీప్యసంయుక్తోవమనస్యవికారనుత్ । సౌవర్చలంహరిద్రాచవిజయాగీప్యకంతథా। అనేనోదరపీడాం చసద్యోత్పన్నాంవినాశయేత్ । చతుర్వల్లీపలాశస్య బీజంచ ద్విగుణంగుడః । అస్యానుపానయోగేనకృమిదోషవినాశనః। అహిఫేనలవంగంచదరదంవిజయాతథా అస్యానుపానతస్సద్య స్సర్వాతీసారనాశనః । సౌవర్చలేనదీప్యేనఅగ్నిమాంద్యహరః పరః। క్షుకోర్బుధజనకశ్చైవసిద్ధనాగేశ్వరోదితం।గుడూచీసత్వ యోగేనసర్వపుష్టికరస్మృతః ॥

తా॥ రసభస్మమును పిప్పలి మిరియాలు శొంఠి గంటుభారంగి వీటిచూర్ణముతో తేనెకలిపి దానితో సేవించిన కాస శ్వాస శూలరోగము మానిపవసపు చూర్ణములో శర్కరకలిపి దానితో సేవించిన రక్తవికారము త్ర్యూషణము త్రిఫలములు అడ్డసరము వీటికషాయముతో సేవించిన కామిల పాండువు శిలాజతుభస్మము యేలకలచూర్ణము

ఖండశర్కర వీటితో సేవించిన మూత్రకృచ్ఛ్రము యివినివర్తించు. లవంగములు తాళిస పత్రి యింగువ అక్కలకర్ర పిప్పలి కరక్కాయ వీటిచూర్ణమును సమముగజేర్చి నాగేశ్వరభస్మము 1 భాగము కర్పూరము నల్లమందు యివి ½ భాగము వీటినన్నియు ఖల్వమునందునిచి మర్దించి దానితో సేవించిన ధాతువృద్ధి గలుగు. సౌవర్చలవణము లవంగములు నేలవేము కరక్కాయ వీటిచూర్ణముతో సేవించిన సర్వజ్వరములు నివర్తించు. సౌవర్చలవణము త్రిఫలములు వీటికషాయముతో సేవించిన విరేచనము గలుగు. లవంగము రసభస్మము వీటిని తమలపాకునందునిచి సేవించినను నేలగుమ్మడు వేరు చూర్ణముతో సేవించినను వీర్యవృద్ధినిగలుగజేయు. కరక్కాయ వోమము వీటి చూర్ణముతో సేవించిన వమనము సౌవర్చలవణము మానిపసపు కరక్కాయ వోమము వీటిచూర్ణముతో సేవించిన తక్కలపుదరపీడ చతుర్వల్లీ మోదుగవిత్తులు వీటిచూర్ణమునకు రెండింతలు బెల్లముచేర్చి దానితో సేవించిన క్రిమిరోగము నల్లమందు లవంగము కరక్కాయ వీటికషాయముతో సేవించిన సమస్తఅతిసారరోగములు సౌవర్చలవణము వోమము వీటితో సేవించిన అగ్నిమాంద్యము యివి నివర్తించు. తిప్పసత్తుతో సేవించిన ఆకలిని గలుగజేయుటయేగాక శరీరపుష్టిని నగా గలుగజేయు.

శ్లో॥ పిత్తేశర్కరయామలేనసహపావాతేచకృష్ణాసమం ।
దద్యాచ్ఛ్లేష్మణిశృంగబేరసహితంజంబీరనీరంజ్వరే ॥
రక్తోద్ధేమధునాప్రవాహగుధరేస్యాన్మేఘనాదోదకే ।
దద్యాచ్చాభకృతాతిసారవికృతౌరోగారిసంజ్ఞోరసః ॥

తా॥ రసభస్మమును శర్కర పుసిరికచూర్ణము వీటితో సేవించిన పిత్తరోగము పిప్పలిచూర్ణముతో సేవించిన వాతరోగము అల్లపురసముతో సేవించిన శ్లేష్మరోగము నిమ్మపండ్లరసముతో సేవించిన జ్వరము తేనెతో సేవించిన రక్తజనితరోగము చిర్రికూర రసముతో సేవించిన రక్తస్రావము (రక్తభేది) అతిసారము యివి నివర్తించు. గాన యీ రసభస్మము రోగారి యనబడును.

## రససిందూరానుపానములు.

శ్లో॥ వాతేసక్షౌద్రపిప్పల్యపిచకఫరుజిత్ర్యూషణంసాగ్నిచూర్ణం ।
పిత్తేత్రైలాసితేందూ్రణవతిచవరాగుగ్గులుశ్చోరుబద్ధే ।
చాతుర్జాతేసపుష్టౌహరనఘనఫలాశాల్మలీపుష్పవృత్తం ।
కింవాకాంతాబలాటూధరణరసపతేస్స్యాదనూపానమేతత్ ॥

టీ॥ రససిందూరమును, తేనెతోఁగూడిన పిప్పలీచూర్ణముతో సేవించిన వాతరోగము త్ర్యూషణములు చిత్రమూలపుచూర్ణము వీటిని చేకముజేసి దానితో సేవించిన కఫరోగము శిలాజతుభస్మములో పచ్చకర్పూరముచేర్చి దానితో సేవించిన పిత్తరోగము త్రిఫలముతో సేవించిన వ్రణరోగము గుగ్గిలచూర్ణముతో సేవించిన మలబద్ధము యివి హరించు. చాతుర్జాతకముతోఁగాని త్రిఫలముతోఁగాని బూరుగ పువ్వు రసముతోఁగాని సేవించిన శరీరపుష్టిగలుగు. ఇట్టిరససిందూర మహిమకు పైజెప్పఁబడిన అనుపానములు కళాంశముగూడ సమముగాదు; అనగా రససిందూరము మిగుల శ్రేష్ఠమైనదని తాత్పర్యము.

గ్రంథాంతరే.

శ్లో॥ పిప్పలీమధుసంయుక్తంవాతమేహనివారణం। సితోపలావరాయుక్తంపిత్తమేహంవరాంగనే॥ భార్జీత్ర్యూషణమాక్షికైః కసనశ్వాసశూలనుత్। సితారాత్రిసమాయుక్తంరక్తదోషంవినాశయేత్॥ కామలాపాండుమందాగ్ని న్వరాత్ర్యూషణయుగ్జయేత్। యథావిష్ణుశ్రియాయుక్తోహృదిస్థోభక్తపాతకాణ॥ హృద్రోగం బద్ధకోష్ఠంచ వహ్నిమాంద్యాదికాణ్గదాణ। జయేచ్చిత్రకపాంచాలీశివాసౌవర్చలాన్వితం॥ శిలాజతుస్థితైలాభిఃమూత్రకృచ్ఛ్రాత్రితనుర్భవేత్। సౌవర్చలవరాయుక్తంరేచయేన్నవయౌవనే॥ జాతీపత్రీలవంగాభూభంగాపిప్పలిసంకుమైఃకర్పూరేణచసంయుక్తంధాతువృద్ధికరంపరమ్॥ లవంగరుచ్యకశివాయుక్తంసర్వజ్వరాపహమ్। స్రిమేభంగాజమోదాభ్యాంచర్ది రోగప్రణాశనమ్॥ లవంగకుంకుమయుతే నాగవల్లీదళోద్భవే। పీటకేవాపికూశ్మాండచూర్ణేన్యాద్ధాతువర్ధనమ్॥ గుడపర్పటసంయుక్తంక్రిమీణ్కోష్ఠగతాణ్జయేత్। లవంగభంగాపూగైశ్చసర్వాతీసారనుత్ప్రియే॥ దీప్యసౌవర్చలోపేతంవహ్నిమాంద్యాపహంపరమ్। పౌష్టికేప్యమృతాసత్వేనంయుతంపుష్టికారకమ్॥ వాతంమాక్షికపాంచాలీచూర్ణయుక్తంవినిర్జయేత్। సితోపలాయుతంపిత్తంజయేదంబుజలోచనే॥

త్రికటుత్రిఫలాయుతంపాన్యా త్కఫరోగంసుదారుణం । అన్యాన్రోగాంజయేద్యుక్త్యా యథాయోగ్యానుపానకైః ॥ పథ్యం పారదవత్సర్వంసేవయేద్వైద్యహారింస్మరణ । నవకంజవిశాలాక్షి ప్రియేపీనపయోధరే ॥

తా॥ రససింధూరమును పిప్పలిచూర్ణములో తేనెవైచి దానితో సేవించిన వాతరోగము, తెల్లచక్కెర త్రిఫలాచూర్ణము వీటితో సేవించిన పిత్తమేహము గంటు భారంగి త్రికటుకచూర్ణము తేనె వీటితో సేవించిన కాస శ్వాస శూల పసుపుచూర్ణము శర్కర వీటితో సేవించిన రక్తదోషము త్రిఫలములు త్రికటుకములు వీటిచూర్ణములను ఏకముజేసి దానితో సేవించిన కామిల పాండువు అగ్నిమాంద్యము చిత్రమూలము పిప్పలి కరక సౌవర్చలవణము వీటిని ఏకముగజేర్చి చూర్ణించి దానితో సేవించిన హృద్రోగము బద్ధకోష్ఠము అగ్నిమాంద్యము శిలాజిత్తు శర్కర యేలకులు వీటిచూర్ణముతో సేవించిన మూత్రకృచ్ఛ్రము వీటిని హరింపంజేయును. సౌవర్చలవణము త్రిఫలాచూర్ణము వీటితో సేవించిన విరేచనము, జాపత్రి లవంగములు అభిని గంజాయి పిప్పళ్లు కుంకుమపువ్వు పచ్చకర్పూరము వీటితో సేవించిన విశేషముగ ధాతుపుష్టి వీటినిగలుగంజేయు. లవంగములు సౌవర్చలవణము కరక్కాయ వీటిచూర్ణముతో సేవించిన వాతాది సర్వజ్వరములు గంజాయి అజామోదము వీటితో సేవించిన ఛర్దిరోగము యివి నివర్తించు. లవంగము కుంకుమపువ్వు వీటిని పై రససింధూరముతో చేర్చి తమలపాకు యందునిడి సేవించినను లేక కుష్మాండచూర్ణముతో సేవించినను విశేషముగ వీర్యవృద్ధిని కలుగంజేయు. పర్పాటకచూర్ణమును బెల్లములో కలిపి దానితో సేవించిన క్రిమిరోగము లవంగములు గంజాయి అభిని వీటితో సేవించిన సర్వాతిసారములు అజామోదము సౌవర్చలవణము వీటితో సేవించిన అగ్నిమాంద్యము యివి నివర్తించు. తిప్పసత్తుతో సేవించిన శరీరపుష్టినిగలుగంజేయు. పిప్పలిచూర్ణములో తేనెకలిపి దానితో సేవించిన వాతరోగము కలకండతో సేవించిన పిత్తరోగము త్రికటుకములు చిత్రమూలము వీటిచూర్ణములను కలిపి దానితో సేవించిన దారుణమగు కఫరోగము యివి నశించు. ఈ రససింధూరమును యుక్తానుపానములతో సేవించిన "శ్రీమహాలక్ష్మీసమేత విష్ణువు భక్తజనులయొక్క పాపములను నశింపంజేయు చందంబున" సమస్తరోగములను పోకొట్టును. వికసించిన తామరపుష్పములవంటి కండ్లును గొప్పకుచములునుగల ఓ ప్రియనాయకీ! రసభస్మమును సేవించునపుడు అందుకు యే ప్రకారము పథ్యాదిక్రమంబుల నుదహరింపఁబడియున్నవో అదే ప్రకారముగ రససింధూర సేవనయందును గూడ నాచరింప వలయు.

## రసకర్పూరానుపానములు.

శ్లో॥ వల్లంవల్లార్థమానేనజీర్ణగుడసమందేయం । యథోచితానుపానేనసర్వకర్మసుయోజయేత్ ॥ ముద్గోదనంతుపథ్యందేయంచాస్మింశ్చతాంబూలం । హరతిసమస్తాన్ రోగాన్ కర్పూరాఖ్యోరసోనృణాం॥

తా॥ శుద్ధిజేయఁబడిన రసకర్పూరము వల్లప్రమాణము గాని లేక అందులో సగముగాని పాతబెల్లముతో సేవింపవలయు. మఱియు తగుమైన అనుపానములతో సేవించి పాలన్నముభుజించి తాంబూలము వేసుకొనిన సమస్తరోగములు నివర్తించు

## గంధకానుపానములు.

శ్లో॥ ఇత్థంవిశుద్ధస్త్రిఫలాజ్యభృంగమధ్వాన్వితశ్శాణమితోవలీఢః। గృధాక్షితుల్యంకురుతేక్షియుగ్మంకరోతిరోగోజ్ఝితదీర్ఘమాయుః। శుద్ధంగంధంనిష్కమాత్రంపదుగ్ధంసేవ్యంమాసంశౌర్యవీర్యప్రవృత్త్యై । షణ్మాసాత్స్యాత్సర్వరోగప్రణాశోదివ్యాందృష్టింధీర్ఘమాయుస్స్వరూపం। మోచాఫలేనత్వగ్దోషంచిత్రకేణమహాబలం । ఆర్ధరూష కషాయేణ క్షయకాసా న్వయేద్ధ్రువం । మందానలత్వంజయతిత్రిఫలాక్వాథ సంయుతః । ఊర్ధ్వగాన్సకలాన్రోగాన్హంతిశీఘ్రంసుగంధకః ॥

తా॥ శుద్ధగంధకభస్మరము త్రిఫలాచూర్ణము నెయ్యి తుంటగలగరరసము తేనె వీటిని నేకముగజేర్చి దానితో శాణప్రమాణము సేవించిన నేత్రములు స్వచ్ఛతమూలదృష్టి యివి గలుగుటయేగాక శరీరారోగ్యమును దీర్ఘాయువును వీటిని మఘ్యాగము గంజేయు. శుద్ధిజేసిన గంధకభస్మమును నిష్కప్రమాణము పాలతో 1 మాసము సేవించిన శౌర్యము బలము యివి గలుగు. 6 మాసములు సేవించిన సమస్తరోగములు బోవుటయేగాక దివ్యదృష్టి దీర్ఘాయుస్సు సౌందర్యము యివి సగాగలుగు. అరటిపండుతో సేవించిన త్వగ్దోషము చిత్రమూలముతో సేవించిన మహాబలము అడ్డసరపు కషాయముతో సేవించిన క్షయ కాస త్రిఫలాకషాయముతో సేవించిన అగ్నిమాం

ద్యము శరీరమునకు ఊర్ధ్వభాగమునందు గలుగు సమస్తరోగములు యివి శీఘ్రముగ నివర్తించు.

హింగుళానుపానములు.

శ్లో॥ వామావశ్యకరస్తథామయహరస్సంమారితో హింగుళః ।
కందర్పంత్రిసుగంధినాశుతను తేవహ్నింబలంసన్మతిం ।
తాంబూలేనపథేనిహంతికసనంశ్వాసంసమస్తాజ్వరాః ।
దేయోఽన్యేష్వవిచార్యసద్గుణయుతై రోగేషువైద్యైర్ధ్రియా॥

తా॥ హింగుళ (యింగిలీకము) భస్మము యేలకులు లవంగములు ఆకుపత్రి వీటిని నేకముజేసిన చూర్ణములో సేవించిన సమస్తరోగములను నివర్తింపజేయుటయే గాక స్త్రీవశ్యకరత్వము కామవృద్ధి అగ్నిపుష్టి బలము సద్బుద్ధి వీటిని పగాగలుగం జేయు. తమలపాకులో సేవించిన కాస శ్వాస సమస్తజ్వరములు యివి నివర్తించు. మఱియు యితర వ్యాధులయందును చక్కగరోచించి యుక్తానుపానములతో సేవింపజేసిన ఆవ్యాధులు నివర్తించు.

అభ్రకానుపానములు.

శ్లో॥ శుద్ధాభ్రంసనువల్లకద్వయమితంకృష్ణామధుభ్యాంయుతం ।
మేహంశ్వాసవిషంచకుష్టమతులంవాతంచపిత్తంకఫం ॥
కాసక్షీణక్షతక్షయంగ్రహణికాంపాండుంభ్రమంకామిలాం ।
గుల్మాద్యంచతథానుపానవిధినామృత్యుంచజేజీయతే ॥

తా॥ 2 వల్లములప్రమాణము అభ్రకభస్మమును తేనెతో చేర్చబడిన పిప్పలీ చూర్ణముతో సేవించిన మేహరోగము శ్వాస విషము కుష్ఠము వాతము పిత్తము కఫము కాస క్షీణత్వము గాయము క్షయము సంగ్రహణి పాండువు భ్రమ కామిల గుల్మము యివి మొదలగు రోగములను హరింపజేయు. మఱియు దీనిని తగుమైన అనుపానములతో సేవించిన అపమృత్యుజయము పగాగలుగు.

అన్యచ్చ.

శ్లో॥ అభ్రకంచనిశాత్ర్యక్తేపిప్పలీమధునాసహ । వింశతించప్రమేహాం
నాంనాశయేన్నాత్రసంశయః ।- అభ్రకంహేమసంయుక్తం

క్షయరోగవినాశనం ॥ రౌప్యహేమాభ్రకంచైవధాతువృద్ధి
కరంపరం॥ గోక్షీరశర్కరాయుక్తంపిత్తరోగవినాశనం । శైలా
జంపిప్పలీచూర్ణమాక్షికైస్సర్వ మేహహృత్ । అభయాగు
డసంయుక్తంవాతరక్తంనియచ్ఛతి। స్వర్ణయుక్తంక్షయంహంతి
ధాతువృద్ధింకరోతిచ । రక్తపిత్తం నిహంత్యాశు చైలాశర్క
రయాసహ॥

తా॥ అభ్రకభస్మమును పిప్పలిచూర్ణములో తేనెవైచి దానితో ప్రాతఃకాలమునందు సేవించిన వింశతిప్రమేహములు వృశ్చికత్తవిత్తుల చూర్ణముతో సేవించిన క్షయరోగము యివి నివర్తించు. రౌప్య స్వర్ణభస్మములతో సేవించిన ధాతువృద్ధిని గలుగంజేయు. ఆవుపాలతో శర్కరవైచి దానితో సేవించిన పిత్తరోగము శిలాజితు భస్మము పిప్పలిచూర్ణము తేనె వీటితో సేవించిన సర్వమేహములు కరకచూర్ణము బెల్లము వీటితో సేవించిన వాతరక్తము యివి మారించు. స్వర్ణభస్మముతో సేవించిన క్షయరోగము తొలగుటయేగాక ధాతువృద్ధి వగాగలుగు. ఏలకచూర్ణము శర్కర వీటితో సేవించిన రక్తపిత్తము నివర్తించు.

అన్యచ్చ.

శ్లో॥ సితామృతాసత్వయుతంమేహంనాశయతేధ్రువం ।
వరామధుఘృతైస్సాకంవీర్యకృన్నేత్రరోగహృత్ ॥
ఏలాగోక్షురభూధాత్రీశర్కరాసహితంతథా।
గోదుగ్ధేనయుతంహంతిమూత్రకృచ్ఛ్రంప్రమేహకం ।
త్రిసుగంధవరావ్యోషశర్కరానాగకేసరం ।
మాక్షికేణనిహంత్యాశుపాండురోగంక్షయంజ్వరం ॥

తా॥ అభ్రకభస్మమును తిప్పసత్తు చక్కెరవీటితో చేర్చి సేవించిన మేహరోగము నివర్తించు. త్రిఫలములు తేనె నెయ్యి వీటితో చేర్చి సేవించిన నేత్రరోగమును పోగొట్టుటయేగాక వీర్యవృద్ధికరముగనుండు. ఏలకులచూర్ణము పల్లేర్లురసము నేలవుసిరిక శర్కర పాలు వీటిని సేకముగకలిపి దానితో సేవించిన మూత్రకృచ్ఛ్రము ప్రమేహము వీటిని నశింపంజేయు. త్రిజాతకములు త్రిఫలములు త్రికటుకములు నాగకేసరములు వీటిచూర్ణములో శర్కర తేనెకలిపి దానితో సేవించిన పాండువు క్షయరోగము జ్వరము యివి నివర్తించు.

## అన్యచ్చ.

శ్లో॥ వల్లంవ్యోషసమన్వితంఘృతయుతంవల్లోన్మితంసేవితం ।
దివ్యాభ్రింక్షయపాండుసంగ్రహణికాశూలంచకుష్ఠామయం।
సర్వంశ్వాసగదంప్రమేహమరుచింకాసామయందుర్ధరం ।
మందాగ్నింజఠరవ్యథాంపరిహరేదభ్రంపామయానిశ్చితం ॥

తా॥ వాయువిడంగములు త్రికటుకములు నెయ్యి వీటితో వల్లప్రమాణము అభ్రికభస్మమును చేర్చి సేవించిన క్షయము పాండురోగము సంగ్రహణి శూల కుష్ఠువు సమస్తశ్వాసలు ప్రమేహము అరుచి కాస మిగులకాస అగ్నిమాంద్యము కడుపునొప్పి శోష వీటిని నిశ్చయముగ నివర్తింపంజేయు.

## హారితాళానుపానములు.

శ్లో॥ అనుపానాన్యనేకానియథాయోగంప్రయోజయేత్ । గుడూ
చ్యాదికషాయేణగదానేతాన్ వ్యపోహతి ॥ సోపద్రవంవాత
రక్తంకుష్ఠాన్యష్టాదశాపివా । సర్వరక్తవికారేషుదేయమా
మ్రమహాంద్రయో । మహాలాహాలజీరాభ్యామపస్మారహరంపరం।
సముద్రఫలయోగేనజలోదరవినాశనః॥ దేవదాలీరసైర్యుక్తం
భగంధరహరంపరం । ఫిరంగదోషజంరోగంజాతంహంతిసుదు
స్తరం॥మంజిష్ఠాదికషాయేణకుష్ఠమష్టాదశంహరేత్ । త్రిఫలా
శర్కరాయుక్తపాండురోగంజయిత్యసౌ। శుంఠీచూర్ణయుతం
హన్యాదామవాతంసుదుర్జయం । సౌవర్ణభస్మయోగేన రక్త
పిత్తవికారనుత్ ॥తంపులీయరసైస్సాకంజ్వరమష్టవిధంజయేత్ ।
ఏవంసర్వేషురోగేషుస్వబుధ్యాకల్పయేద్భిషక్ ॥

తా॥ హారితాళభస్మమును ఆయారోగములకు తగినట్టి అనుపానములతో సేవించవలయును. గుడూచ్యాది కషాయముతో సేవించిన వాతరక్తము అష్టాదశ కుష్ఠువులు యివి నివర్తించు. మామిడిపట్ట చూర్ణము మానిపసపు చూర్ణము వీటితో సేవించిన సర్వరక్తదోషము నివర్తించు. అతివస జీలకర్ర వీటిచూర్ణముతో సేవించిన అపస్మారము సముద్రఫలముతో సేవించిన జలోదరము దేవదాళిరసముతో సేవించిన భగందరరోగము ఫిరంగిరోగము యివి నశించు. మంజిష్ఠాది కషాయముతో సేవించిన

అష్టాదశకుష్ఠవులు త్రిఫలచూర్ణము శర్కర వీటితో సేవించిన పాండురోగము శొంఠి చూర్ణముతో సేవించిన ఆమవాతరోగము స్వర్ణభస్మముతో సేవించిన రక్తపిత్తము చిట్టికూరగరసముతో సేవించిన అష్టవిధ జ్వరములు యివి హరించు. ఈ ప్రకారముగ బుద్ధిమంతుడగు వైద్యుడు అనుపానములను ఆలోచించి ప్రయోగింప వలయు.

## మనశ్శిలానుపానములు.

శ్లో॥ మనశ్శిలాసుమాక్షికేణశుక్రమాశుపిచ్చిటంనిహంన్తివాసరాంధ్రి
మామయంసఖేసంశయః। కణామరీచచూర్ణసంయుతాశిలాం
బునాంజితాత్రిదోషజంజ్వరంవ్యధాఙ్చ భూతసంనివేశజాం ॥
దధ్యంబునాహంన్తితథార్బుదం శిలాశ్వాసంచభాంగ్జీకటుభద్ర
సంయుతా । వాసారసవ్యోషయుతా జయేచ్ఛిచ్ఛిలాకాసం
బలాసంకసకేవన్లై విషం॥

తా॥ శుద్ధిచేయుబడిన మనశ్శిలను తేనెతోచాది నేత్రమున కంజనమిడిన కంటి పూలు పిచ్చిటమను నేత్రరోగము తిమిరరోగము యివి నిస్సందేహముగ నివర్తించు. మనశ్శిలను నీళ్లయందుచాది అందు పిప్పలి మిరియాలు వీటిచూర్ణము చేర్చి అంజన మిడిన త్రిదోషజనిత జ్వరము (సన్నిపాతము) భూతబాధ యివి నివర్తించు. మనశ్శిలను పెరుగుమీది తేటతో సేవించిన అర్బుదరోగము భారంగి అల్లము వీటికషాయముతో సేవించిన శ్వాస అడ్డసరపురసము త్రికటుకములు వీటితో సేవించిన కాస బలాసరోగము పుచ్చొత్తవిత్తుల చూర్ణముతో సేవించిన విషము వీటిని హరింపంజేయు.

## గ్రంథాంతరే.

శ్లో॥ పిప్పలీనింబఫలాభ్యాంశిలావిమర్ద్యాసుకేరివాల్లరసైః। గుటికా
జ్వరామయఘ్నీత్రిదోషభూతజ్వరం నిహంత్యేవ ॥ శిలాయా
ద్విగుణంశంఖమర్థంమారీచకంరజః। సైంధవంస్యాచ్చతుర్థాం
శః మూర్ణంనేత్రగదాపహం ॥ శుక్రంతిమిరకంహంతిమాక్షికేన
చపిచ్చటం । అర్బుదండధితోయేనకంజాక్షిప్రమదోత్తమే ॥
కణామరిచసంయుక్తా శిలాపిష్టాంబునాంజితా । భూతావేశ
హరానేత్రేసన్నిపాతజ్వరాపహా ॥ భార్గ్జివిశ్వాన్వితం శ్వాసం

విషంస్వర్ణసమన్వితం । వాసకస్వరసహ్యోప్యైకఫంకాసంజయే
చ్ఛిలా॥శిలైలార్జునకాసీసగృహధూమాబ్దసర్జకై॥సరోధ్రైరో
చనై ల్లేపః సర్షపస్నేహసంయుతః॥కిలాసంకిటభండద్రుంకుష్ఠం
పామాంభగందరం । ఇంద్రలుప్తమధార్శాంసిహన్యాదేవన్మ
ణామియమ్॥

తా॥ పిప్పళ్ళు నిమ్మపండ్లరసము వీనిచే శుద్ధిజేయబడిన మనశ్శిలను సుకేరివాల రసములో మర్దించి శెనగగింజంత గుటికలుచేసి దానిని సేవించిన జ్వరములు సన్నిపాత జ్వరములు భూతజ్వరము శుద్ధమనశ్శిల 1 భాగము శంఖభస్మము 2 భాగములు మన శ్శిల $\frac{1}{2}$ భాగము మిరియాలచూర్ణము మిరియాలచూర్ణమున $\frac{1}{2}$ భాగము సైంధవ లవణము వీటినన్నిటిని మెత్తగచూర్ణించి నేకముగజేర్చి దానిని తేనెలోకలిపి కండ్ల కంజనమిడిన శుక్రరోగము తిమిరరోగము పిచ్చటము అనునేత్రరోగములు మఱియు పెరుగుమీది తేటలో పైచూర్ణమునుకలిపి అంజనమిడిన అర్బుదరోగము పిప్పళ్ళు మిరియాలు శుద్ధిజేసిన మనశ్శిల వీటిని సమముగజేర్చి దానిని వుదకముతోనూరి కండ్ల కంజనమిడిన భూతపీడ సన్నిపాతజ్వరము గంటుభారంగి శొంఠి వీటిచూర్ణముల నేక ముగజేర్చి దానితో సేవించిన శ్వాసరోగము స్వర్ణభస్మముతో సేవించిన విషపీడ అడ్డ సరపురసములో త్రికటుకచూర్ణముజేర్చి దానితో సేవించిన కఫము కాసరోగము వీటిని నశింపంజేయు. మఱియు మణిశిల యేలకులు మద్దిచెక్క కాసీసము కరు ధూపము తుంగముస్తెలు వేగిసచ్ఛ లొద్దుగచెక్క గోరోచనము వీటినన్నిటిని చూర్ణించి ఆవనూనెలోకలిపి లేపనజేసిన కిలాసరోగము కిటభము దద్రుకుష్ఠము దురద భగందరము యింద్రలుప్తము అర్శస్సు వీటిని వారింపంజేయు.

సౌవీరానుపానములు.

శ్లో॥ నీలాంజనం శుంఠ్యాభయా గుడైః కఫం పిత్తంనిహంత్యాజ్య
సితాయుతంధృవం। వాయుంకణావిశ్వమరీచమాక్షికైర్దేయం
ధియాన్యేషుగదేషుపండితైః॥

తా॥ సౌవీరమును శొంఠి కరక్కాయ బెల్లము వీటితో సేవించిన కఫము నెయ్యి శర్కర వీటితో సేవించిన పిత్తము పిప్పలి శొంఠి మిరియాలు తేనె వీటితో సేవించిన వాతము వీటిని నశింపంజేయు. మఱియు పండితుడు యితరరోగముల యందు తగునైన అనుపానములతో దీనిని సేవింపంజేసిన ఆయారోగములు నివర్తించు.

## ఖర్పరానుపానములు.

శ్లో॥ తద్భస్మమృతికాంతేనసమేనసహయోజయేత్ । అష్టగుంజామితంమార్గం త్రిఫలాక్వాథసంయుతం । కాంతపాత్ర స్థితం రాత్రౌతిలజప్రతిపాపకం । నిషేవితం నిహన్త్యాశుమధుమేహమపిధ్రువం । పిత్తక్షయంచపాండుంచశ్వయథుంగుల్మమేవచ। రక్తగుల్మంచనారీణాంప్రదరంసోమరోగకం।యోనిరోగానుశేషాంశ్చవిషమాంశ్చజ్వరానపి । రజశ్శూలంచశ్వాసంచహిధ్మినాంచవిశేషతః॥

తా॥ ఖర్పరభస్మము కాంతభస్మము వీటిని సమముగచేర్చి 8 గురిగింజలప్రమాణము త్రిఫలా కషాయమునందునైచి దానిని లోహపాత్ర యందొకరాత్రినునిచి మరునాము ప్రాతఃకాలమునందు సేవించిన మధుమేహము పిత్తక్షయరోగము పాండు రోగము శోఫ గుల్మరోగము స్త్రీలకుజనించెడు రక్తగుల్మము ప్రదరరోగము సోమ రోగము సమస్తయోనిరోగములు విషజ్వరములు రజశ్శూల శ్వాస యెక్కిళ్ళు వీటిని బోకడచు.

## వజ్రభస్మానుపానములు.

శ్లో॥ కుష్ఠేఖాదిరత్వక్క్వథా పవనజాసృక్ శృంగబేరంమధుదేయం కాసబలాసశ్వాసవికృతౌ వాసోష ణాత్వక్క్వథా ॥ పిత్తేదాహపితానమంజ్వరిగణేచ్ఛిన్నాడలేతిక్తకేవజ్రంమారిత శుక్తభస్మగిదహృద్యోజ్యంభిషక్ యుక్తిభిః॥

తా॥ వజ్రభస్మమును చండ్రచుట్ట కషాయముతో సేవించిన కుష్ఠరోగము చర్మరోగము అల్లపురసములో తేనెనైచి దానితో సేవించిన వాతరక్తము త్రికటుకములు లవంగములు వోమము అడ్డసరము వీటికషాయముతో సేవించిన కాస శ్వాస బలాస శర్కరతో సేవించిన పిత్తము తాపము తిప్పతీగ నేలవేము వీటికషాయముతో సేవించిన సమస్తజ్వరములు యివి నివర్తించు. మఱియు బుద్ధిమంతుడగు వైద్యుడు తనబుద్ధిచాతుర్యముచేత యోచించి తగుపాటి అనుపానములతో నిప్పించిన సర్వరోగములు నివర్తించు.

## వైక్రాంతానుపానములు.

శ్లో॥ భస్మత్వంసముపాగతో వికృతకో హేమ్నామృతేనాన్వితః ।
పాదాంశేనకలాజ్యవల్లసహితో గుంజోన్మితస్సేవితః ।
యక్ష్మాణంజ్వరణంచపాండుగుదజంశ్వాసంచ ।
కాసామయంద్రుష్టాంసైగ్రహణీమురఃక్షత ముఖాన్ రోగాన్
జయేద్దేహకృత్॥

తా॥ వైక్రాంతభస్మము 1 గురిగింజప్రమాణము $\frac{1}{4}$ గురిగింజయెత్తు స్వర్ణభస్మము వీటిని 3 గురిగింజలయెత్తు పాతనేతిలో కలిపి సేవించిన క్షయరోగము జ్వరము పాండురోగము గుదరోగము శ్వాస కాస క్రూరమగు సంగ్రహణి వురక్షతము వీటిని నివర్తింపం జేయుటయేగాక శరీరపుష్టిని సగాగలుగంజేయు.

## నీల వైక్రాంతి భస్మానుపానములు.

శ్లో॥ సూతభస్మార్ధసంయుక్తంనీలవైక్రాంతభస్మకం ।
మృతాభ్రికంతయోస్తులితంపరిమర్ధితం ॥
క్షౌద్రాజ్యసంయుతంప్రాతర్గుంజామాత్రంనిషేవితం ।
నిహంతిసకలాన్ రోగాన్ దుర్జయానన్యభేషజైః।
త్రిసప్తదివసైస్సర్వాణాంగంగాంభఇవపాతకం॥

తా॥ రసభస్మము 1 భాగము నీలవైక్రాంతభస్మము $\frac{1}{2}$ భాగము యీ రెంటికి సమము అభ్రికభస్మము వీటిని సేకముగజేర్చి చక్కగమర్దించి అందు తేనె నెయ్యి వీటినిజైచి కలిపి 1 గురిగింజయెత్తు 21 దినములపర్యంతము ప్రతిదినము ప్రాతఃకాలమునందు సేవించిన గంగోదకము పాపముల నశింపంజేయు చందంబున అసాధ్యములగు సర్వరోగములను నివర్తింపంజేయు.

## ప్రవాళ భస్మానుపానములు.

శ్లో॥ ప్రవాళభస్మమాక్షీకేణమాగధీ యుతేనవై నిహంతిమారుతం
కోష్ఠగంజ్వరంపురాతనం । జయేత్సుపక్వవారుణీఫలేనశుక్ర
సంక్షయందదాతిపుష్టిమాశుశర్కరాజ్య సంయుతంన్రుణాం ॥
సితాపయోయుతంనిహంతి పిత్తమాశుదారుణం సఖేసుశాలి
జైగినామైశ్చమూత్రకృచ్ఛ్రిమామయం।చికిత్సకైర్విచార్యదే

యథాయోగమతోయేషు వైద్యోయాఖిలేష్వనేక తంత్ర సమ్మతేన మత్కృతిస్త్వియం॥

తా॥ ప్రవాళ (పవడము) భస్మమును పిప్పలిచూర్ణము తేనె వీటినికలిపి దానితో సేవించిన కోష్ఠగతవాతము పురాణజ్వరము పాపర (పెత్తిపుచ్చ) పండు రసముతో సేవించిన ధాతు క్షయము వీటిని నశింపంజేయును. శర్కర నెయ్యి వీటితో సేవించిన శరీరపుష్టిని గలుగంజేయును. పాలు శర్కర వీటితో సేవించిన దారుణమగు పిత్తరోగము చల్లనికడుగునీళ్లతో సేవించిన మూత్రరోగము వీటినిబోకడచు మఱియు వైద్యుడు ఆయారోగములయందు అనుపానములను బుద్ధిచేతనూహించి సేవింపజేసిన యవి నివర్తించు

రసోపర సాద్యౌషధములకన్నిటికిని కొన్నిరోగముల యందనుపానములు.

శ్లో॥ శూలేహింగుఘృతాన్వితం మధుయుతాకృష్ణాపురాణజ్వరే।
వాతేసాజ్వరసోనకఃశ్వసనకేక్షౌద్రాన్వితంత్రూషణం।
శీతేవ్యాలలతాదళంసమరిచంమేహేవరాసోపలా।
దోషాణాంత్రితయేఽనుపానముచితంసక్షౌద్రమార్ద్రాదికం॥

తా॥ సమస్త సోపరసములు మొదలైన ఔషధములను సామాన్యముగ కొన్ని రోగములయందును అనుపానములను చెప్పుచున్నాను. రసోపరసాద్యౌషధములకు శూలరోగమునందు నేతితో చేర్చబడిన యింగువ పురాణజ్వరమునందు పిప్పలీచూర్ణముతో చేర్చబడిన తేనె వాతరోగమునందు నేతితో చేర్చబడిన వుల్లి కాసరోగము నందు తేనెతో గూడిన త్రూషణచూర్ణము శీతరోగమునందు తమలపాకునందుంచబడిన మిరియాలు మేహరోగమునందు త్రిఫలముతో చేర్చబడిన యిరుగుడురసము త్రిదోషములందు తేనెతో చేర్చబడిన అల్లపురసము యివి అనుపానములని యెఱుంగవలయును.

శ్లో॥ ఘనపర్పటకంజ్వరేగ్రహణ్యాంమథితం హేమగిరేవమిాషులాజాః। కుటజోఽతిసృతౌవృషోఽస్రపిత్తేగుదకీలేష్వనలఃకృమౌ కృమిఘ్నః॥

తా॥ జ్వరమునందు తుంగముస్తెలు పర్పాటకము గ్రహణీరోగమునందు మజ్జిగ విషరోగమునందు పుష్కొత్తవిత్తులు వాంతిరోగమునందు పేలాలు అతిసారమునందు కొడిసవిత్తులు రక్తపిత్తమునందు అడ్డసరము మూలవ్యాధియందు చిత్రమూలము క్రిమి

రోగమునందు వాయువిడంగములు యివి రసోపరసాదులకు పైజెప్పబడిన రోగములయందును పానములని తెలియవలయు.

## విషానుపానములు.

శ్లో॥ శిఖికర్కరిసోపేతంవిషమజ్వరజిద్విషం। విషయష్ట్యాహ్వయం
రాస్నా సేవ్యముత్పలకందకం। తండులోదకపీతానిరక్తపిత్త
స్యభేషజం।రాస్నావిడంగత్రిఫలాదేవదారుకటుత్రయం। పద్మ
కంక్షౌద్రమమృతావిషంచశ్వాసకాసజిత్। సితారసవిషక్షీర
ప్రవాళమధుభిఃకృతా। వాంతింనిహంతిగుటికామనుజానాంన
సంశయః। మధుమద్యానిశారేణుసైంధవైఃకుటత్వగ్యుతం।
చ్యవనప్రాశనోపేతంవిషంక్షయతిక్షయం॥

తా॥ విషముని శుద్ధమైలుతుత్థభస్మము పారదభస్మము వీటితో సేవించిన విషమజ్వరము విషయష్టి సన్నరాస్నము కలువగడ్డ బియ్యపుకడుగునీళ్ళు వీటితో సేవించిన రక్తపిత్తము సన్నరాస్నము వాయువిడంగములు త్రిఫలములు దేవదారు త్రికటుకములు తామరగడ్డ తేనె తిప్పసత్తు వీటితో సేవించిన శ్వాసకాసలు శర్కర శుద్ధ పారదభస్మము అతివస పాలు పగడభస్మము తేనె వీటిని నేకముగజేసి సేవించిన వాంతి రోగము మ్రానిపసపు పర్పాటకము సైంధవలవణము దుంపలపుచెట్టుపట్ట వీటి చూర్ణములను తేనె మద్యము వీటితో చేర్చి దానితో సేవించిన క్షయరోగము నివర్తించు.

శ్లో॥ విజయాపిప్పలీమూలంపిప్పలీద్వయచిత్రకైః। పుష్కరాహ్వ
సఠీద్రాక్షాయవానీక్షారదీప్యకైః॥ సితాయష్టీద్విబృహతీసైంధ
వైఃపాలికైః పచేత్। సవిషార్ధపలైఃప్రస్థంఘృతాత్తంజీర్ణభుక్తే
పిబేత్॥ దుర్నామమేహగుల్మాశ్మతిమిరకృమిపాండుకాః। గల
గ్రహగ్రహోన్మాదకుష్ఠానిచనియచ్ఛతి॥ముస్తావత్సకపాఠా
గ్నివ్యోషప్రతివిషావిషం। ధాతకీమోచనిర్యాసంచూతాస్థి
గ్రహణీహరం। కృచ్ఛ్రఘ్నావిషపథ్యాగ్నిదంతీద్రాక్షావిషా
వృషాః॥శిలాజితువిషంత్ర్యూషముదావర్తాశ్మరీహరం॥

తా॥ విషమును కరక్కాయ మోడి పిప్పలి గజపిప్పలి చిత్రమూలము పుష్కరమూలము కచోరములు ద్రాక్ష యవక్షారము వోమము శర్కర యష్టిమధుకము ములక వాకుడు సైంధవలవణము చంగల్వకోష్టు ½ పలము వసనాభి వీటిని చేర్చివండి

నీడనుయెండించి పిదపచూర్ణించి కేతిలోనైచి 4 మాసములుంచి పిదప దానిని ప్రతి నిత్యము సేవించిన దుర్నామరోగము మేహము గుల్మము అగ్నిమాంద్యము అతిసారము క్రిమి పాండువు గళగ్రహము వున్మాదము కుష్టువు వీటిని నివర్తింపంజేయు. తుంగముస్తెలు కొడిశవిత్తులు విషబొద్ది చిత్రమూలము త్రికటుకములు అతివస వసనాభి ఆరె బూరుగబంక మామిడిపప్పు వీటికషాయముతో సేవించిన గ్రహణిరోగము వసనాభి కరక్కాయ చిత్రమూలము దంతివిత్తులు ద్రాక్ష అతివస అడ్డసరము వీటికషాయముతో సేవించిన మూత్రకృచ్ఛ్రము శిలాజతుభస్మము వసనాభి త్రికటుకములు వీటికషాయ ముతో సేవించిన వుదావర్తము అగ్నిమాంద్యము వీటిని హరింపంజేయు.

శ్లో॥ గోమూత్రక్షారసింధూత్థ విషపాషాణభేదకం । వజ్రసన్ధార
యత్యేతదేకతఃపీతమశ్మరీం । త్రిఫలాసర్జికాక్షారైర్విషంగుల్మ
ప్రభేదనం। పిప్పలీపిప్పలీమూలంవిషంశూలహరంపరం । విషం
ద్రవంతిమధుక ద్రాక్షారాస్నానరీకణాః ॥ విషవేల్లమిశిక్షీరం
గుల్మప్లీహానిబర్హణం । ప్లీహోదరఘ్నంపయసాశతాహ్వా
కృమిజిద్విషం । వాయసీమూలక్వాథేనపీతంకుష్ఠహరంవిషం॥
పయసారాజవృక్షత్వక్ త్రాయంతీవాకుచీబలాత్ । ప్లీహఘ్నం
వాకుచాయాంచవిషంక్వాథేనకుష్ఠజిత్ । అవ్గుజైలాకజయా
విడక్షారద్వయంవిషం । లేపస్సైంధవఃపిష్టో వారిణాకుష్ఠ
నాశనః॥

తా॥ విషమును గోమూత్రము యవక్షారము సైంధవలవణము క్రొమ్మసగ్గోవి వీటికషాయముతో సేవించిన వజ్రాయుధము పర్వతము భేదించుచందంబున అశ్మరీ రోగమును త్రిఫలాచూర్ణము సర్జక్షారము వీటితో సేవించిన గుల్మరోగమును పిప్పలి మోడి వీటికషాయముతో సేవించిన శూలరోగమును యెలికచెవియాకు యష్టిమధుకము ద్రాక్ష సన్నరాస్నము కచోరములు వసనాభి వాయువిడంగములు సదాప వీటి కషాయములో పాలుబోసి దానితో సేవించిన గుల్మ ప్లీహారోగములును నశించు. పాలతోసేవించిన ప్లీహము వుదరరోగము వీటిని నివర్తింపంజేయు. సదాపవిత్తుల కషాయముతో సేవించిన కృమిరోగము కాచాకురసముతో సేవించిన కుష్ఠరోగము రేలపట్ట కలుత్రానుగ కారుగట్టె వీటిచూర్ణమును పాలలోవైచి దానితో సేవించిన ప్లీహారోగము కారుగట్టె కషాయముతో సేవించిన కుష్ఠరోగము త్రాలుపట్ట యేలకులు

**కరక్కాయ వాయువిడంగములు సజ్జక్షారము యవక్షారము సైంధవలవణము వీటిని వుదకముతో నూరి శరీరమునకు లేపనముచేసిన కుష్ఠరోగము వీటిని బోకడము.**

శ్లో॥ ఏరండతైలత్రిఫలాగోమూత్రంచిత్రకంవిషం । సర్పిషాసహితం
పీతంవాతార్తత్వమపోహతి॥స్వరసంబీజపూరశ్యవచాబ్రాహ్మీ
రసంస్మృతం ॥ సంధ్యాపిబతిసవిషం సుపుత్రైః పరివార్యతే ।
హీరాలాంగలికీదంతీవిషపాషాణభేదకైః । ప్రయోజ్యమూఢగ
ర్భాణాంప్రలేపోగర్భమోచనః । దేవదారువిషంసర్పిర్గోమూ
త్రంకంటకారికా । వచావాస్థలసంహాన్తిబుద్ధేశ్చాంరవర్ధనం ।
విషంసర్పిస్సితాక్షౌద్రంతిమిరాపహమంజనం । విషంచైకమజా
క్షీరకల్పితంఘృతధూపితం । విషంధాత్రీఫలరసైరసకృత్పరివా
సితం । అంజనంశంఖసహితంప్రగాఢంతిమిరంజయేత్ । విష
మింద్రాయుధంస్తన్యేఘృష్టంకాచభిదంజనం । బీజపూరరసై
ర్ఘృష్టంవిషంతద్వత్సితాన్వితం । విషంమాగధికాద్వేచనిషా
కాచఘ్నమంజనం।శుక్లార్మంచవిషంకృష్ణాయుక్తంగోమూత్ర
భావితం । భల్లాతకాగ్నికమ్యాకవిషైర్నామూత్రపేషితైః ।
లేపోవిచర్చికాక్షుద్రరపికాకిటిభాపహః ॥ ఖర్జికాక్షారసింధూత్థ
శుక్తశుక్తవరంవిషం । కర్ణయోఃపూరణంతీవ్ర కర్ణశూలనిబ
ర్హణం ప్రపౌండరీకమంజిష్ఠావిషతిందుసముద్భవైః । నిహంతి
సాధితంతైలం గండూషేణసుఖామయాన్ । శాలాఖదిరకం
కోలజాతీకమ్పూరచందనైః । ఓలాబ్దవాలైర్ద్విగుణ విషైస్సా
రాంబుపేషితైః । సమూత్రవటికాక్లుప్తాఘృతైర్ఘ్నంతిముఖా
మయాన్ ।కటుతైలంవిషంనస్యంపలితారుంషికాపహం॥గుంజా
టంకణశిగ్రుమూలరజనీసంపాకభల్లాతక । స్నుహ్యర్కాగ్నికరం
జసైంధవవచాకుష్ఠాభయాలాంగలీ।వర్షాభూషడభూశిరీషరణా
ఖ్యోపాశ్వమారోవిషం। గోమూత్రంశ్లుమదేద్విలుప్తమపచీం
గ్రంథ్యర్బుదేశ్లీపదాన్॥

తా॥ విషమును చిట్లాముదము గోమూత్రము నెయ్యి వీటిని నేకముగజేర్చి అందు త్రిఫలములు చిత్రమూలము వీటిచూర్ణములనువైచి దానితో సేవించిన వాతరోగమునివర్తించు. బ్రాహ్మీరసము నెయ్యి వీటియందు వసచూర్ణమువైచి దానితో సేవించిన వంధ్యాత్వమునివర్తించు గజనిమ్మ తరిగొప్పు దంతి వసనాభి క్రొమ్మనగ్రోవి వీటినన్నిటిని నేకముగ ఘుటకముతోనూరి గర్భమునకు లేపనముజేసిన మూఢగర్భవిమోచనముగలుగు. దేవదారు వసనాభి వస వీటిచూర్ణమును నెయ్యి గోమూత్రము వీటిని జేర్చి దానియందువైచి దానితోసేవించిన వత్తిరోగము నివర్తించుటయేగాక బుద్ధి వృద్ధి సగాగలుగు. నెయ్యి తేనె శర్కర వీటితోచేర్చి అంజనమిడినగాని లేక నెయ్యి మేకపాలు వీటితో అంజనమిడినగాని తిమిరరోగము నివర్తించు. శంఖభస్మము విషము వీటిని పుసిరికరసముతో అనేకమార్లు భావనచేసి నేత్రముల కంజనమిడిన గాఢమైన తిమిరరోగమునశించు. వజ్రభస్మము చనుబాలు నెయ్యి వీటిని నేకముగ కలిపి అంజనమిడిన గాని లేక మాదీఫలరసము శర్కర విషము వీటిని నేకముగజేర్చి రంగరించి అంజనమిడిన గాని కాచమనే నేత్రరోగము నివర్తించు పిప్పలి గజపిప్పలి వీటిచూర్ణమును తెల్లతామరపువ్వురసముతో కలిపి అందు విషమునుచేర్చి నేత్రముల కంజనమిడిన కాచరోగము నివర్తించు. పిప్పలీ విషము వీటిని గోమూత్రములో భావనచేసి అంజనమిడిన శుక్లార్మమనే నేత్రరోగము నివర్తించు. జీడి చిత్రమూలము రేల విషము వీటిని గోమూత్రముతోనూరి శరీరమునకు లేపనముజేసికొనిన గజ్జి దద్రువ రసికా క్రిటిభఅను కుష్ఠురోగములు యివి నివర్తించు. సర్జక్షారము సైంధవలవణము త్రిఫలములు విషము వీటిని పులికల్లులోవైచి చెవులయందుపోసిన కర్ణశూల నివర్తియగు. ప్రపౌండరీకమనే గ్రంథద్రవ్యము మంజిష్ఠ విషము తుమికి వీటినినూనెయందువైచి తైలపక్వముగకాచి దానిని పుక్కిలించిన ముఖరోగము నివర్తించు. యేపి చంద్ర తక్కోలాలు జాజికాయ పచ్చకర్పూరము శ్రీగంధము బోళము అబ్దవాలము యివి ప్రత్యేకముగ 1 భాగము 2 భాగములు విషము వీటిని సంబరేణురసము గోమూత్రము వీటితోనూరి వటుకములుచేసి నేతితో సేవించిన ముఖరోగములన్నియును నివర్తించు. కటుకరోహిణి విషము వీటిని మంచినూనెలోవైచి కాచి నస్యముజేసిన పలికా అరుంషికా అను శిరోగములునశించు. గురిగింజ వెలిగారము మునగవేరు కోరిందపట్ట రేలపట్ట జీడి అకుజెముడు జిల్లేడు చిత్రమూలము వ్యాఘ్రనఖమనే గ్రంథద్రవ్యము

సైంధవలవణము వస చంగల్వకోష్టు కరక్కాయ నీరు పిప్పలి గలిజేరు పుత్తరేణి దిరిశనము త్రికటుకములు గన్నేరు విషము వీటిచూర్ణమును గోమూత్రముతో నూరి లేపము జేసిన అపచీరోగము గ్రంధిరోగము అర్బుదరోగము శ్లీపదరోగము యివి తొలగు.

గద్య॥ ఇతి శ్రీమదాంధ్రీ భాషానువాద భూషితే, అనుపానరత్నాకరే
సప్తధాతూపధాతు పారదాది రసోపరసానాం విషస్య
చానుపాన వివేకకథనన్నామ, తృతీయస్సర్గః.



శ్రీరస్తు.

# అనుపానరత్నాకరము.

## ఆంధ్రతాత్పర్యము.



### చతుర్థస్తరంగము.

### సప్తధాతు శోధన.

శ్లో॥ స్వర్ణతారారతామ్రాణాంపత్రాణ్యగ్నౌప్రతాపయేత్ ।
నిషిక్త్వాత్తప్తతప్తాని తైలేతక్రేచకాంజికే ।
గోమూత్రేచకులుత్థానాంకషాయేచత్రిధాత్రిధా ।
ఏవంస్వర్ణాదిలోహానాంవిశుద్ధిస్సంప్రజాయతే ॥

తా॥ బంగారు వెండి యిత్తడి రాగి వీటిని పలచవగ రేకులుజేసి అనేకమార్లు నిప్పుయందుకాచి నూనె మజ్జిగ కాంజికము గోమూత్రము వులవకషాయము వీటిలో ప్రతిదానియందును మూడేసిమార్లు ముంచిన నవిశుద్ధియగు. ఇదేప్రకారము స్వర్ణాది సప్తధాతువులను శుద్ధిజేయవలయు.

### ఉపధాతు (అనగా) సువర్ణమాక్షికశోధన.

శ్లో॥ మాక్షికస్యత్రయోభాగాభాగైకంసైంధవస్యచ ।
మాతులుంగద్రవైర్వాథజమ్బీరస్యద్రవైఃపచేత్ ।
చాలయేల్లోహజేపాత్రేమావత్పాత్రంసులోహితం ।
భవేత్తతస్తుసంశుద్ధింస్వర్ణమాక్షికమృచ్ఛతి॥

తా॥ స్వర్ణమాక్షికము 3 భాగములు సైంధవలవణము 1 భాగము వీటిని చూర్ణించి యినపబాణలిలోవైచి అగ్నిపైనునిచి 'యందు మాదీఫలరసమును గాని లేక నిమ్మపండ్లరసమునుగాని బోసి బాణలియెఱ్ఱగ యగువరకు యినప గరిటెతో కలియ బెట్టుచుండిన స్వర్ణమాక్షికము శుద్ధియగు.

## రౌప్యమాక్షిక శోధన.

శ్లో॥ కర్కోటీమేషశృంగ్యుత్థైర్ద్రవైర్జంబీరజైర్దినం ।
భావయేదాతపేతీవ్రే విమలాశుధ్యతిధ్రువం ॥

తా॥ రౌప్యమాక్షికమును డావరడంగి తీగెరసముతో 1 దినంబును వర్ధికూర రసముతో 1 దినంబును నిమ్మపండ్లరసముతో 1 దినంబును మర్దించి ప్రతిదినంబును తీక్ష్ణమగు యెండ నెండించిన నది శుద్ధియగు.

## తుత్థ శోధన.

శ్లో॥ విష్టయాన్మద్రయేత్తుత్థంమార్జారకకపోతయోః ।
దశాంశంటంకణందత్వాపచేన్మృదుపుటేస్త్రతః॥
పుటందధ్నాపుటంక్షౌద్రైర్దేయంతుత్థవిశుద్ధయే॥

తా॥ పిల్లివిష్టము పావురపిట్టమలము వీటిని మైలుతుత్థమునకు సమభాగంబుగను వెలిగారము మైలుతుత్థమునకు సమభాగంబుగను గ్రహించి ఖల్వమున జక్కగ మర్దించి యెండనెండించి ప్రమిదలయందునిచి చీలయిచ్చి అడవి యేరుపిడకలలో లఘుపుటంబిడి పిదప దానిని పెరుగుతో మర్దించి పైజెప్పిన ప్రకారము మరల లఘుపుటంబిడవలయు. ఇటులనే తేనెతోనూరి పుటంబిడిన మైలుతుత్థము శుద్ధియగు.

## కాంస్యరీతి శోధన.

శ్లో॥ శోధనంకాంస్యరీతోశ్చధాతుశ్శుద్ధిసమంభవేత్ ॥

తా॥ స్వర్ణాది ధాతువుల శోధనమువలెనే కంచు యిత్తడి వీటికికూడ శోధన జేయవలయు.

## సిందూర శోధ..

శ్లో॥ దుగ్ధామ్లయోగత స్తస్యవిశుద్ధిర్గతితాబుధైః॥

తా॥ పాలు పులుసు వీటితో సిందూరము ను శుద్ధిచేయవలయు.

## శిలాజతు శోధన.

శ్లో॥ హేమాద్యాస్సూర్యసంతాపాత్స్రవంతిగిరిధాతవః ।
తచ్ఛాంభోమృదుమృత్స్నాభంతద్భవేచ్ఛిలాజతు ॥

శిలాజతుసమానీయగ్రీష్మతప్తశిలాచ్యుతం ।
గోదుగ్ధైస్త్రిఫలాక్వాథైర్భృంగద్రావైశ్చమర్దయేత్ ॥
ఆతపేదినమేకైకంతచ్ఛుష్కంశుద్ధతాంవ్రజేత్ ॥

తా॥ గ్రీష్మఋతువునందు సూర్యసంతాపముచే పర్వతాదులయందలి హేమాది ధాతువులు తపించి యందుండి రసముద్రవించి ఘనీభవించుటయ శిలాజత్తు అనంబడు. అట్టిశిలాజిత్తును ఆవుపాలు త్రిఫలకషాయము గుంటగలగరరసము వీటిలో ప్రతిదాని చేతను నొక్కొక్కదినముచొప్పున ఖల్వమునమర్దించి 1 దినము యెండనెండించిన నది శుద్ధియగు.

రససంస్కారము.

శ్లో॥ అష్టాదశైవసంస్కారాః నవింశతికాః క్వచిత్ ।
సంప్రోక్తారసరాజస్యవసుసంఖ్యాః క్వచిన్మతాః ॥

తా॥ రసమునకు 18 సంస్కారములు గలవనియు 19 సంస్కారములు గలవనియు 8 సంస్కారములు గలవనియును జెప్పబడియున్నది

రసాష్టాదశసంస్కార వివరణము.

శ్లో॥ స్వేదనంమర్దనంమూర్ఛోత్థాపనంపాతనంత్రిధా ।
బోధనంనియమంచైవదీపనంచానువాసనమ్ ।
మారణంజారణంచైవసారణంప్రతిసారణమ్ ।
క్రామణంవేధనంచైవదేహయోగేచశస్యతే ॥

తా॥ స్వేదనము మర్దనము మూర్ఛనము ఉత్థాపనము అధఃపాతనము తిర్యక్పాతనము ఊర్ధ్వపాతనము బోధనము నియమము దీపనము అనువాసనము మారణము జారణము సారణము ప్రతిసారణము క్రామణము వేధనము శరీరయోగము అనునవి రసాష్టాదశ సంస్కారంబు లనంబడు.

స్వేదనవిధి.

శ్లో॥ త్ర్యూషణంలవణంరాజీరజనీత్రిఫలార్ద్రకమ్ ।
మహాబలానాగబలామేఘనాదఃపునర్నవా ।
మేషశృంగచిత్రకంచవషసాంశసమంసమమ్ ।

రసస్యషోడశాంశేనసర్వంయుంజ్యాత్పృథక్పృథక్ ।
ఏతత్సమస్తంవ్యస్తంవాపూర్వామ్లేనైవపేషయేత్ ।
లింపేదనేనకల్కేనవస్త్రేనాంగుళిమాత్రకమ్ ।
తన్మధ్యేనిక్షిపేత్సూతంబధ్వాతత్రదినంపచేత్ ।
డోలాయంత్రేమ్లనంయుక్తేజాయతేస్వేదితోరసః ॥

తా॥ త్రికటుకములు వుప్పు ఆవాలు పసపు త్రిఫలములు అల్లము పెద్దముత్తవ పులగము నాగముత్తవపులగము చిర్రికూర తెల్లగలిజేరు వద్ది చిత్రమూలము నవాసాగరము అనువానిలో ప్రతిద్రవ్యమునుగాని అందు దొరికినవానినిగాని రసమునకు 16 వ భాగము గ్రహించి ప్రత్యేకముగగాని సముదాయముగగాని కలితోనూరి వస్త్రముపై అంగుళప్రమాణము లేపనముజేసి దానిమధ్యమున పాదరసమునుబోసి వస్త్రములో మూటగట్టి దానిని డోలాయంత్రమున దగిలించి కలితో 1 దినము వండుటయు స్వేదనమనంబడు.

## మర్దనవిధి.

శ్లో॥ భిషగ్భిర్మర్దయేచ్చూర్ణైర్మిళిత్వాషోడశాంశతః ।
సూతస్యగాలితేవస్త్రేవక్ష్యమాణద్రవాదిభిః ।
గృహధూమేష్టికాచూర్ణంతథాదధిగుడాన్వితమ్ ।
లవణాసురిసంయుక్తంక్షిప్త్వాసూతంవిమర్దయేత్ ।
జీర్ణాభ్రకంతథాజీర్ణబీజసూతంతథైవచ ।
గృహ్ణాతినిర్మలోరోగాన్‌గ్రాసేగ్రాసేవిమర్దితః ॥

తా॥ కరుధూపము యిటికెరాయిపొడి పెరుగు బెల్లము వుప్పు ఆవాలు జీర్ణాభ్రకము వీటిలో ప్రతిదాని చూర్ణమును రసమునకు 16 వ భాగముజేర్చి మర్దించి రసమును వస్త్రములోబోసి పిడిచిన నిర్మలమై శీఘ్రముగ రోగముల హరింపంజేయును.

## మూర్ఛనవిధి.

శ్లో॥ సహకన్యామలంహంతిత్రిఫలావహ్నినాశినీ ।
చిత్రమూలంవిషంహంతితస్మాత్తంచప్రయత్నతః ।
మిశ్రితంమర్దయేత్సూతంసప్తవారేణమూర్ఛయేత్ ।
ఇత్థంసంమూర్ఛితస్సూతోదోషశూన్యఃప్రజాయతే ॥

తా॥ కలుబంద పాదరసమునందలి మలదోషమును త్రిఫలము వహ్నిదోషమును చిత్రమూలము విషదోషమును హరింపంజేయును. కావున మిశ్రిత పాదరసమును కలుబంద త్రిఫలములు చిత్రమూలము అనువాని రసములతో ప్రతిదానిచే యేడేసిమార్లు మర్దించిన రసము మూర్ఛంజెందు. ఇటుల మూర్ఛంజెందినరసము దోషరహితంబు.

ఉత్థాపనవిధి.

శ్లో॥ జలైస్స్విన్నాఽరనాళై ర్వాక్షాళనాదుత్థితో భవేత్ ।
అథవాపాతనాయంత్రేపాతనాదుత్థితో భవేత్ ।
ఉత్థితః కాంజికక్వాథైః క్షాళనీయమతఃపరమ్ ॥

తా॥ పాదరసమును వుష్ణోదకముతోగాని వుష్ణముగనుండు కలితోగాని కడిగి దీసికొనిన వుత్థితంబగు , లేక ఊర్ధ్వపాతనా యంత్రమునందును వుత్థితంబగు ; వుత్థాపనానంతరము రసమునుష్ణముగనుండు కలితోగడుగవలయును.

ఊర్ధ్వపాతనవిధి.

శ్లో॥ భాగాస్త్రయోరసస్యార్క-చూర్ణమంశాంశనింబుకమ్ ।
తతస్సంమర్దయేద్యావత్తావదాయాతిపిండతామ్ ।
తత్పిండంతలభాండస్థమూర్ధ్వభాండేజలంక్షిపేత్ ।
కృత్వాలంబాలకేయంత్రేదత్వావార్ద్రంహిమోదకమ్ ।
సంరోప్యచాగ్నింమధ్యస్థంచతుర్యామంహిబోధయేత్ ।
యుక్త్యోర్ధ్వభాండసంలగ్నంగృహ్ణీయాత్పారదంతతః ।
ఊర్ధ్వపాతనమిత్యుక్తంభిషగ్భిస్సూతశోధనే ।
ససూతభాండవివరమన్యద్గలతిభాండకే ।
తథాసంధిర్ద్వయోఃకార్యాపాతనాయంత్రమంత్రకే ।
యంత్రప్రమాణంవదనాద్గురోర్జ్ఞేయంవిచక్షణః ॥

తా॥ పాదరసము 3 భాగములు జిల్లేడుపట్టచూర్ణము 1 భాగము యిటుల వీనిని గ్రహించి అందొకింత నిమ్మపండ్లరసముబోసి యుంటగనగువరకు మర్దించి దాని నధస్థితభాండమునందునిచి పైభాండమునం దుదకముబోయుటచే డమరుకాయంత్రమని బఱంగెడు దానిని పొయిమీదనునిచి పైభాండమునందు శీతోదకముబోయుచు 4 ఝాములు మధ్యమాగ్నితోవండి పైకుండ నంటియుండు రసమును యుక్తితో

గ్రహింపవలయు. రసశోధన విషయమున జేయంబడు నీక్రియనే ఊర్ధ్వపాతనమని యెదరు. ఊర్ధ్వపాతనాధస్థిత భాండముఖములో పైభాండముయొక్క ముఖమును ముఖమునుజేర్చి బాగుగసంధి లేపనము జేయవలయు. యంత్రప్రమాణము గురు ముఖమువలన దెలిసికొనవలయు.

### అధఃపాతనవిధి.

శ్లో॥ త్రిఫలాశిగ్రుశిఖిభిర్లవణాసురిసంయుతైః ।
సప్తపిష్టరసంకృత్వాలేపయేదూర్ధ్వభాండకే ।
ఊర్ధ్వభాండోదరంలిప్త్వాచాధోభాండే జలంక్షిపేత్ ।
సంధిలేపంద్వయోఃకృత్వాతద్యంత్రంభువిపూరయేత్ ।
ఉపరిష్టాత్పుటేదత్రైజలేపతతిపారదః ।
అధఃపాతనమిత్యుక్తం సిద్ధాద్యై రసకర్మణి ॥

తా॥ త్రిఫలములు మునగ చిత్రమూలము వుష్ప ఆవాలు వీనితోడ రసమును జేర్చి రసముగలియువరకు ఖల్వమునమర్దించి డమరుక యంత్రముయొక్క పైపాత్ర లోభాగమున దానినిబూసి క్రిందిపాత్రయందుదకముబోసి ఆ 2 పాత్రలజేర్చి సంధులకు బాగుగచీలమన్ను లేపనముజేసి యెండించి యాపాత్రను భూమిలోపూడ్చి దానిపై పుటంబిడవలయు. ఇటులజేసిన రసము జలమందు క్రిందిపాత్రయందు బడు. దీనిని సిద్ధాదులు రసకర్మయందు అధఃపాతనమని వచించెదరు

### తిర్యక్పాతనము.

శ్లో॥ ఘటేరసంవినిక్షిప్యసజలంఘటమన్యకమ్ ।
తిర్యఙ్ముఖంద్వయోఃకృత్వాతన్ముఖంరోధయేత్సుధీః ।
తత్రాధశ్చుల్ల్యాంసంస్థాప్యయత్నతస్తంతతోభిషక్ ।
రసస్యోజ్వాలయేద్వహ్నింయావత్సర్వోజలంవిశేత్ ।
తిర్యక్పాతనమిత్యుక్తం సిద్ధైశ్చవార్జునాదిభిః ।
మిశ్రితౌనాగవంగౌచరసేవిక్రయహేతుతః ॥
తాభ్యాంన్యాత్కృమిదోషస్తుతన్ముక్తిఃపాతనత్రయాత్ ।
ఏవంసుసంస్కృతస్సూతఃపాతనావిధియత్నతః ।
సర్వదోషవినిర్ముక్తోజాయతేనాత్రసంశయః ॥

తా॥ యంత్రమునకు తగినటులు వొకింత నిడుపుగనుండు కుండలు గ్రహించి అందొకదానిలో పాదరసమును మతియొక దానిలో యుదకమును బోసి అడ్డముగ నునిచి వాటిని జేర్చి సందులకు చీలమన్ను లేపనము జేసి రసము బోసినకుండను పాయి మీదనడ్డముగ యుక్తితో నునిచి పాకము జేసిన రసము నీళ్లలో బ్రవేశించు. దీనినే నాగార్జునుడు మొదలగు సిద్ధులు తిర్యక్పాతనమని వచించెదరు. ఇటులయుక్తిచే 3 మార్లు తిర్యక్పాతనము జేయుటవలన రసమునందలి నాగ వంగ క్రిమిదోషనివర్తించు. ఈతిర్యక్పాతనవిధివలన రసమునందలి సర్వదోషములు నిస్సంశయముగ హరించు.

## బోధనము.

శ్లో॥ ఏవంకదర్థితస్సూతష్షండత్వమధిగచ్ఛతి ।
తన్ముక్త్యేస్యక్రియతేబోధనంకథ్యతేహితత్ ॥

తా॥ పైప్రకారము శోధింపబడిన పాదరసమునందు షండత్వదోషంబుండు. అది నివర్తించుటకై బోధనక్రియను వచించెద

## బోధనము.

శ్లో॥ కదర్థనైర్నైవనపుంసకత్వమేవంభవేత్సూరసస్యపశ్చాత్ ।
వీర్యప్రకర్షాయచభూర్జపత్రేస్వేదోస్యజలేసైంధవచూర్ణగర్భే ॥

తా॥ రసమునకు పైజెప్పంబడిన సంస్కారములన షండత్వదోషముగలుగు. తన్నివారణార్థంబును రససామర్థ్యమును వృద్ధిజెందుటకును రసమును భూర్జ పత్రము వుదకము సైంధవలవణము అనువానితో పాకముజేయవలయు.

## నియమనము.

శ్లో॥ సర్పాక్షీచించికావంధ్యాభృంగాబ్ధకనకాంబుభిః ।
దినంసంస్వేదితస్సూతోనియమార్థిస్సరితాంవ్రజేత్ ॥

తా॥ పాదరసమును సర్పాక్షి చింత గొడ్డుకాకర గుంటగలగర తుంగముస్తెలు వుమ్మెత్త అనువాని రసములతోగాని లేక కషాయములతోగాని 1 దినము వండిన నియమన మనంబడు

## సందీపనము.

శ్లో॥ కాసీసంపంచలవణంతిదూర్ధ్వంనింబుకరసమ్ ।
క్షిప్త్వాక్షిప్త్వాథదాతవ్యంతాద్రక్తైంధవఖేటకమ్ ।

గర్భేకృత్వాథరాగర్భేదత్వాసైంధవసంయుతమ్ ।
ఘూలిమష్టాంగులిందత్వారాజికామరిచానిచ ।
ద్వాక్షుగ్రుబీజమేకత్రటంకణేంసమన్వితమ్ ।
ఆలోడ్యకాంజికేడోలాయంత్రేపాచ్యందినైస్త్రిభిః ।
దీపనంజాయతేసమ్యకస్నాతరాజస్యజారణే ॥

తా॥ అన్నభేది పంచలవణము వీటినిగ్రహించి దానిపైవలుమారు నిమ్మపండ్ల రసముబోసి సైంధవలవణగడ్డను పగలగొట్టి అందు సైంధవలవణముతోడ పాదరసమును జేర్చి దానిపైపూర్వోక్త సైంధవలవణమును నిమ్మపండ్లనంటించి దానిపై 8 అంగుళముల ధూళినంటించి మునగవిత్తులు చేదుమునగవిత్తులు తెలిగారము అనునీమూటినినూరి కుండకులేపనముజేసి అందుకలిబోసి దానిమధ్యమున డోలాయంత్రముతో 3 దినములు వండిన రసము జారణసంస్కారమునందు దీపనమగు.

(రసమున కష్టాదశ సంస్కారములు జెప్పంబడియుండినను " స్వేదోమర్దితమూర్ఛనాస్థితిరతః పాతోపిఖేదాన్వితో । బోధస్సంయమనం ప్రదీపన మతిస్పష్టాష్టధా సంస్కృతిః । అస్యాస్య రసోపయోగికతయాత్వన్యాన విన్యస్యతే । గ్రంథేస్మిన్ ప్రకృతోపయోగ విరహాద్విస్తార భీత్యాథవా ॥ '' అనుగ్రంథాంతర వచనప్రకారము స్వేదన మర్దన మూర్ఛన వుత్థాపన పాతన బోధన సంయమన ప్రదీపనములన 8 సంస్కారములు సర్వోపయోగంబులగుటచే జెప్పంబడియె. తక్కిన 10 సంస్కారములు ఔషధోపయోగంబులు గాకుండుటంజేసియు గ్రంథవిస్తర భీతింజేసియు జెప్పంబడవయ్యె )

## రసశోధన.

శ్లో॥ అథవాహింగులాత్సూతంగ్రాహయేత్తన్నిగద్యతే ।
జంబీరనింబునీరేణమర్దితోహింగులోదినం ।
ఊర్ధ్వపాతనయంత్రేణగ్రాహ్యస్స్యాన్నిర్మలోరసః ।
కంచుకైర్నాగవంగాద్యైర్నిర్ముక్తోరసకర్మణి ।
వినాకర్మాష్టకేనైవసూతోఽయంసర్వకర్మకృత్ ॥

తా॥ రసమునకు పైజెప్పబడిన సంస్కారములు లేకపోయినను యింగిలీకములో తీయబడినరసము శుద్ధముగనుండుగాన దానిని గ్రహించువిధమును వివరించెద. నిమ్మపండ్లరసము వేపపట్టరసము వీటితో 1 దినము యింగిలీకమును మర్ధించి ఊర్ధ్వపాతనమనే యంత్రమునందునిచి వండిన నాగవంగాదులతో గూడియుండు

రసము వాటిచే విడువబడి శుద్ధరసమునిలుచు. ఇట్టిరసము 8 సంస్కారములు లేక పోయినను సమస్త రసకర్మలయందుపయోగించు.

అన్యచ్చ.

శ్లో॥ నింబూరసైర్నింబపత్రరసైర్వాయామమాత్రకం ।
పిష్ట్వాదరదమూర్ధ్వంచపాతయేత్సూతయుక్తవిత్ ।
తతశ్శుద్ధరసంతస్మాన్నీత్వాకార్యేషుయోజయేత్ ॥

తా॥ రసమును వేపపట్టరసములోగాని వేపాకు రసముతోగాని యామమాత్రమునూరి ఊర్ధ్వపాత యంత్రమునందువండిన నదిశుద్ధమగు. దానిని సమస్తరస కర్మలయందుపయోగించవలయు

అన్యచ్చ.

శ్లో॥ కుమారికాచిత్రకరక్తసర్షపైఃకృతైఃకషాయైర్బృహతీవిమిశ్రితైః।
ఫలత్రికేణాపివిమర్దితోరసోదినత్రయంసర్వమలైర్విముచ్యతే॥

తా॥ రసమును కలబంద చిత్రమూలము యెఱ్ఱావాలు ములకవేరు త్రిఫలములు వీటికషాయములో 3 దినములు మర్దించిన సమస్తమలములచే విడువంబడి శుద్ధమగు.

## ఉపరస శోధనములు.

### గంధకశోధన.

శ్లో॥ లోహపాత్రేవినిక్షిప్యఘృతమగ్నౌప్రతాపయేత్ । తప్తేఘృతే తత్సమానంక్షిపేద్గంధకజంరజః। విద్రుతంగంధకంద్రుష్ట్వాతను వస్త్రేవినిక్షిపేత్ ।యథావస్త్రాద్వినిస్సృత్యదుగ్ధమధ్యేఽఖిలం పతేత్ । ఏవంసగంధకశ్శుద్ధస్సర్వకర్మోచితోభవేత్ ॥

తా॥ లోహపాత్రయందు నెయ్యిబోసి కాచి అందు నేతికిసమముగ గంధక చూర్ణమువైచి అది కరుగునటులకాచి సూక్ష్మవస్త్రమునందుపోసి పాలయందుపడు నటుల వడియగట్టిన ఆగంధకము శుద్ధమగు దీనిని సర్వకార్యములయందుపయో గించందగు.

### హింగుళశోధన.

శ్లో॥ మేషీక్షీరేణదరదమమ్లవర్గైశ్చభావితం ।
సప్తవారాన్ప్రయత్నేనశుద్ధిమాయాతినిశ్చితం ॥

తా॥ ఇంగిలీకమును మేకపాలతో 7 మార్లును నిమ్మపండ్లు మొదలగు పుల్లని ద్రవ్యములతో 7 మార్లును ఖల్వమునమర్దించి యెండించిన నిశ్చయముగ శుద్ధియగు.

అభ్రిక శోధన.

శ్లో॥ కృష్ణాభ్రికంధమేద్వహ్నౌ తతఃక్షీరే వినిఃక్షిపేత్ ।
భిన్నపత్రంతుతత్కృత్వా తండులీయామ్లయోర్ద్రవైః ।
భావయే దష్టయామంతు దేవంశుద్ధ్యతిచాభ్రికమ్ ॥

తా॥ * కృష్ణాభ్రికమును నిప్పులలో వేసి యది యెఱ్ఱగనగువరకు కాలిచి త్రిఫల నూది పిదప దానిని ఆవుపాలతో వేసి రేకులు రేకులుగ వొలిచి చిర్రికూరరసమును నిమ్మపండ్లరసమును నేకముగ చేసి యందాయభ్రికపు రేకులనుంచి 8 యామంబు లునిచిన అభ్రికము శుద్ధియగు

హరితాళ శోధన.

శ్లో॥ తాళకంకణశఃకృత్వా తిహూర్ణంకాంజికేక్షిపేత్ ।
దోలాయంత్రేణయామైకం తతఃకూష్మాండజైర్ద్రవైః ।
తిలతైలేపచేద్యామంయామంచత్రిఫలాజలైః ।
ఏవంయంత్రేచతుర్యామంపాచ్యంశుద్ధ్యతితాళకం ॥

తా॥ తాళకమును రేకులుగవొలిచి చూర్ణముజేసి జమరిబట్టలో మూటగట్టి డోలాయంత్రమున కాంజికముచే 1 యామంబును బూడిదెగుమ్మడు రసముచే 1 యామంబును నువ్వులనూనెచే 1 యామంబును త్రిఫలకషాయముచే 1 యామంబును వండినసది శుద్ధియగు.

మణిశిలల శోధన.

శ్లో॥ అజాసూత్రేఅహంయామంత్రైర్దోలాయంత్రేమనశ్శిలాం।
భావయేత్సప్తధాపిత్తైరజాయాశ్శుద్ధిమృచ్ఛతి ॥

తా॥ మణిశిలను డోలాయంత్రమునసునిచి మేకపంచితముచే 3 దినంబులువండి పిదప నామణిశిలను మేకపిత్తముతో 7 మార్లు భావనజేసిన నది శుద్ధియగు.

---

* శుద్ధిజేసిన కృష్ణాభ్రికమును గ్రహించి దానికి 4 వ భాగము వడ్లుకలిపి కంబళిలో మూటగట్టి యామూటను తొట్టియందునిచి చేతితో జక్కగ బిసికిన నందలి అభ్రికము వెలుపలకువెడలు. ఇటులవెడలిన పిదప ఆతొట్టియందలి అభ్రికపునీళ్లను 1 పాత్రలోబోసి యొక యామంబునునిచి పైతేట నీటినివంచి అడుగుననుండెడి అభ్రికమును జేకొని యెండించిన నది ధాన్యాభ్రికమనంబడు

### అన్యచ్చ.

శ్లో॥ అగస్తిపత్రతోయేనభావితంసప్తవారకం ।
శృంగబేరరసై ర్వాపివిశుధ్యతిమనశ్శిలా ॥

తా॥ అగసియాకు రసముతోగాని అల్లపురసముతోగాని 7 మార్లు భావన జేసిన మనశిల శుద్ధమగు.

### ఖర్పర శోధన.

శ్లో॥ నరమూత్రేచగోమూత్రేసప్తాహంరసకంపచేత్ ।
దోలాయంత్రేణశుద్ధస్స్యాత్తతఃకార్యేషుయోజయేత్ ॥

తా॥ ఖర్పరను (కల్కఫరి) దోలాయంత్రంబున నునిచి యందు నరమూత్రము వోసి 7 దినంబులును ఆవుపంచితము వోసి 7 దినంబులును వండిన నది శుద్ధియగు. ఇట్లుల శుద్ధిజేసినతర్వాత దీనినౌషధములయందు జేర్చుకొనందగు.

### కంకుష్ఠాది శోధనం.

శ్లో॥ కంకుష్ఠంగైరికంశంఖఃకాసీసంటంకణంతథా ।
నీలాంజనంశుక్తిభేదాఃక్షుల్లకాస్సవరాటకాః ।
జంబీరవారిణాస్విన్నాఃక్షాలితాఃకోష్ణవారిణా ।
శుద్ధిమాయాంత్యమీయోజ్యాభిషగ్భిర్యోగసిద్ధయే ॥

తా॥ ముదారశింగు గైరికము శంఖము కాసీసము వెలిగారము నీలాంజనము ముత్యముచిప్ప మొదలగునవి చిన్నగవ్వలు వీటిని నిమ్మరసముయొక్క ఆవిరిలోనునిచి పిదప వుష్ణోదకముతో కడిగిన నవి శుద్ధియగు. గానవీటిని వైద్యక్రియలయందును యోగించందగు.

### సర్వోపరస శోధనం.

శ్లో॥ త్రిక్షారేలవణేదేయమమ్లవర్గేత్రిధాపచేత్ ।
తదావోపరసాశ్శుద్ధాజాయంతేదోషవర్జితాః ॥

తా॥ త్రిక్షారములు లవణము అమ్లవర్గము వీటితో కూడ 3 మార్లువండిన వుప రసములు నిర్దోషములై శుద్ధమగు.

### రత్న శోధనం.

### వజ్రశోధన.

శ్లో॥ కులిత్థోద్రవక్వాథేదోలాయంత్రేవిపాచయేత్ ।
వ్యాఘ్రీకందగతంవజ్రంత్రిదినంశుద్ధిమృచ్ఛతి ॥

తా॥ వాకుడుగడ్డసునారి యందు వజ్రమునునిచి జమరిగొట్టిలో మూటగట్టి డోలాయంత్రమున నునిచి అందు వులవకట్టుబోసి 3 దినంబులను ఆరికధాన్య కషాయముబోసి 3 దినంబులును వండిన వజ్రము శుద్ధియగు

సర్వరత్నశోధన.

శ్లో॥ స్వేదయేద్దోలికాయంత్రేజయంత్యాస్వరసేనచ।
మణిముక్తాప్రవాళానాంయామైకంశోధనంభవేత్ ॥

తా॥ సూర్యకాంతము మొదలగు సమస్తమణులు ముత్తియము పగడము వీటిని డోలాయంత్రముననునిచి తక్కిలిరసముచే 1 యామమువండిన నవి శుద్ధియగు.

విషశోధన.

శ్లో॥ కృత్వాచణకసంఖ్యానంగోమూత్రైర్భావయేత్త్ర్యహం।
సమటంకణంపిష్టంమృతమిత్యుచ్యతేవిషం ॥

తా॥ విషమును వెలిగారముతోనూరి సెనగగింజంత మాత్రలంచేసి గోమూత్రముచే డోలాయంత్రమునందు 3 దినములువండిన విషముశుద్ధియగు.

ఉపవిష శోధన.

శ్లో॥ పంచగవ్యేషుశుద్ధానిదేయాన్యుపవిషాణిచ ॥

తా॥ ఉపవిషములను పంచగవ్యములలో భావనజేసిన శుద్ధియగు.

నేపాళ శోధన.

శ్లో॥ నిస్త్వచంచైవనేపాళంకుమారీరసజేనచ।
గుడోదకేనగోక్షీరైర్గోఘృతేనపృథక్పృథక్ ।
పాచితంశుద్ధిమాప్నోతినైద్యశాస్త్రవినిశ్చితం॥

తా॥ నేపాళముల పైపొట్టునొలిచి యందలి యగరులందీసి కలబందరసము పానకము ఆవుపాలు ఆవునెయ్యి అనువానితో ప్రత్యేక ప్రత్యేకముగ నుడికించిన నేపాళము శుద్ధియగు.

గద్య॥ ఇతి శ్రీమదాంధ్రభాషానువాద భూషితే,అనుపానరత్నాకరే
ధాతూపధాతు రసోపరసోపరత్న విషోపవిషాణాం శోధన
వివేకకథనన్నామ చతుర్థ స్తరంగః.

---

శ్రీ రస్తు.

# అనుపానరత్నాకరము.

## ఆంధ్ర తాత్పర్యము.

### పంచమస్తరంగము.

#### స్వర్ణమారణము.

శ్లో॥ స్వర్ణస్యద్విగుణంసూతమమ్లేనసహమర్దయేత్ ।
తద్గోలకంసమంగంధంనిదధ్యాదధరోత్తరం ॥
గోలకంచతతోరుధ్వాశ్చరావేణ్యసంపుటే ।
త్రింశద్వనోపలైర్దద్యాత్పుటాన్యేవంచతుర్దశ ॥
నిరుత్థంజాయతేభస్మగంధోదేయఃపునఃపునః ॥

తా॥ శుద్ధిజేసినబంగారును సన్నముగచూర్ణముగావించి దానికి రెండింతలు శుద్ధిజేసిన పాదరసమునుగలిపి నిమ్మపండ్లరసముచే మర్దించి వుంటజేసి యెండనెండించి దానికిసమముగ శుద్ధిజేసిన గంధకచూర్ణమును 1 మూకుడులో సగముబోసి దానిపై ఆబంగారు వుంటనువుంచి దానిపై మరల గంధకపుపొడిబోసి మఱియొక మూకుడు మూసి చీలమన్ను లేపముజేసి పిదప 1 పల్లముత్రవ్వి అందు 15 అడివియేరు పిడకలను పేల్చి పుటంబిడి స్వాంగ శీతలమున గ్రహింపవలయు. ఇటుల గంధకయుక్తముగ 14 పుటములువేసిన బంగారు నిర్జీవితముగ భస్మమగు.

#### రౌప్యమారణము.

శ్లో॥ భాగైకంతాలకంమర్ద్యంయామమమ్లేనకేనచిత్ ।
తేనభాగత్రయంతారపత్రాణిపరిలేపయేత్ ॥
ధృత్వామూషాపుటేరుద్ధ్వాపుటేత్త్రింశద్వనోపలైః ।
సముద్ధృత్యపునస్తాలందత్వారుధ్వాపుటేపచేత్ ।
ఏవంచతుర్దశపుటైస్తారంభస్మప్రజాయతే ॥

తా॥ శుద్ధిజేసినతాళకమును 1 భాగముగ్రహించి నిమ్మపండ్లరసముచే యొక యామము మర్దించి తాళకమునకు 3 భాగము లధికముగ శుద్ధిజేసిన వెండిరేకులను గ్రహించి దానికి పైని మర్దించియునిచిన తాళకమును లేపముజేసి మూకుడులో యందునిచి యెండనెండించి శీలమన్ను లేపముజేసి పల్లముత్రవ్వి యందు 15 అడవి యేరుపిడకలు పేర్చి దానిపై శీలయిచ్చియుంచిన సంపుటమును నునిచి దానిపైని మరల 15 అడవి యేరుపిడకలు పేర్చి పుటంబెట్టవలయును ఇటుల 14 పుటంబులిడినరజతము నిర్జితముగ భస్మంబగు

## తామ్రమారణము.

శ్లో॥ సూక్ష్మాణి తామ్రపత్రాణి కృత్వా సంస్వేదయేద్బుధః । వాసర
త్రయమమ్లేన తతః ఖల్వే వినిక్షిపేత్ ॥ పాదాంశం సూతకం దత్వా
యామమమ్లేన మర్దయేత్ । తత ఉద్ధృత్య పత్రాణి లేపయేద్ద్విగుణే
న చ ॥ గంధకేనామ్లఘృష్టేన తస్య కుర్యాచ్చ గోలకం । తతః
పశ్చాచ్చ మీనాక్షీం చాంగేరీం వా పునర్నవాం ॥ తత్కల్కేన బ
హిర్గోళం లేపయేదంగుళోన్మితం । ధృత్వా తద్గోళకం భాండే
శరావేణ చ రోధయేత్ ॥ వాలుకాభిః ప్రపూర్యాథ విభూతిలవ
ణాంబుభిః । దత్వా భాండముఖే ముద్రాం తతశ్చుల్ల్యాం విపాచ
యేత్ ॥ క్రమవృద్ధాగ్నినా సమ్యగ్యావద్యామచతుష్టయం ॥
స్వాంగశీతం సముద్ధృత్య మర్దయేచ్ఛూరణద్రవైః॥ దినైకం గోల
కం కుర్యాచ్ఛుద్ధగంధేన లేపయేత్ । సంపుటే న తతో మూషాయాం
గజపుటే పచేత్ । స్వాంగశీతం సముద్ధృత్య మృతం తామ్రం శుభం
భవేత్ । వాంతిభ్రాంతిక్లమం మూర్ఛాం న కరోతి కదాచన॥

తా॥ శుద్ధిజేసిన తామ్రమును పలచనగ రేకులుజేసి సన్నగకత్తిరించి నిమ్మపండ్ల రసంబునవైచి మందాగ్నిచే 3 దినములు యుడికించి యందుండి యారేకులను వెలికిదీసి వానికి 4 వ భాగము పాదరసమువైచి ఖల్వమున నిమ్మపండ్లరసముచే 1 యామము రాగిరేకులను మర్దించి పిదప నారేకులను వెలికిదీసి దీనికిరెండింతల గంధకమును నిమ్మపండ్లరసముచేనూరి యీ రాగిరేకులను లేపముజేసి యుంటగ జేయవలయును. పిదప పొన్నగంటియాకు పులిచింతాకు తెల్లగలిజేరు వీటిలో దేనినైనను నూరి నాయుంటకుపైన 1 యంగుళప్రమాణముపూసి యెండనెండించి కుండలోనునిచి

పుటకుపైన మూకుడును బోర్లించి దానిపై కుండమూతివరకు నిసుక పోసి దానిపై మూకుడును బోర్లించి బూడిద పుష్ప వీటిని సుదకముతో నార జక్కగ చీలయిచ్చి క్రమముగ లఘుమధ్య గాఢాగ్నులచే 4 యామములువండి స్వాంగశీతలమున నా పుటను గ్రహించి అపెకంప రసముతోడను దుంపరసముతోడను 1 దినము మర్దించి ముద్దజేసి దీనికిసమముగ గంధకమును గ్రహించి దానిని నేతితో మర్దించి నాయుంటకు పైన లేపముజేసి మంటిమూకుల లోనునిచి శక్కగా చీలమన్నుజేసి అడవియేరు పిడకలతో గజపుటంబిడి స్వాంగశీతలమున గ్రహింపవలయు. ఇటులు జేయబడిన తామ్రభస్మము వాంతులు భేదులు ఆయాసము మూర్ఛ వీటిరహితంబు చాలాగుణమును గలుగంజేయు.

## వంగ మారణము.

శ్లో॥ మృత్పాత్రే గాలితేవంగే చించాశ్వత్థత్వచో రజః ।
క్షిప్త్వా వంగం చతుర్థాంశమయ్యా దర్వ్యా ప్రచాలయేత్ ॥
తతో ద్వియామమాత్రేణ వంగభస్మ ప్రజాయతే ।
అథ భస్మసమం తాలం క్షిప్త్వా నిమ్బురసైర్మర్దయేత్ ॥
తతో గజపుటే పక్త్వా పునర్నిమ్బురసైః మర్దయేత్ ।
తాలేనదశమాంశేన యామమేకంతతః పుటేత్ ।
ఏవం దశపుటైః పక్వం వంగం స్యాత్ సర్వకర్మసు ॥

తా॥ శుద్ధిజేసిన తెల్లసీసముపు మృత్పాత్రంబుననుంచి కరిగించి దానికిచతుర్థాంశముగ చింతబెట్టచూర్ణము రావిపట్టచూర్ణము వీటినిగ్రహించి యందుకొంచము కొంచముగచల్లుచు యినప గరిటెచే 2 యామములు మర్దింపుచుండిన తెల్లసీసము భస్మంబగు ఈ భస్మమునకు సమముగ శుద్ధిజేసిన తాళకమును ఆతగరభస్మమును జేర్చి నిమ్మపండ్లరసముతో మర్దించి ప్రమిదెలయందునిచి యెండనెండించి చీలయిచ్చి అడవియేరు పిడకలతో గజపుటంబిడి స్వాంగశీతలమున గ్రహించి యాభస్మమునకు 10 వ భాగము శుద్ధిజేసిన తాళకమునజేర్చి మరల నిమ్మపండ్లరసముతో 1 యామము ఖల్వమున మర్దించి ప్రమిదెలయందునిచి యెండనెండించి చీలయిచ్చి గజపుటంబిడవలయు. ఇటుల 10 గజపుటంబొసడిన తెల్లసీసము భస్మంబగు. (వంగమనగా తెల్లసీసము)

## జసద మారణము.

శ్లో॥ జసదస్యచతుర్థాంశంపారదంగంధకంప్రియే ।
మర్దయేత్ ఖల్వకేనమ్యక్కన్యానిమ్బురసైఃపృథక్ ॥
లేపయేత్తేనపత్రాణిగజాహ్వాపాచయేత్పుటే ।
ఏవమేకపుటేనైవభస్మసాజ్జసదంభవేత్ ॥

తా॥ ఓ ప్రియురాలా! శుద్ధిజేసిన సత్తును సన్నని రేకులుగావించి 4 వ భాగము శుద్ధపారదము శుద్ధగంధకము వీటిని ఖల్వమునందునిచి కలబందరసముగ మర్దనజేసి దానిని మరల నిమ్మపండ్లరసముచే మర్దించి పైరేకులకు లేపనము రెండవనెండించి శరావసంపుటము నందునిచి చీలయిచ్చి వొక్కగజపుట సత్తుభస్మంబగు

## నాగ మారణము.

శ్లో॥ తాంబూలరససంపిష్టశిలాలేపాత్పునఃపునః ।
ద్వాత్రింశద్భిఃపుటైర్నాగోనిరుద్ధంభస్మజాయతే ॥

తా॥ మణిశిలను తమలపాకు రసముతోనూరి దానిని నాగమునకు లేపనము మూకిటియందునిచి చీలయిచ్చి 32 పుటములువేసిన నాగము శుద్ధభస్మమగు

## లోహమారణము.

శ్లో॥ షట్ వేద్యాదశం శేసదరదంతీక్ష్ణచూర్ణతః ।
మర్దయేత్కన్యకాద్రావైర్యామయుగ్మంతతఃపుటేత్ ।
ఏవంసప్తపుటైర్మృత్యుంలోహచూర్ణమవాప్నుయాత్ ॥
రసైఃకరారభిన్నాయాఃపాతాళగరుడీరసైః ।
స్తన్యేనచార్కదుగ్ధేనతీక్ష్ణస్యైవమృతిర్భవేత్ ॥

తా॥ శుద్ధిజేసిన లోహచూర్ణమునకు పన్నెండవభాగము శుద్ధిజేసిన ఇంగిలీకమునుజేర్చి కలబందరసముతో 2 యామములుమర్దించి ప్రమిదెలయందునిచి యెండించి చీలయిచ్చి ఆరువిడేరుపిడకలతో గజపుటంబిడవలయు. ఇటుల పుటంలిడిన లోహము నిర్జీవితముగ భస్మంబగు లేక లోహచూర్ణమును ఆదవగసముచే 7 గజపుటంబులును దూసరితీగరసముచే 7 గజపుటంబులును చను 7 గజపుటంబులును జిల్లేడుపాలచే 7 గజపుటంబులును వేసిన నిర్జీవితముగ భస్మ

## స్వర్ణమాక్షిక మారణము.

శ్లో॥ కులిత్థస్యకషాయేణఘృష్ట్వాతైలేనవాపుటేత్ ।
తక్రేణవాఽథగోమూత్రై ర్మ్రియతేస్వర్ణమాక్షికం ॥

తా॥ స్వర్ణమాక్షికమును వులవకషాయముతోనైనను లేక నువ్వుల నూనెతోనైనను లేక మజ్జిగతోనైనను లేక గోమూత్రముతోనైనను నూరి యెండనెండించి మూకుళ్లయందునిచి చీలయిచ్చి యేరుపిడకలతో గజపుటంబిడిన స్వర్ణమాక్షికము బాగుగ భస్మంబగు.

## రౌప్యమాక్షిక మారణము.

వాక్యం॥ స్వర్ణమాక్షికమారణప్రకారేణరౌప్యమాక్షికస్యాపిమారణం॥

తా॥ స్వర్ణమాక్షిక మారణప్రకారముగానే రౌప్యమాక్షికమునకును గూడ మారణమును జేయందగు

## తుత్థమారణము.

శ్లో॥ లకుచద్రావగంధాశ్మటంకణేనసమన్వితం ।
వజ్రమూషాగతంద్విత్రీకుక్కుటైర్మృతిమాప్నుయాత్ ॥

తా॥ తుత్థమును గంధకము మణిశిల వెలిగారము వీటితోచేర్చి నిమ్మపండ్లరసముతో నూరి వజ్రమూసయందునిచి 2 లేక 3 కుక్కుట పుటములిడిన తుత్థము భస్మంబగు.

## కాంస్యము - ఇత్తడి - వీటిమారణము.

వాక్యం॥ కాంస్యరీత్యోర్మారణమనుపానంచాపితామ్రవద్జ్ఞేయం ॥

తా॥ కంచు యిత్తడి వీటికి తామ్రమువలెనే మారణము అనుపానము వీటిని కల్పించవలయు.

## సిందూరమారణ నిషేధము.

శ్లో॥ సిందూరస్యప్రయోగోహినదృష్టఃకుత్రచిత్పృథక్ ।
తస్మాద్యుక్త్యాసలేయోజ్యముపదేశోగురోరితి ॥

తా॥ సిందూరమారణవిధి వైద్యశాస్త్రమునందెక్కడయును తేటుగ చెప్పంబడలేదు గాన గురూపదేశముచేతనే దానిని జేసికొనందగు.

## శిలాజతు మారణవిధి.

శ్లో॥ శిలాయాంగంధతాలాభ్యాంమాతులుంగరసేనచ ।
పుటితంహిశిలాధాతుర్మ్రియతేష్టోపలేనచ॥

తా॥ గంధకము తాళకము వీటిని మాదీఫలరసముతో నూరి శిలాజతుకు కవచమిచ్చి గీలజేసి 8 పిడకలతో పుటమిడిన శిలాజతు భస్మమగు.

## మండూరవిధి.

శ్లో॥ అక్షాంగారైర్ధమేత్కిట్టంగోమూత్రేతద్గవాంపలైః ।
సేచయేత్తప్తతప్తంతత్సప్తవారంపునఃపునః ॥
చూర్ణయిత్వాతతఃక్వాథైర్ద్విగుణైస్త్రిఫలాభవైః ।
ఆలోడ్యభర్జయేద్వహ్నౌమండూరంజాయతేవరం ॥

తా॥ తాండ్రబొగ్గులలో యినపచిట్టెమునునిచి నెఱ్ఱగనగువరకు తిత్తితోనూది గోమూత్రముతో చల్లార్చవలయు. ఇటుల యినపచిట్టెమును 7 మార్లుకాచి చల్లార్చి చూర్ణముచేసి దానికి రెండింతల త్రిఫలములనువైచి కషాయముకాచి యందాచిట్టె చూర్ణమునువైచి గట్టియగునటుల మగలకాచి పిదప నాకుండకు చీలజేసి అడవిపిడకలతో గజపుటంబిడి స్వాంగశీతలమున నందలి మండూరమును గ్రహింపవలయు. ఇటుల జేయబడిన మండూరము శుద్ధమండూరమగుటచే దానిని రోగములయందుపయోగింపందగు

## రసమారణము.

శ్లో॥ కాకోదుంబరికాదుగ్ధైరసంకించిద్విమర్దయేత్ ।
తద్దుగ్ధఘృష్టహింగోశ్చమూషాయుగ్మంప్రకల్పయేత్ ॥
క్షిప్త్వాతత్సంపుటేతూనంతత్రముద్రాంప్రదాపయేత్ ।
ధృత్వాతంగోలకంప్రాజ్ఞోమృన్మూషాసంపుటేధికే ॥
పచేల్లఘుపుటేనైవసూతకోయాతిభస్మతాం ॥

తా॥ బ్రహ్మమేడిపాలతో పాదరసమును ఖల్వమున జక్కగమర్దించి పిదప యింగువను బ్రహ్మమేడిపాలతోనూరి దానిచే 2 మూసలుజేసి యందొకమూసలో బ్రహ్మమేడిపాలతో మర్దించిన రసమునునిచి దానిపై మఱియొకమూసమూసి సందు

లేకుండునటుల జక్కీగచేర్చి బంధించి దీనిని తగుమైన మంటిమూసలోనునిచి దానిపై మటియొక మూసమూసి జక్కీగ చీలయిచ్చి యేరుపిడికలతో లఘుపుటంబిడిన పాదరసము బాగుగభస్మంబగు.

అన్యచ్చ.

శ్లో॥ నాగవల్లీరసైర్ఘృష్టః కర్కోటీకందగర్భితః ।
మృన్మూషాసంపుటేపక్త్వాసూతోయాత్యేవభస్మతాం ॥

తా॥ పాదరసమును తమలపాకు రసముతోనూరి కర్కోటి (అనగా యేరావడ) వేళ్లనునూరి ముంటజేసి దానిమధ్యనునిచి ఆముంటను మట్టిమూసలో పెట్టి చీలయిచ్చి గజపుటంబిడిన రసము భస్మంబగు

రస సిందూరవిధి.

శ్లో॥ సూతంపంచపలంస్వదోషరహితంతత్తుల్యభాగోబలి ।
ద్వ్యావటంకౌనవసాగరస్యతువరీకర్షశ్చసంమర్దితః ।
కుప్యాంకాచభువిస్థితశ్చసికతాయంత్రేత్రిభిర్వాసరైః ।
పక్త్వావహ్నిభిరుద్భవత్యరుణభఃసిందూరనామారసః ॥

తా॥ శుద్ధిజేసినరసము 5 పలములు గంధకము 5 పలములు వెలిగారము పటికారము యివి ప్రత్యేకముగ 2 పలములు నవాసాగరము 2 పలములు కందులు కర్షప్రమాణము వీటిని ఖల్వమునందు మర్దించి కాచకుప్పియందునిచి దానిని వాలుకాయంత్రమునందు 3 దినములువండిన రసము సిందూరమగు

రస కర్పూరవిధి.

శ్లో॥ సంశ్లేషాద్ధిరసంపూర్వంశోధయేచ్ఛుద్ధమానసేః పశ్చాచ్ఛుద్ధేన
ప్రత్యేకంతుల్యంకృత్వారసేనహి ॥ గైరికం ఖటికామిష్టిం సౌ
రాష్ట్రింసైంధవంతథా। టంకణాంక్షారలవణంమృత్వాన్నచూ
ర్ణంసుసూక్ష్మకం ॥ ఏతచ్చూర్ణాన్వితంసూతంయామైకంమర్ద
యేత్తతః। ఊర్ధ్వపాతనకేయంత్రేవహ్నిందద్యాచ్ఛనైశ్శనైః ॥
అహోరాత్రైశ్చతుర్భిశ్చతతోస్వాంగశీతలం। ఉద్ఘాటోర్ధ్వ
విలగ్నంవైరసంకర్పూరసంజ్ఞకం ॥ గృహీత్వాసర్వరోగఘ్నం
బలబుద్ధివివర్ధనం। వృంతాకశతశ్శుద్ధంభక్షితంగుణవత్తరం॥

తా॥ నిర్మలమగు మనస్సుగల ఓ ప్రియురాలా! శుద్ధిజేసిన పాదరసము యిందుకు సమము బేగురాయి ఘటికా యిటికెరాయి సౌరాష్ట్రి సైంధవలవణము వెలిగారము క్షారలవణము శ్రేష్ఠమగు మట్టి వీటిచూర్ణములను పైరసముతో కలిపి వొక ఝాము మర్దించి ఊర్ధ్వపాతిన యంత్రమునందునిచి 4 అహోరాత్రములు మందాగ్నిచే పక్వముజేసి స్వాంగశీతలముగ దించి పైభాగమునందంటియుండు రసమును యెత్తుకొనిన నది రసకర్పూరమనంబడు. ఇది సమస్తరోగముల నశింపంజేసి బలము బుద్ధి వీటివృద్ధిని గలుగంజేయు. మఱియు నీరసకర్పూరమును 100 వంకాయలలో శుద్ధిచేసి భక్షించిన అనేకగుణములను గలుగంజేయు. రసకర్పూరమును వంకాయతో శుద్ధి జేయుటెట్లనిన —వంకాయమధ్యలో రసకర్పూరమును వునిచి దానిని నిప్పుమీదబెట్టి ఆవంకాయ పాకమైనతోడనే యెత్తి అందులోనుండు రసకర్పూరమును యెత్తుకొని మఱియొక వంకాయలోపలనునిచి పాకముజేయవలయు. ఇటుల 100 వంకాయలతో పక్వముజేసిన ఆరసకర్పూరము మిగుల శ్రేష్ఠమైనదిగనుండు.

## హింగుళ మారణము.

శ్లో॥ వల్లమాత్రంతాలపిష్టంశరావేస్థాపయేత్తతః । తస్మిన్కర్షస
మందేయంసకలందరదస్యచ ॥ పూరయేదార్ద్రకిరసైద్విగుణం
తత్రబుద్ధిమాన్ ।పుష్పాణిశాణమాత్రాణిపరితఃస్థాపయేత్తతః ।
శరావసంపుటేదత్వాచుల్యాంమధ్యాగ్నినాపచేత్ । ఘటికా
త్రయపర్యంతంతతఉత్తార్యపేషయేత్ । తాంబూలేగుంజమా
త్రంతుదేయంపుష్టికరంపరం । పాండౌక్షయేచశూలేచసర్వ
రోగేషుయోజయేత్ ॥

తా॥ వల్లప్రమాణము శుద్ధిజేసిన హరితాళచూర్ణమును మూకిటియందునిచి దానిలో కర్షప్రమాణము యింగిలీకమునునిచి యింగిలీకము మునుగునటుల అల్లపురసముచే పూరించి శాణప్రమాణము జిల్లేడుపూలను దానిపైపరచి మరియొక మూకిటిచే మూతబెట్టి చీలయిచ్చి పొయిమీదపెట్టి 3 ఘడియలు మధ్యాగ్నిచే పాకముము జేసిన హింగుళము భస్మంబగు. పిదప దించి స్వాంగశీతలమువదీసి నూరి దానిని తమలపాకులో గురిగింజప్రమాణము సేవించిన పాండువు క్షయ శూల సమస్తరోగములు యివి నివర్తించుటయేగాక శరీరపుష్టిసగాగలుగు.

## అభ్రక మారణము.

శ్లో॥ కృత్వాధాన్యాభ్రకంతత్తుశోషయిత్వాథమర్దయేత్ । అర్క క్షీరై ర్దినంఖల్వేచక్రాకారంచకారయేత్ ॥ వేష్టయేదర్కపత్రైశ్చసమ్యగ్గజపుటేపచేత్ । పునర్మర్ద్యంపునఃపాచ్యంసప్తవారంప్రయత్నతః । తతోవటజటాక్వాథై స్తద్వద్దేయంపుటత్రయం । మ్రియతేనాత్రసందేహస్సర్వరోగేషుయోజయేత్ । మృతంత్వభ్రం హరేన్మృత్యుం జరాపలితనాశనం ॥ అను పానైశ్చసంయుక్తంతత్తద్రోగహారంపరం॥

తా॥ శుద్ధిజేసిన అభ్రకమును యెండనెండించి జిల్లేడుపాలతో 1 దినము మర్దించి బిళ్లచేసి యెండించి దానిపై జిల్లేడాకులుచుట్టి ప్రమిదెలయందునిచి చీల యిచ్చి అడవియేరుపిడకలతో గజపుటంబిడవలయు. ఇటుల జిల్లేడుపాలతో 7 గజ పుటంబు లిడవలయు. పిదప దీనిని మట్టియూడల కషాయముతో 1 దినము మర్దించి మూడు గజపుటంబు లిడవలయు. ఇటుల (10 గజపుటంబులిడిన నిస్సంశయముగ అభ్రకము నిర్జీవితముగ భస్మంబగు.) ఈ భస్మమును యుక్తానుపానములచే సేవించిన నది సర్వరోగములను నశింపజేసి మృత్యువు ముదిమి వీటినితొలగించి తెల్లవెండ్రు కలను నల్లనగు నటులంజేయు.

## గ్రంథాంతరే.

శ్లో॥ వజ్రీక్షీరై రర్కదుగ్ధై ర్ధేనుమూత్రై స్త్రిఫలాజలైః । బ్రాహ్మీ రుదంతీస్వరసై ర్వాసాగ్నిశాల్మలీద్రవైః ॥ కూశ్మాండస్వరసై రేవందాడిమీసలిలై స్తథా । వరాక్వాథేనగోజిహ్వాసలిలై ర మృతాద్రవైః॥జాతీగోక్షురమేఘనాంకషాయైర్బర్బరీద్రవైః। శంఖపుష్పీరసై ర్ద్రాక్షారసై ర్మూలకజై రసైః ॥ రాక్షసీతులసీ ముండీవిశాలాసలిలై రపి । విదారీలతికాభృంగీమదాక్వాథైః పృథక్పృథక్ ॥సేతికాతపనక్వాథై రుగ్రగంధాశృతై రపి । సప్త కృత్వోవిశాలాక్షిపాచయేంభ్రకంతతః ॥ వటారోహకషా యేణకుసుమస్వరసై స్తథా। కపిత్థస్యామ్లికాయాశ్చఫలోద్భ వరసేనచ ॥ పృథగ్వింశపుటై రేవంపాచయేద్గగనంతతః ।

నింబూకస్వరసైః పంచ దశకృత్వోవిపాచయేత్ ॥ తత్సం ఖ్యాకైః పుటైరేవం గుడదుగ్ధవిమిశ్రితమ్ । గవాం దధియుతం తద్వద్ఘృతఖండవిమిశ్రితమ్ ॥ పాచయేదభ్రకం శుద్ధం రమ్యం రక్తతరం భవేత్ । చంద్రికారహితం శుద్ధమశుద్ధం స్యాత్తదన్వితమ్ ॥ పుటాన్యేవం సహస్రాణి భిషగ్బుధ్యా ప్రదాపయేత్ । అథవా కస్య కాద్రాసైః పుటేద్వారసహస్రకమ్॥

తా॥ జెముడుపాలు జిల్లేడుపాలు గోమూత్రము ముత్తవపులగపు కషాయము మండూకబ్రహ్మిరసము దంతీరసము అడ్డసరరసము చిత్రమూలరసము బూరుగరసము గుమ్మడురసము దానిమ్మరసము త్రిఫలాకషాయము బరివెంకరసము తిప్పతీగెరసము జాజికషాయము పల్లేరుకషాయము తుంగముస్తలకషాయము భార్గిరసము పద్మపుతీగెరసము ద్రాక్షరసము మల్లంగిరసము బలురక్కసిరసము తులసిరసము బోడతరరసము పాపరరసము నేలగుమ్మడుగడ్డ కషాయము గుంటగలగరరసము మదాకషాయము జీడిగింజలకషాయము వెల్లకషాయము వీటిలో వొక్కొకమూలికా రసమునందు ప్రత్యేకము యేడేసిమార్లునూరి యేడేసిమార్లు పుటము వేయవలయును. పిదప మట్టియాకులకషాయములోనూరి 20 పర్యాయములు పుటము వేయవలయు. ఈ ప్రకారము తెల్లబొడ్డుగురసము వెలగపండురసము చింతపండురసము వీనిలో ప్రత్యేకప్రత్యేకముగ 20 మార్లు పుటంబులిడవలయును. పిదప నిమ్మపండ్లరసములోనూరి 15 పుటములు వేయవలయు. ఈ ప్రకారముగానే బెల్లము పాలు వీనిలోను ఆవుపెరుగులోను నెయ్యి ఖండశర్కరవీనిలోను 15 పుటంబులిడవలయును; యిటుల 1000 పుటములు వేసిన అభ్రకము చంద్రిక లేనిదిగ శుద్ధముగ మిగులరక్తవర్ణముతో గూడినదిగనుండు భస్మంబగును చంద్రికతో (అనగా తళుకులతో) గూడియుండిన నది శుద్ధముకాదు. నీయభ్రకమును కలుబందరసములోనూరి 1000 పుటంబులిడిన శుద్ధభస్మంబగును.

అన్యచ్చ.

శ్లో॥ పీతామలకసౌభాగ్యపిష్టంచక్రీకృతాభ్రకం ।
పుటితం షష్టివారాణి సిందూరాభం ప్రజాయతే ।
క్షయాద్యఖిలరోగఘ్నం భవేద్రోగాపనుత్తయే ॥

తా॥ పచ్చయిరుగుడురసము పునిరికరసము వెలిగారము వీటితో అభ్రికమును నూరి గుండ్రముగ బిళ్లజేసి 60 పుటములువేసిన అభ్రికము సిందూరమగు దీనిని సేవించిన క్షయ మొదలగు సమస్తరోగములు నివర్తించు.

## హరితాళ మారణము.

శ్లో॥ పలమేకంశుద్ధతాళంకౌమారీరసమర్దితం ।
శరావసంపుటంకృత్వాయామాన్ద్వాదశకంపచేత్ ।
స్వాంగశీతంసమాదాయతాలకంచమృతంభవేత్ ।
గలత్కుష్ఠంహరేత్సద్యస్తాలకంచనసంశయః ॥

తా॥ 1 పలము శుద్ధిజేసిన హరితాళమును కలబందరసముతో నూరి దానిని శరావమునందునిచి 12 యామములువండిన హరితాళము భస్మమగు. పిదపదానిని స్వాంగశీతలముగదించి సేవించిన గళత్కుష్ఠరోగము నివర్తించు. (గళత్కుష్ఠరోగమనగా -వసికట్రషించు కుష్ఠరోగము )

## వజ్ర మారణము.

శ్లో॥ తప్తంతప్తంతుతద్వజ్రంఖరమూత్రేనిషేచయేత్ ।
పునస్తాప్యంపునస్సేచ్యమేవంకుర్యాత్త్రిసప్తధా ।
మత్కుణైస్తాలకంపిష్ట్వాయావద్భవతిగోలకం ।
తద్గోలేనిహితంవజ్రంతద్గోళంవహ్నినాధమేత్ ।
సేచయేదశ్వమూత్రేణతద్గోళేచక్షిపేత్పునః ।
రుద్ధ్వాధ్మాతంపునస్సేచ్యమేవంకుర్యాచ్చసప్తధా ।
ఏవంచమ్రియతేవజ్రంచూర్ణంసర్వత్రయోజయేత్ ॥

తా॥ వజ్రమును అగ్నియందుకాచి గాడిదెమూత్రముతో 21 మార్లు చల్లార్చవలయు. ఇటుల చల్లార్చినపిదప నల్లులు తాళకము వీటిని వుండగనగువరకు మర్దించి దాని మధ్యంబున శుద్ధిజేసిన పైవజ్రమునునిచి మూసలోపెట్టి ఆమూసనుకొలిమియందునిచి యందలి వుంట చక్కగ కాలినపిదప సంగు గుఱ్ఱపుమూత్రమును కొంచముగచల్లి నావజ్రమును వెలికితీసి మరల పైజెప్పినప్రకారమే నల్లులు తాళకము వీటినినూరి యుండజేసి యందు వజ్రమునునిచి పైజెప్పినరీతిగనే కొలిమినినూది కొంచముగ గుఱ్ఱపుమూత్రమునుచల్లి వెలికితీయవలయు. ఇటుల 7 మార్లుజేసిన వజ్రము నిర్జీవమగు పిదప దీనిని ఖల్వమున చూర్ణముజేసి సర్వరోగంబులయందును ప్రయోగించవలయు.

## ప్రవాళ మారణము.

శ్లో॥ శోధయేద్వజ్రవచ్చైవసంమారయేచ్చాపివజ్రవత్ ।
అథవాత్వర్కజేక్షీరేమారయేత్కుక్కుటపుటే॥

తా॥ వజ్రమునకు విధించియుండు శుద్ధిప్రకారము పగడమును శోధనజేసి వజ్రమారణమునకు చెప్పియున్నరీతిగ పగడమును పుటంబిడవలయు. లేక శుద్ధిజేయబడిన పగడమును జిల్లేడుపాలతో కుక్కుటపుటమిడిన నది భస్మంబగు

## సర్వరత్న మారణము.

శ్లో॥ సుమార్యాస్తండులీయేన స్తన్యేనచనిషేచయేత్ । ప్రత్యేకం
సప్తవేళాంచ తప్తతప్తానికృచ్ఛ్రశః । మౌక్తికానిప్రవాళాని
తథారత్నాన్యశేషతః । క్షుణాద్వివిధవర్ణాని మ్రియంతేనాత్ర
సంశయః । ఉక్తమాక్షికవన్ముక్తాప్రవాళానిచమారయేత్ ।
వజ్రవత్సర్వరత్నానిశోధయేన్మారయేత్తథా ॥

తా॥ సూర్యకాంతమణి ముత్తియము పగడము యివి మొదలగు రత్నములను అగ్నియందుకాచి కలబందరసము చిర్రికూరరసము చనుబాలు వీటిలోప్రతి దానిచేతను యేడేసిమార్లు చల్లార్చిన నవి నిస్సందేహముగ భస్మంబగు. లేక స్వర్ణమాక్షికమును భస్మము జేసినటులనే ముత్తియమును పగడమును భస్మముజేయందగు. లేక వజ్రమును శోధన మారణంబులు జేసినటులనే యితర రత్నములను సగా శోధన మారణంబులు జేయవలయు.

గద్య॥ ఇతి శ్రీమదాంధ్రభాషానువాద భూషితే అనుపానరత్నాకరే
ధాతూపధాతురసోప రస గతోన్నపరత్న విషోపవిషాణాం
మారణ వివేకకథనన్నామ పంచమస్తరంగః.



శ్రీరస్తు.

# అనుపానరత్నాకరము.

## ఆంధ్రతాత్పర్యము.

### షష్ఠస్తరంగము.

### పక్వసువర్ణ భస్మగుణము.

శ్లో॥ స్వర్ణం శీతంపవిత్రం క్షయవమికసన శ్వాసమేహాస్ర పిత్త।
క్ష్వేళోన్మాదక్షతాస్రప్రదరగద హరంస్వాదుతిక్తంకషాయం।
వృష్యంమేధాగ్నికాంతిప్రద మధమధురం కార్శ్యహంచత్రి
దోషాన్ । మూర్ఛాపస్మారశూలజ్వర జీవపివపుర్బృంహణం
నేత్రపథ్యం॥

తా॥ స్వర్ణభస్మము చలవగను పరిశుద్ధముగను రుచికరముగను చేదుగను వగరుగను వీర్యవృద్ధికరముగను సూక్ష్మబుద్ధికరముగను దీపనకారిగను కాంతికరముగను తీపుగనునుండు. మఱియు క్షయ వాంతి కాస శ్వాస మేహము రక్తపిత్తము బలహీనత విషము గాయము రక్తదోషము ప్రదరము కృశత్వము త్రిదోషములు వున్మాదము అపస్మారము శూల జ్వరము వీటిని నివర్తింపం జేయుటయేగాక శరీరపుష్టి నేత్రములకుహితము వీటినిసగా గలుగంజేయు.

శ్లో॥ మృతంహాటకందివ్యకాంతిం తనోతిక్షతశ్వాసకాసక్షయంపిత్త
వాతౌ। ప్రమేహ గ్రహణ్యాతిసారంచకుష్ఠం జ్వరహంతిచా
ఖుంషకందర్పదంచ॥

తా॥ స్వర్ణభస్మము గాయము కాస శ్వాస క్షయరోగము వాతము పిత్తము ప్రమేహము గ్రహణి అతిసారము కుష్ఠువు జ్వరములు వీటిని నివర్తింపం జేయుటయే గాక శరీరమునకు దివ్యమైనకాంతి మిగులకామవృద్ధి వీటిని సగాగలుగంజేయు.

శ్లో॥ స్వర్ణంతిక్తంకషాయంమధురమతివయః స్థాపనంకాంతిదంచ ।
వృష్యంహృద్యంచబల్యంరుచికరమఖిలంవాగ్నిశుద్ధిప్రదంచ।
ఆయుర్వృద్ధ్యైవలీనాంహరణమచిరతోనాశనం దుర్విషాణాం ।
రోగేశోన్మాదమాంద్యంజ్వరపరిహరణంసర్వరోగాభినాశం ॥

తా॥ స్వర్ణభస్మము చేదుగను వగరుగను మధురముగను ముసలితనమును బోగొట్టునదిగను కాంతి వీర్యవృద్ధి మనస్సంతోషము బలము రుచి విశేషబుద్ధి వాక్పటుత్వము ఆయుర్వృద్ధి వీటిని గలుగంజేయునదిగ నుండు. మఱియునిది ముదిమి దుష్టవిషము వున్మాదము జ్వరము యివి మొదలైన సర్వరోగములను బోగొట్టును.

శ్లో॥ స్వర్ణంవిధత్తేకిలరోగనాశం కరోతిసౌఖ్యంప్రబలేంద్రియత్వం ।
శుక్రస్యవృద్ధిం బలతేజవృద్ధిం క్రియాసుయుక్తంచ యుతంచ హేమం॥

తా॥ పక్వస్వర్ణభస్మము సర్వరోగములను బోగొట్టునదిగను యింద్రియములకు పటుత్వమును గలుగజేయునదిను శరీరమునకు సౌఖ్యమును గలుగజేయునదిగను శుక్రము బలము తేజస్సు వీటి వృద్ధిని గలుగ జేయునదిగను సర్వశోధనాది క్రియలను గలుగ జేయునదిగనునుండు.

శ్లో॥ తపనీయంమృతంకాంతింశందర్పంతనుతేతథా ।
వాతంపిత్తంప్రమేహంచకాసంశ్వాసంక్షతంక్షయం ॥
గ్రహణీమతిసారంచజ్వరంకుష్ఠంవిషంహరేత్ ।
వయస్థాపనంస్వర్యబల్యంవృష్యంరుచిప్రదం ॥

తా॥ స్వర్ణభస్మము కాంతి కామోద్దీపనము స్థిరయౌవనము స్వరము బలము శుక్రము వీటివృద్ధి యివిగలుగు. మఱియు వాతము పిత్తము ప్రమేహము కాసము శ్వాసము క్షతము (గాయము) క్షయ గ్రహణి అతిసారము జ్వరము కుష్ఠువు విషము వీటిని నశింపంజేయు.

## అపక్వ సువర్ణభస్మ దోషము.

శ్లో॥ బలంచవీర్యంహరతేనరాణాంరోగవ్రజాన్పోషయతీహకాయే।
అసౌఖ్యకార్యంచసదైవహేమాఽపక్వంసదోషంమరణంకరోతి॥

తా॥ అపక్వ స్వర్ణభస్మము బలము వీర్యము వీటినాశనము శరీరమునందు రోగప్రాబల్యము యెల్లపుడు అసౌఖ్యము మరణము వీటిని గలుగజేయు.

అపక్వ స్వర్ణదోష శాంతి.

శ్లో॥ అభయాసితయాభుక్త్వాత్రిదినంన్రుభిరంగనే।
హేమదోషహారీఖ్యాతాసత్యంసత్యంనసంశయః॥

తా॥ కరక మార్గము తెల్లచక్కెర వీటిని సమముగ చేర్చి 3 దినములు పుచ్చుకొనిన అపక్వమైన స్వర్ణభస్మసేవనచే గలిగిన దోషములు నిస్సందేహముగ నశించు.

పక్వ రౌప్యభస్మ గుణము.

శ్లో॥ తారంచతారయతిరోగ సముద్రపారం దేహస్యసౌఖ్యదమికం
పలితంనిహంతి। హ స్తిహారోగవిషదోషమలంప్రసహ్యావృష్యం
పునర్నవకరంకురుతేచిరాయుః॥

తా॥ రౌప్యభస్మము రోగమనెడి విషముయొక్క దోషమును బలాత్కారముగ హరించి రోగమనెడి సముద్రమును దాటించుటయేగాక దేహసౌఖ్యము పలితనాశనము వీర్యవృద్ధి వార్ధకమునుపోగొట్టి యవ్వనము దీర్ఘాయువు వీటిని గలుగజేయు.

శ్లో॥ తారంకరోత్యామయసింధుపారం పిత్తాపహం వాతకఫౌని
హన్తి। గుల్మంప్రమేహంశ్వసనంచకాసంప్లీహక్షయక్షీణరుజ
కృద్విషార్తిమ్॥ వలీపలితనాశనంక్షుధాకాంతిపుష్టిదం।పాండు
శోఫహందదాతిచాయుషంన్రుణామిదం॥

తా॥ రౌప్యభస్మము విశేషముగ సర్వరోగములను హరింపజేయు. మఱియు పిత్తము వాతము కఫము గుల్మము ప్రమేహము శ్వాస కాస ప్లీహము క్షయరోగము క్షీణత్వము యకృత్తు విషము వళులు పలితము శోఫ వీటిని నివర్తింపజేయుటయేగాక శరీరకాంతి శరీరపుష్టి ఆయుర్వృద్ధి వీటిని సగాగలుగజేయు.

## అపక్వ రౌప్యభస్మ దోషము.

శ్లో॥ అశుద్ధంరజతంకుర్యాత్పాండుకండుగళగ్రహాన్ ।
వివిధంవీర్యనాశంచబలహానింశిరోరుజం॥

తా॥ అపక్వ రౌప్యభస్మము పాండువు దురద గళగ్రహము పలువిధములగు వీర్యనాశనము బలహాని తలనొప్పి వీటిని గలుగంజేయు.

శ్లో॥ తాపంచదేహస్యకరోతితాపంవిడ్గంధతాంయచ్ఛతిశుక్రనాశం।
అపాటవంవీర్యబలప్రహానింమహాగదాన్పోషయతీహకాయే ॥

తా॥ అపక్వ రౌప్యభస్మము శరీరమునందు జ్వరతాపము మలమువలె దుర్గంధము శుక్రక్షయము దుర్బలము వీర్యహాని రోగప్రాబల్యము వీటిని గలుగంజేయు.

## అపక్వ రౌప్యదోష శాంతి.

శ్లో॥ శర్కరాంమధుసంయుక్తాంసేవయేద్దివసత్రయం ।
అపక్వరౌప్యదోషేణవిముక్తస్సుఖమశ్నుతే ॥

తా॥ శర్కరయందు తేనెవైచి గలిపి దానిని 3 దినములు సేవించిన అపక్వ రౌప్యభస్మసేవనచే గలిగిన దోషములన్నియు తొలగు.

## పక్వ తామ్రభస్మ గుణము.

శ్లో॥ కుష్ఠప్లీహా జ్వరకఫమరుచ్ఛ్వాసకాసా ర్తిశోఫా స్తంద్రాశ్శూలో
దరకృమివమీపాండు మోహాతిసారాన్ । అర్శోగుల్మక్షయ
భ్రమశిరోవ్యాధిమేహాదహిత్వా శుద్ధంశుల్బంహరతిసతతం
వహ్నివృద్ధింకరోతి॥

తా॥ శుద్ధమైన తామ్రభస్మము కుష్ఠువు ప్లీహా జ్వరము కఫము వాతము శ్వాస కాస వాపు తంద్ర శూల ఉదరరోగము కృమిరోగము వాంతి పాండువు మూర్ఛ అతిసారము మూలవ్యాధి గుల్మరోగము క్షయ భ్రమ శిరోరోగము ప్రమేహము మొదలగు రోగములు యొక్కరిప్ప వీటిని పోగొట్టుటయేగాక అగ్నిదీపనమును నగాగలుగంజేయు.

శ్లో॥ కాసంశ్వాసంకఫంవాతంప్లీహానముదరంక్రిమీన్ ।
కుష్ఠంశూలంజ్వరంతంద్రావమింశోఫంచపాండుతాం ।
మోహమర్శోతిసారంచక్షయంగుల్మంశిరోవ్యధాం ।
హిక్కాంమేహంభ్రమంహంతిరవిర్వహ్నింవిభోధయేత్ ॥

తా॥ తామ్రభస్మము కాస శ్వాస కఫము వాతరోగము ప్లీహ వుదరరోగము క్రిమిరోగము కుష్ఠువులు శూలలు జ్వరములు తంద్ర వాంతి వాపు పాండువు మూర్ఛ అర్శస్సు అతిసారము క్షయ గుల్మము తలనొప్పి యెక్కిళ్ళు ప్రమేహము భ్రమము వీటిని హరింపం జేయుటయే గాక అగ్నిదీపనమును సగాగలుగంజేయు.

శ్లో॥ వహ్నింప్రదీపయతినాశయతీహకుష్ఠమర్శాంసి పాండుప్రమేహ
గదంసశోఫం । అన్యాశ్చదుస్తరగదా నఖిలాస్తనూత్థాంస్తా
మ్రంప్రయుక్తమచిరాశ్చనిహంతిశీఘ్రం॥

తా॥ శుద్ధమగు తామ్రభస్మము కుష్ఠువు మూలవ్యాధి పాండువు ప్రమేహము వాపు యివి మొదలైన అసాధ్యరోగంబులన్నియు అతిత్వరలో నివర్తించుటయే గాక దీపనమును సగాగలుగంజేయు.

అపక్వ తామ్రభస్మ దోషము.

శ్లో॥ ఏకోదోషోవిషేతామ్రేత్వసమ్యజ్మారితేఽష్టతే ।
దాహస్వేదోఽరుచిర్మూర్ఛాక్లేదోరేకోవమిభ్రమః॥

తా॥ విషమునకు వొక్కటే దోషమేనుండును. తామ్రభస్మము అపక్వముగనుండిన దాహము స్వేదము అరుచి మూర్ఛ శరీరమందలి జిగట రేకమనేరోగము వాంతి భ్రమము యిటుల 8 విధములయిన దోషముగలిగియుండుగాన నిది విషమునకంటె క్రూరమని యెరుంగవలయు.

శ్లో॥ పాకేనహీనంవమంకరోతివిరేచనంతాపమతోతిమూర్ఛాం ।
హన్త్యాయురుచ్చైర్భ్రమమోహపాకేనమ్రాంపహం దేహబలా
పహారీ॥

తా॥ అపక్వమగు తామ్రభస్మము వమనము విరేచనము సంతాపము అతి మూర్ఛ భ్రమము మోహము పాకము శుక్రక్షయము దుర్బలము వీటిని గలుగ జేయుటయే గాక ఆయువును సగా నశింపంజేయు.

శ్లో॥ తామ్రమపక్వంవమనంవిరేకతాపాదికంభ్రమంమూర్ఛాం ।
మోహంబలస్యనాశంకరోతిశుక్రస్యనాయుషశ్చాపి ॥

తా॥ అపక్వమైన తామ్రభస్మ సేవనచే వమనము విరేచనము తాపము భ్రమ మూర్ఛ ప్రమేహము బలనాశనము వీర్యనాశనము ఆయుఃక్షీణత యివి గలుగు.

అపక్వ తామ్రదోష శాంతి.

శ్లో॥ మునిప్రిహిపితాపానంనాథాన్యాకంసితాంచక్తైః ।
తామ్రదోషమశేషంవై పిబన్నాన్యాద్దినత్రయాత్ ॥

తా॥ తెల్లచక్కెర అడవిధాన్యపువిత్తులు లేక ధనియాలు వీటిని సమముగ చేర్చి వుదకముతో నూరి 3 దినములు ప్రాతఃకాలములయందు సేవించిన అనగా పానముజేసిన అపక్వ తామ్రభస్మ సేవనచేగలిగిన దోషములు హరించు.

పక్వ వంగభస్మ గుణము.

శ్లో॥ బల్యందీపనపాచనంరుచికరంప్రజ్ఞాకరంశీతలం ।
సౌందర్యంకవిత్వసంహృతరుజంచారోగతాకారకం ॥
ధాతుస్థైర్యకరంక్షయక్షయకరంసర్వప్రమేహాపహం ।
వంగంభక్షయతోనరస్యనభవేత్స్వప్నే పిశుక్రక్షయః ॥

తా॥ పక్వవంగభస్మము క్షయ ప్రమేహము వీటిని నివర్తింపంజేయుటయేగాక బలకరముగను దీపనకారిగను జీర్ణకారిగను రుచికరముగను తీవ్రబుద్ధి గలుగజేయునది గను శీతలముగను సౌందర్యకరముగను కవిత్వశక్తికరముగను రోగహరంముగను ఆరోగ్య కరముగను వీర్య స్తంభనకారిగను నుండు. మఱియు వంగభస్మము సేవించువానికి స్వప్నమునందు సగా వీర్యనాశనము గలుగదు.

వంగేశ్వర గుణము.

శ్లో॥ భ్రమతిమకకఫేవా శ్వాసకాస క్షయేవా విషరుధిరకకీలేవాత
పిత్తప్రమేహేంజ్వరగ్రహణి సశూలేకుష్ఠపాండ్వల్పవీర్యే బహు
గదవతిశస్త్రోరమ్యవంగేశ్వరోసా॥

తా॥ శుద్ధమగు వంగేశ్వరరసము ధ్రిమ తమము కఫము శ్వాస కాస క్షయ విషవికారము రక్తవికారమువలన గలిగినపీన వాతము పిత్తము ప్రమేహము జ్వరము గ్రహణి శూల కుష్ఠువు పాండువు చిక్కిపోవుట యివి మొదలైన అనేకరోగములను హరింపంజేయు.

శ్లో॥ భ్రిమతిమిరకఫప్రమేహకాసాన్ శ్వసనపవనపిత్తరక్తదోషాన్ ।
గ్రహణిగదసశూలకుష్ఠపాండూ జ్వరగదమపహంతివంగరాజః ॥

తా॥ వంగేశ్వరరసమును సేవించుటవలన భ్రిమ తిమిరరోగము కఫము ప్రమేహము కాస శ్వాస వాతము పిత్తము రక్తదోషము సంగ్రహణి శూల కుష్ఠము పాండువు జ్వరము యివి తొలగు

శ్లో॥ శ్వసనమేహసమీరణనాశనః ప్రదరశూలయకృత్కఫపాండు
హృత్ । భ్రిమమికుయం గ్లసర్వకృత్స్నకిలగోగహారిశ్చ వంగకః ॥

తా॥ వంగభస్మము శ్వాస ప్రమేహము వాతము ప్రదరరోగము శూల యకృత్తు కఫము పాండువు భ్రిమ వాంతి క్షయ యివి మొదలైన సర్వరోగములను నశింపం జేయుటయేగాక బలము వీర్యము వీటిని సగాగలుగంజేయు.

అపక్వ వంగభస్మ దోషము.

శ్లో॥ పాకేనహీనః ఖలువంగకో గ్నిగుల్మానిమహాంతిరోగాన్ ।
పాండుప్రమేహాపచివాతశోణితం బలాపహారం కురుతేనరాణామ్॥

తా॥ అపక్వమగు వంగభస్మము కుష్ఠువు గుల్మము యివి మొదలైన గొప్ప రోగంబులు పాండువు ప్రమేహము అపచి వాతము రక్తవికారము కామక్షయము వీటిని గలుగంజేయు.

శ్లో॥ యస్యాపక్వంభవేద్వంగం గుల్మకుష్ఠప్రమేహకృత్ ।
వాతశోణితమందాగ్ని పాండుదౌర్బల్యరుక్ప్రదమ్ ॥

తా॥ అపక్వమైన వంగభస్మము గుల్మము కుష్ఠువు ప్రమేహము వాతము రక్త దోషము అగ్నిమాంద్యము పాండువు దుర్బలము వీటిని గలుగంజేయు.

### అపక్వ వంగదోష శాంతి.

శ్లో॥ మేషశృంగసితాయుక్తాం యస్సేవతిదినత్రయం ।
వంగదోషవిముక్తో సౌసుఖంజీవతిమానవః ॥

తా॥ తెల్లశర్కర వద్దివేరుపట్టచూర్ణము వీటిని సమముగ జేర్చి 3 దినములు సేవించిన అపక్వ వంగభస్మదోషమువలన గలిగిన రోగములన్నియు నివర్తించు.

### పక్వ జసదభస్మ గుణము.

శ్లో॥ జసదంతువరంతిక్తం శీతలంకఫపిత్తహృత్ ।
చక్షుష్యంపరమంమేహాం పాండుంశ్వాసంచనాశయేత్ ॥

తా॥ పక్వమగు సత్తుభస్మము వగరుగను చేదుగను శీతలముగను నేత్రములకు మిగుల హితకారిగనుండు. మఱియునిది కఫము పిత్తము ప్రమేహము పాండువు శ్వాస వీటిని నశింపజేయును.

శ్లో॥ త్రిదోషప్రమేహాగ్నిమాన్ద్యాక్షిరోగానతీసారపిత్తజ్వరాజీర్ణ
కాసాన్ । విబంధామవాతంహరేద్గ్రహణి హేతుర్వమింశూల
శీతజ్వరాస్రస్రుతీశ్చ ॥

తా॥ జసద (సత్తు) భస్మసేవనచే త్రిదోషము ప్రమేహము అగ్నిమాంద్యము నేత్రరోగము అతిసారము పిత్తజ్వరము అజీర్ణము కాస మలబంధము ఆమవాతము వాంతి శూల శీతజ్వరము రక్తాతిసారము యివి నివర్తించు.

### అపక్వ జసదభస్మ దోషము.

శ్లో॥ అపక్వంజసదంరోగాన్ ప్రమేహాజీర్ణమారుతాన్ ।
వమింభ్రమింకరోత్యేనం శోధయేన్నాగవత్తతః ॥

తా॥ అపక్వమగు సత్తుభస్మము ప్రమేహము అజీర్ణము వాతరోగములు వాంతి భ్రమ వీటిని గలుగజేయునుగాన నాగము శుద్ధిజేయురీతిగా దానిని శుద్ధిచేసి పుచ్చుకొనవలయును.

### అపక్వ జసదదోష శాంతి.

శ్లో॥ శాలాభయాంసితాయుక్తాం సేవయేద్వ్యదినత్రయం ।
జసదస్యవికారోస్యా నాశమాయాతినాన్యథా ॥

తా॥ కరకపిందెల చూర్ణమునందు శర్కరవైచి 3 దినములు సేవించిన అపక్వ మగు నత్తుభస్మ సేవనచే గలిగినదోషము నివర్తించు.

## పక్వ నాగభస్మ గుణము.

శ్లో॥ క్షయపవనవికారే గుల్మపాండ్వామయేషుభ్రమ క్రిమికఫశూ
లేమేహకాసామయేషు । గ్రహణిగుదగదేవై నష్టవహ్నౌప్రశస్త
శ్శుభవిధకృతనాగః కామపుష్టిందదాతి ॥

తా॥ నాగభస్మము క్షయ వాతవికారము గుల్మము పాండువు భ్రమ క్రిమి కఫము శూల ప్రమేహము కాస సంగ్రహణి భగందరము అగ్నిమాంద్యము యివి మొదలయిన వ్యాధులను బోగొట్టుటయేగాక వీర్యవృద్ధిని సగా గలుగజేయు.

శ్లో॥ నాగోనాగశతతుల్యబలందదాతివ్యాధీంశ్చనాసయతిజీవిత
మాతనోతి । వాయుంకృమీన్ వినిహంతిసతిక్తమేవంవృష్యంచ
పిత్తకరమాశు మృతింనిహంతి।

తా॥ నాగభస్మము 100 యేనుగుల బలమును పుట్టించునదిగను సమస్తరోగ ములను నశింపజేయునదిగను ఆయుస్సును వృద్ధిజేయునదిగను వాతము కృమి యివి మొదలయిన రోగముల బోగొట్టునదిగను చేదుగను శీతకారిగను వీర్యవృద్ధికరముగను పిత్తకరముగను అకాలమృత్యువును నివర్తించునదిగను నుండు.

శ్లో॥ వాతరోగంక్షయంగుల్మంపాండుశూలభ్రమిక్రిమీన్ కఫం। వహ్ని
మాంద్యంశుక్రదోషం కాసార్శోగ్రహణీకృమీన్ ॥ అపమృ
త్యుంనిహంత్యాసు శతనాగ సమంబలం । దదాతిచాయుషో
వృద్ధింవేత్కృతం విధినాప్రియే॥

తా॥ ఓప్రియురాలా! శాస్త్రానుసారముగ క్రమముగ చేయబడిన నాగభస్మము వాతము క్షయరోగము గుల్మము పాండువు శూల భ్రమ కఫము అగ్నిమాంద్యము శుక్రదోషము కాస అర్శోరోగము సంగ్రహణి క్రిమి అపమృత్యువు వీటిని నశింపం జేయుటయేగాక 100 యేనుగులబలము ఆయుర్వృద్ధి వీటిని సగాగలుగజేయు.

!!

## అపక్వ నాగభస్మ దోషము.

శ్లో॥ కుష్ఠాని గుల్మారుచిపాండురోగాః క్షయంకఫం రక్తవికార
కృచ్ఛ్రిం । జ్వరాశ్మరీశూలభగందరాఢ్యంనాగంహ్యాపక్వం
కురుతేనరాణాం॥

తా॥ అపక్వమగు నాగభస్మము కుష్ఠువు గుల్మరోగము అరుచి పాండువు క్షయ కఫము రక్తవికారము మూత్రకృచ్ఛ్రిము జ్వరము అశ్మరీరోగము శూల భగందరరోగము వీటిని గలుగంజేయు.

## అపక్వ నాగదోష శాంతి.

శ్లో॥ హేమాహరీతకీంసేవేత్ సితాయుక్తాందినత్రయం ।
అపక్వనాగదోషేణవిముక్తస్సుఖమేధతే॥

తా॥ వస కరక్కాయ వీటిని చూర్ణించి అందులో శర్కరకలిపి దానిని 3 దినములు సేవించిన అపక్వనాగభస్మ సేవనచే గలిగిన వ్యాధులు నివర్తించు

## పక్వ లోహభస్మ గుణము.

శ్లో॥ లోహం మృతం కజ్జలసన్నిభంతుభుక్తేన దాయోరసరాజ
యుక్తం।తస్యైవదేహేంచభవంతిరోగామృత్యోఽకామః పునరే
తిధామ ॥ ఆయుఃప్రదా తాబలవీర్యకర్తారోగస్యహర్తామఖ
నస్యకర్తా । అయస్సమానంనహికించిదన్యద్రసాయనంశ్రేష్ఠత
మంవదంతి॥

తా॥ కజ్జలిలో సదృశమగు లోహభస్మము శుద్ధిజేయబడిన పాదరసము వీటిని జేర్చి సేవించిన శరీరమునందు యెట్టిరోగమును కలుగకుండుటయేగాక కామహీనులకు అధికకామమును సగాగలుగంజేయు. మఱియు సీలోహభస్మము ఆయుర్వృద్ధి బలము వీర్యము కామవృద్ధి వీటిని గలుగజేసి సమస్తరోగములను హరింపంజేయు. గాన యీభస్మముతో సమానమైనది యెద్దియు లేదనియును సమస్తరసంబులలో లోహభస్మమే శ్రేష్ఠమైనదియును వైద్యవేత్తలు చెప్పెదరు.

శ్లో॥ లోహాబాజంతువికార పాండుపవనక్షీణత్వ పిత్తామయస్థా
ల్యాశోగ్రహణీజ్వరార్తికఫజిదోచ్ఛఫప్రమేహాప్రణుత్ । గుల్మ

ప్లీహావిషాపహంబలకరంకాంతాజనానందకం ॥ సౌఖ్యాలంబిర
సాయనం మృతిహరంద్పృష్టేశ్చ కాంతిప్రదం । ఆమవాతగదే
షుశోఫనంపాండుమేహగదనాశనేగజః । దుష్టకుష్ఠ పలితాస్ర
వాతజిత్సాన్యజరామృతివలీవినాశనః ॥

తా॥ లోహభస్మము జంతువికారము పాముకాటువిషము పాండురోగము వాత క్షీణత్వము పిత్తరోగము శరీరస్థూలత్వము మూలవ్యాధి సంగ్రహాణి జ్వరము కఫము శోఫ ప్రమేహము గుల్మము ప్లీహము ముసలితనము నేత్రరోగము ఆమవాతము మహా కుష్ఠువులు శ్వేతకుష్ఠము రక్తవికారము మృత్యువు వళులు పలితము (వెండ్రుకలు నెఱయుట) యివి మొదలైన వ్యాధులను బోగొట్టుటయేగాక మిక్కిలి బలము పెక్కు స్త్రీలతోరమించు శక్తి వీటిని సగాగలుగంజేయు

శ్లో॥ శశోఫపాండుక్షయకామలామయప్రమేహహావీరహాలీమకాని।
తత్కేవలంలోహమిదంనిహంతినిసేవితంహ్యేత్మవతానరేణ ॥

తా॥ లోహభస్మ సేవనచే శోఫతో గూడినపాండువు క్షయ కామిల ప్రమేహము హాలీమకము యివి మొదలైన వ్యాధులునివర్తించు.

శ్లో॥ పాండుంఖండయతిక్షయం క్షపయతి క్లైబ్యంక్షిణో తిక్షణా
త్కాసంనాశయతి భ్రిమాశమయతి శ్లేష్మామయంఖాదతి ।
అర్శోగుల్మ సమూలపీనసవమీ శ్వాసప్రమేహారుచింశీఘ్రిం
నాశయతిప్రభూతగుణకృల్లోహంపరంమారితం॥

తా॥ లోహభస్మము పాండువు క్షయ క్షీణత్వము కాస భ్రిమ శ్లేష్మరోగము అర్శస్సు గుల్మరోగము పీనస వాంతి శ్వాస ప్రమేహము అరుచి వీటిని హరింపజేయు.

శ్లో॥ మృగవిలోచనకుంజరగామిని శృణు వరామ్యయి లోహగుణా
నహం। సువిధిమారితమేవహరత్యయఃక్రిమిసమీరణ పాండు
విషజ్వరాన్ । భ్రిమవమిశ్వశసగ్రహణీగదాన్కఫదరాకసన
క్షయకామలాః । అరుచిపీనసపిత్తప్రమేహకాన్ గుదజగుల్మరు
గామసమీరణాన్ ॥ ప్లీహస్థౌల్యవినాశనంబలకరంకాంతాజ

నానందదం । క్షీణత్వంవిధువోతిదృష్టిజనకంశోషాపహంతుష్ట
నుత్ ॥భుక్తంశుద్ధరసేంద్రసంయుతమిదం సర్వామయధ్వంసనం।
కాంతాచ్ఛేత్రిష్ఠరసాయనంనహిపరంకాంతేఽస్తిబింబాధరే ॥

తా॥ లేడి నేత్రములతో సమానమగు నేత్రములు కలదియును మందించిన యేనుగ నడకవంటి నడక గలదియునునగు ఓప్రియరత్నమా! లోహభస్మగుణమును చెప్పెదనువినుము. శాస్త్రోక్తముగ పక్వముచేయుబడిన లోహభస్మము క్రిమి వాత రోగము పాండువు విషము జ్వరము భ్రమ వాంతి శ్వాస గ్రహణి కఫము మదిమి కాస క్షయ కామిల అరుచి పీనస పిత్తము ప్రమేహము అర్శస్సు గుల్మము ఆమ వాతము ప్లీహ స్థౌల్యము కృశత్వము శోఫ కుష్ఠువు వీటిని హరింపంజేయుటయేగాక రతిసలుపునపుడు స్త్రీలకు సంతోషమును పుట్టించునట్టి సమర్థత కండ్లకు నైర్మల్యము వీటినినగాగలుగంజేయు. దొండపండువంటి పెదవిగల ఓ స్త్రీరత్నమా! లోహభస్మ మును శుద్ధిజేసిన పాదరసముతో సేవించిన సమస్తరోగములు తొలగు. గాన యీ లోహభస్మమునకంటె రసాయనములలో శ్రేష్ఠమైనది యేదియునులేదు.

శ్లో॥ అల్పౌషధస్తోకపుటైర్హీనగంధకపారదైః । అపక్వలోహజం చూర్ణమాయుఃక్షయకరంపరం ॥ షణ్ఢత్వకుష్ఠామయమృత్యు దంభవేత్ హృద్రోగశూలాశ్మరీచ। నానారుజానాం చతథాప్రకోపంకరోతిహృల్లాసమశుద్ధలోహం॥

తా॥ అయోమారణమునకు చేర్చవలసిన ఔషధములు తక్కువైనను లేక పుటములు తక్కువైనను గంధకము పారదము యివి మిళితము కాకపోయినను లోహభస్మము అశుద్ధమగు. ఇట్టిలోహభస్మమును సేవించిన ఆయుస్సు క్షీణించు. మఱియు నిదిషండత్వము కుష్ఠము మృత్యువు హృద్రోగము శూల అశ్మరి నానావిధరోగములు హృల్లాసరోగము వీటినిగలుగంజేయు.

శ్లో॥ విషంక్లేదంకరోత్యేవవీర్యంకాంతింనిహంతిచ।
అపక్వంహియతోలోహంతతస్సమ్యగ్విపాచనేత్ ॥

తా॥ అపక్వమగు లోహభస్మము విషము క్లేదము వీటినిగలుగంజేయు. మఱియు నిది వీర్యము కాంతి నశింపంజేయును. గనుక లోహమును శుద్ధభస్మమగు నటుల చక్కగపక్వముజేసి దానిని సేవించవలయు.

శ్లో॥ గరళంక్లమవాంతివీర్యహాఇతిదోషాఃప్రవదంతిలోహకే।
అథశోధనభావకాన్ పుటాన్ విధినైకేనవదంతిసూరయః॥

తా॥ లోహమునకు విషము గ్లాని వాంతి వీర్యహాని అనునీ దోషంబులున్నవని ఆయుర్వేదవేత్తలుచెప్పెదరు. గనుక వాటి నివారణకొరకై శోధనభావన పుటములను శాస్త్రమునకు జేయురీతిగా జేయవలయు.

అపక్వ లోహభస్మ శాంతి.

శ్లో॥ మునిరసపక్ష విడంగం మునిరసలీఢం చిరస్థితేఘర్మే।ద్రావయతి
లోహదోషాన్ వహ్నిర్నవనీతపిండమివ॥

తా॥ వాయువిడంగములను అగశిఆకు రసముతోనూరి యెండలో చక్కగ నెండించి దానిని అగశిఆకురసముతో సేవించిన అగ్ని వెన్నను కరిగించుచందంబున లోహభస్మ జనితదోషములను బోగొట్టు.

అపక్వ లోహజన్యకీట శాంతి.

శ్లో॥ ఆరగ్వధస్యమజ్జోత్థ రేచనంకీటశాంతయే।
భవేదప్యతిసారశ్చపీత్వాదుగ్ధంతుతజ్జయేత్॥

తా॥ అపక్వ లోహభస్మమును సేవించిన కడుపునందు పురుగులుజనించుగాన రేలబంకతో విరేచనమునకు పుచ్చుకొనిన అవినశించు. లేక అతిసారమైనను జనించు. అది నివర్తించుటకై పాలుత్రాగవలయు.

శ్లో॥ సైంధవంత్రివృతాయుక్తంసేవయేత్తప్తవారిణా।
అయోవికారశాంతిస్స్యాత్పాపంకేశవదర్శనాత్॥

తా॥ సైంధవలవణము తెల్లతెగడ వీటిని సమముగచేర్చి చూర్ణించి వుష్ణోదకములోకలిపి సేవించిన « విష్ణువును చూచినమాత్రమున పాపములు తొలగుచందంబున అశుద్ధలోహభస్మ సేవనచే గలిగినవికారము నివర్తించు.

శ్లో॥ ఖండమాక్షికసంయుక్తమేలాచూర్ణందినత్రయం।
వికారోలోహజస్తస్యభుక్త్వానాశంసమాప్నుయాత్॥

తా॥ కలకండచూర్ణము యేలకులచూర్ణము వీటిని మాక్షికమును తేనెయందు కలిపి 3 దినములు సేవించిన అపక్వ లోహభస్మ సేవనచే గలిగినదోషములు నివర్తియగు.

శ్లో॥ సింధూత్థంత్రివృతాచూర్ణంసేవితంకోష్ణవారిణా ।
లోహజావికృతిస్తస్యవినశ్యతినసంశయః॥

తా॥ సైంధవలవణము తెల్లతెగడచూర్ణము వీటిని కొంచము వేడిగనుండు నీళ్లలోకలిపి పానముజేసిన అపక్వ లోహభస్మసేవనచే గలిగినదోషములు నివర్తియగు.

శ్లో॥ సితయామధునావాపి శ్వేతదూర్వారసంపిబేత్ ।
వికారంలోహజంత్యక్త్వాసుఖమేవహిజీవతి॥

తా॥ తేనె శర్కర వీటియందు దేనితోనైనను తెల్లగరికెరసమును మిళితము జేసి సేవించిన అపక్వ లోహభస్మమును సేవించుటవలన గలిగినదోషములన్నియు తొలగి సుఖజీవిగనుండు.

ఒక్క సువర్ణమాక్షికభస్మ గుణము.

శ్లో॥ స్వాన్మాక్షికస్తిక్తసుగీపనఃకటుర్దుర్నామ కుష్టామయఘాతనా
శనః।పాండుప్రమేహక్షయనాశనోలఘుస్సత్వంమృతంతస్యసు
వర్ణవద్గుణైః॥

తా॥ సువర్ణమాక్షికభస్మము చేదుగను దీపనకారిగను కారముగను చులకనగను నుండు. మఱియు దుర్నామము కుష్ఠము ఘాతభాధ పాండువు ప్రమేహము క్షయ వీటిని నశింపంజేయు. మఱియునిది స్వర్ణభస్మముతో సమానముగనుండు.

శ్లో॥ వివిధపాండుగదాన్ భ్రమకంక్షయంశ్వసనకంచ జయేన్మృత
మాక్షికం॥

తా॥ స్వర్ణమాక్షికభస్మమును సేవించిన నానావిధములగు పాండురోగము భ్రమ క్షయరోగము శ్వాస యివి నివర్తించు.

శ్లో॥ వృష్యంస్వర్యహిచక్షుష్యంవ్యవాయ్యపిరసాయనం । హంతి
వస్త్యర్తిశోఫార్శోమేహాంకుష్ఠోదరక్షయాన్ ॥ పాండురోగం

విషంపిత్తంకామలాంచహలీమకం। వాతంచాతాత్మజఃపుత్రం
రావణస్యయథాహనత్॥

తా॥ స్వర్ణమాక్షికభస్మము వీర్యవృద్ధి కంఠమునకు సుస్వరము స్త్రీసంభోగము నందు అధికశక్తి వీటినిగలుగం జేయుటయేగాక నేత్రరోగములను సగా నశింపం జేయు. మఱియు స్వర్ణమాక్షికభస్మము పొత్తికడుపునొప్పి వాపు అర్శస్సు ప్రమేహము కుష్ఠువు వుదరరోగము క్షయ పాండువు విషము పిత్తము కామిల హలీమకము వాతరోగము వీటిని హరింపంజేయు.

## అపక్వ స్వర్ణమాక్షికభస్మ దోషము.

శ్లో॥ అపక్వస్వర్ణమాక్షికేణాశుదేహంసంక్రమతేరుజా॥

తా॥ అపక్వ స్వర్ణమాక్షికభస్మమును సేవించిన శరీరమునందనేక రోగములు జనించు

## అపక్వ స్వర్ణమాక్షికదోష శాంతి.

శ్లో॥ కులుత్థస్యకషాయేణమాక్షీవికృతిశాంతికృత్ ।
తత్త్వదాడిమత్వగ్వాదేయాదేహసుఖార్థినే॥

తా॥ ఉలవకషాయముగాని దాడిమతోలు కషాయముగాని సేవించిన అపక్వ స్వర్ణమాక్షిక సేవనచే జనించినదోషము నివర్తించు.

## పక్వ రౌప్యమాక్షికభస్మ గుణము.

శ్లో॥ రౌప్యమాక్షికగుణాస్తు హేమవద్యోదితోఽతిగుణాచస్మృతే
వితః । మేహకుష్ఠ కృమిశోఫ పాండుతాపస్మృతిర్ఘ్నారతిపోస్మ
రింజయేత్॥

తా॥ పక్వమగు రౌప్యమాక్షికభస్మము మేహము కృమిరోగము శోఖ పాండువు అపస్మారము అశ్మరి వీటిని హరింపంజేయుటయేగాక శరీరమునకు బంగారువంటి కాంతిని సగాగలుగంజేయు.

## అపక్వ రౌప్యమాక్షికభస్మసేవా దోషము.

శ్లో॥ అపక్వరౌప్యమాక్షికేణామయానేకాశ్చభవంతి॥

తా॥ పక్వముగాని రౌప్యమాక్షికభస్మమును సేవించిన అనేకరోగములు గలుగు.

### అపక్వ రౌప్యమాక్షికదోష శాంతి.

శ్లో॥ వికారోయదిజాయేతంవిమలాయానిషేవణాత్ ।
శర్కరాసహితాభక్ష్యామేషశృంగీదినత్రయం ॥

తా॥ ఒడ్డివట్టి కషాయములో శర్కరవైచి 3 దినములు సేవించిన అపక్వ రౌప్యమాక్షికభస్మ సేవనచే గలిగిన వికారము నివర్తించు.

### తుత్థ భస్మగుణ దోషములు.

శ్లో॥ తుత్థభస్మకఫంహన్తిపామాంకుష్ఠవిషంకృమీన్ ।
చక్షుష్యంలేఖనంభేదిశుద్ధిహీనంహిదోషకృత్ ॥

తా॥ శుద్ధిజేయబడిన మైలతుత్థభస్మము కఫము దురద కుష్ఠువు విషము క్రిమి వాతాదిదోషములు వీటినిహరింపంజేయుటయేగాక నేత్రములకు హితము మలవిసర్జనము వీటినిసగా గలుగంజేయు. శుద్ధిజేయని తుత్థభస్మము త్రిదోషములకు ప్రకోపమును గలుగంజేయునదిగ నుండు.

### అపక్వ తుత్థదోష శాంతి.

శ్లో॥ జంబీరస్వరసంవాపిలాజావారిసమన్వితాః ।
లామజ్జకజలంవాపిపిబేత్తుత్థకశాంతయే ॥

తా॥ నిమ్మపండ్లరసము పేలాలను నానవేసిన నీళ్ళు వట్టివేరును నానవేసిన నీళ్ళు వీటిలోదేనినైనను 3 దినములు త్రాగిన అపక్వతుత్థభస్మ సేవనచే గలిగిన దోషములు నివర్తించు.

### పక్వ శిలాజతుభస్మ గుణము.

శ్లో॥ పాండురంసికతాకారంకర్పూరాభంశిలాజతు ।
మూత్రకృచ్ఛాశ్మరీమేహకామలాపాండునాశకృత్ ॥

తా॥ పక్వమగు శిలాజతుభస్మము యిసుకవలెను కర్పూరమువలెను తెల్లగ నుండు. మఱియు మూత్రకృచ్ఛ్రము అశ్మరీరోగము ప్రమేహము కామిల పాండువు వీటిని నశింపంజేయు.

### అపక్వ శిలాజతుభస్మ దోషము.

శ్లో॥ అశుద్ధందాహమూర్ఛాదీన్భ్రమపిత్తాస్రశోణితం ।
శిలాజతుప్రకురుతేమాంద్యమగ్నేశ్చవిడ్గ్రహం ॥

తా॥ అశుద్ధ శిలాజతుభస్మము దాహము మూర్ఛాదిరోగములు భ్రమ రక్తపిత్తము రక్తస్రావము అగ్నిమాంద్యము మలబద్ధము వీటిని గలుగంజేయు.

అశుద్ధ శిలాజతుదోష శాంతి.

శ్లో॥ మరిచంఘృతసంయుక్తంసేవయేద్దినసప్తకం।
శిలాజతుభవందోషంశాంతిమాప్నోతినిశ్చితం॥

తా॥ మిరియాల చూర్ణమును నేతితో 7 దినములు సేవించిన అపక్వశిలాజతు భస్మసేవనచె జనించిన వికారము నివర్తించు

శుద్ధపారద భస్మస్య గుణము.

శ్లో॥ యావన్నహారబీజంతుభక్షయేత్పారదంమృతం।
తావత్తస్యకుతోముక్తిఃకర్మభోగ్యాదిరాగ్యవాకపి॥

తా॥ మనుజుడెంత పర్యంతము పారదభస్మమును సేవించడో అంతపర్యంతము పాపాలభవములు రోగము సంసారము యివి యెట్లునివర్తించును?

అన్యచ్చ.

శ్లో॥ మూలచ్ఛేదోగదవ్రాతైస్థవస్థాగలింధత్తేవివృద్ధానాద్ధదం।
స్వాస్థ్యంస్నాయుమహాంధకాదిహరణందృక్పుష్టికాంతిప్రదం।
వృష్యంమృత్యువినాశనంబలకరంకాంతాజనానందదం।
శ్లాఘ్యోలోహతులసత్వకృచ్ఛభువిజాన్రోగాన్ హరేద్వైస్ఫుటం॥

తా॥ శుద్ధపారదభస్మము ఆకాశగమనము శరీరపుష్టి ధనము నేత్రనైర్మల్యము కాంతి వీర్యవృద్ధి బలము స్త్రీలకు తృప్తినిగలుగజేయుట పెద్దపులితో సమానమైన బలము వీటిని గలుగంజేయు. మఱియు రోగము ముసలితనము మొదలైనవి మృత్యువు సమస్తరోగములు వీటిని నివర్తింపజేయు.

శ్లో॥ రసోరసరసైర్యుక్తఃశోధితోభస్మసాత్కృతః।
త్రిదోషశమనఃకామఃవర్ధనఃసర్వరోగహృత్॥
కామినీదర్పదలనఃసుధాస్పర్ధీసువర్ణకృత్।
దీర్ఘాయుష్యస్మృతిదౌర్బల్యతాపదఃక్రిమికుష్ఠహా॥
జరామరణజాడ్యఘ్నోయోగవాహీవరాంగనే।
దహాత్యగ్నిస్తృణానిధాతూన్సామయాన్రసః॥

తా॥ పాదరసము షడ్రసములతో చేరియుండును. దానిని శుద్ధిపరచి భస్మము చేసి సేవించిన నది త్రిదోషములు సర్వరోగములు వీటిని నివర్తింపజేయు. మఱియు నిది క్రిమిరోగము కుష్ఠువు మొదలు అపమృత్యుజాడ్యము ధాతుగతరోగములు వీటిని "అగ్నితృణములను దహించుభంగి" నివర్తించుటయే గాక కామవృద్ధికరముగను సురత కాలమునందు వీర్యవృద్ధికరముగను అమృతతుల్యముగను శరీరమునకు మంచికాంతిని గలుగజేయునదిగను నేత్రములకు బలకరముగను స్మృతి సౌందర్యము వీటిని వృద్ధి పరచునదిగను నుండు.

అశుద్ధాఽపక్వపారదభస్మ దోషము.

శ్లో॥ సంస్కారహీనం ఖలుసూతరాజం యస్సేవతేతస్య కరోతి
బాధాం। దేహస్యనాశంవిదధాతిసూనంకుష్ఠాదిరోగాజ్జనయే
న్నరాణాం॥

తా॥ అశుద్ధాపక్వపారద భస్మమును సేవించినవానికి శరీరబాధ దేహనాశనము కుష్ఠాదిరోగములు వీటిని గలుగంజేయు.

అన్యచ్చ.

శ్లో॥ అశుద్ధోజడతాంకుష్ఠందాహంవీర్యప్రణాశనం ।
మూర్ఛాంస్ఫోటంచమృత్యుంచక్రమాత్కుర్యాన్మలై రసః ॥

తా॥ శుద్ధిచేయని పాదరసము నాగదోషముచే జడత్వము వంగదోషముచే కుష్ఠరోగము అగ్నిచాంచల్యముచే అధికతాపము అసహ్యాగ్నిచే వీర్యనాశనము విషముచే మూర్ఛయు మలముచే స్ఫోటకమును పర్వతముచే మరణము వీటిని యథాక్రమముగ గలుగంజేయు.

అశుద్ధాఽపక్వ పారదదోష శాంతి.

శ్లో॥ వికారాయదిజాయంతేపారదాన్మలసంయుతాత్ ।
గంధకంసేవయేద్ధీమాన్పాచితంవిధిపూర్వకం॥

తా॥ విధిపూర్వకముగ పక్వముచేయబడిన గంధకమును సేవించిన అశుద్ధాపక్వపారద భస్మసేవనచే గలిగిన దోషము నివర్తించు.

అన్యచ్చ.

శ్లో॥ గవాంకుగ్ధయుతంపీత్వాగంధకందినసప్తకం ।
పారదస్యవికారేణముక్తస్సుఖమవాప్నుయాత్॥

తా॥ శుద్ధిజేసిన గంధకమును ఆవుపాలులోవైచి దానిని 7 దినములు త్రాగిన పాదరస సేవనచే గలిగిన దోషములు తొలగి సౌఖ్యము కలుగు.

రస సింధూరశుద్ధభస్మ గుణము.

శ్లో॥ హరతిచరససిందూరంకాసశ్వాసాగ్నిమాంద్యమేహగణాన్ ।
రక్తవికారంకృచ్ఛ్రింజ్వరాదిరోగాన్ యథానుపానయుతం ॥

తా॥ రససింధూరమును తగుమైన అనుపానముతో సేవించినకాస శ్వాస అగ్నిమాంద్యము నానావిధప్రమేహములు రక్తవికారము మూత్రకృచ్ఛ్రము జ్వరము యివి మొదలగు రోగములు నశించు

రససిందూర అపక్వదోషతచ్ఛాంతి.

శ్లో॥ రససిందూరమశుద్ధాద్రసాద్విజాతంపారదవద్రోగాన్ ।
కుర్యాచ్ఛేత్తచ్ఛాంత్యైఘృతమరిచరజఃపిబేత్సుసప్తదినం ॥

తా॥ అశుద్ధపాద రసముచే రససింధూరము చేసినను లేక విధిప్రకారము పక్వము కాకపోయినను ఆరససిందూరము పక్వముకాని పాదరసమువలె పెక్కుదారుణమగు వ్యాధులను గలుగజేయు. అందులకై మిరియాలచూర్ణమును ఆవునేతిలో మిళితముజేసి 7 దినములు సేవించిన అపక్వ రససిందూర సేవనచే గలిగిన దోషములన్నియు నివర్తించు.

రసకర్పూరపక్వ గుణము.

శ్లో॥ దేవకుసుమచందనకస్తూరికుంకుమైర్యుక్తం ।
ఖాదన్హరతిఫిరంగవ్యాధింసోపద్రవంఘోరం ।
విందతివహ్నేర్దీప్తింపుష్టింవీర్యంబలంవిపులం ।
రమయతిరమణీశతికంరసకర్పూరస్య సేవకస్సతతం ॥

తా॥ శుద్ధిజేసిన రసకర్పూరమును లవంగము చందనము కస్తూరి కుంకుమపువ్వు వీటినినూరి దానితో సేవించిన ఫిరంగిరోగము వుపద్రవముతో గూడిన భయంకరమగు వ్యాధులు యివి నివర్తించు. మఱియు అగ్నిదీపనము శరీరపుష్టి వీర్యవృద్ధి మిగుల బలము 100 స్త్రీలతో రమించుశక్తి వీటిని గలుగజేయు.

రసకర్పూర అపక్వదోషము.

శ్లో॥ సేవితోవిధినాకుష్ఠంసంధివాతంకఫాధికం ।
రసకర్పూరకఃకుర్యాత్తస్మాద్యత్నేనసేవయేత్ ॥

తా॥ శాస్త్రోక్తప్రకారము శుద్ధిజేయని రసకర్పూరము కుష్ఠువు సంధివాతము కఫాదిరోగములు వీటిని గలుగంజేయును గాన దీనిని మిగుల ప్రయత్నముతో శుద్ధిజేసి పుచ్చుకొనవలయును.

అశుద్ధ రసకర్పూరదోష శాంతి.

శ్లో॥ మహిషీశక్రశోనీరంధాన్యకంవాపిలాయుతం ।
పిబేన్నీరేణముక్తస్స్యాద్రసకర్పూరజైర్గదైః॥

తా॥ ఎనపపేడ రసమునుగాని ధనియాలచూర్ణము తెల్లచక్కెర వీటిని పుదక ములోనైచి వానినిగాని త్రాగిన అశుద్ధమగు రసకర్పూరసేవనచే గలిగిన దోషము లన్నియు నివర్తించు.

శుద్ధ గంధకభస్మ గుణము.

శ్లో॥ శుద్ధోగంధోహరేద్రోగాన్కుష్ఠమృత్యుజ్వరాదికాన్ ।
అగ్నికారీమహానుష్ణోవీర్యవృద్ధింకరోతిహి ॥

తా॥ శుద్ధగంధక భస్మము కుష్ఠము మృత్యువు జ్వరము యివి మొదలైన రోగ ములను హరింపజేయుటయేగాక అగ్నిదీపనము శరీరమునకు వుష్ణము వీర్యవృద్ధి వీటిని సగా గలుగంజేయు.

అశుద్ధ గంధకభస్మ దోషము

శ్లో॥ అశుద్ధగంధఃకురుతేచకుష్ఠం తాపంభ్రమంపిత్తరుజాంచతద్వత్ ।
రూపంసుఖంవీర్యబలంనిహంతితస్మాద్విశుద్ధోవినియోజనీయః॥

తా॥ అశుద్ధగంధక భస్మము కుష్ఠము తాపము భ్రమ పిత్తము వీటిని గలుగం జేయుటయేగాక రూపము సుఖము వీర్యము బలము వీటినిసగా నశింపజేయును గాన శుద్ధగంధకభస్మమునే సేవింపవలయును.

అశుద్ధ గంధకదోష శాంతి.

శ్లో॥ గవాంపయోఘృతైర్యుక్తంనలీవిశ్వతిశాంతికృత్ ।
తద్వైవదేవకుసుమంపచాయుక్తంచశాంతికృత్ ॥

తా॥ ఆవుపాలు నెయ్యి వీటిని కలిపి త్రాగిన అశుద్ధగంధక భస్మసేవనచే గలిగిన దోషములు హరించు. మఱియు లవంగములు వస వీటిని నేకముగ చూర్ణించి పుచ్చుకొనిన అశుద్ధగంధక భస్మసేవనచే జనించిన దోషములు తొలగు.

## శుద్ధ హింగుళ గుణము.

శ్లో॥ తిక్తం కషాయం కటుహింగుళం స్యాన్నేత్రామయఘ్నం కఫపిత్త
హారి । హృల్లాసకుష్ఠజ్వరకామిలాశ్చ ప్లీహామవాతౌ చ గదాన్ని
హంతి॥

తా॥ శుద్ధహింగుళ భస్మము చేదుగను వగరుగను కారముగనుండు మఱియు నిది నేత్రరోగము కఫము పిత్తము హృల్లాసరోగము కుష్ఠము జ్వరము కామిల ప్లీహము ఆమవాతము వీటిని నివర్తింపంజేయు.

## అశుద్ధ హింగుళ దోషము.

శ్లో॥ అశుద్ధో దరదః కుర్యాత్కుష్ఠం క్లైబ్యం క్లమం భ్రమం ।
మోహం చ శోధయేత్తస్మాత్సిద్ధైర్ద్రవ్యైర్హింగుళం ॥

తా॥ అశుద్ధ హింగుళ భస్మము కుష్ఠము నపుంసకత్వము శ్రమము భ్రమము మోహము వీటిని గలుగజేయుగాన దీనిని శుద్ధిజేయుట యత్యావశ్యకము.

## అశుద్ధ హింగుళ దోషశాంతి.

శ్లో॥ ఉత్పద్యంతే యదా వ్యాధిర్దరదస్యాపి సేవనాత్ ।
తదా సూతకవత్సర్వా కార్యా శాంతిః ప్రతిక్రియా ॥

తా॥ అశుద్ధ హింగుళ భస్మ సేవనచే గలిగిన దోషములకు అశుద్ధ రసభస్మ జన్య దోషములకు చెప్పబడిన శాంతిని జేసిన నవి నివర్తించు.

## పక్వ అభ్రకభస్మ గుణము.

శ్లో॥ మృతాభ్రకం కామబలప్రదం చ విషం మహచ్చాప్యథ శ్వాసభగందరా
ఖ్యం । మేహభ్రమఘ్నం పిత్తకఫం చ కాసం క్షయం నిహంత్యేవ యథా
నుపానాత్ ॥

తా॥ శుద్ధిజేసిన అభ్రకభస్మమును యుక్తానుపానముతో సేవించిన నది విషము వాతము శ్వాసము భగందరము మేహము భ్రమము పిత్తము కఫము కాసము క్షయము వీటిని నివర్తింపజేయుటయేగాక కామము బలము వీటిని నధికముగా గలుగజేయును.

## గ్రంథాంతరే.

శ్లో॥ శుద్ధాభ్రింసనువల్లకస్వయమితంకృష్ణామధుభ్యాంయుతం ।
మేహశ్వాసవిషంచకుష్ఠమతులంవాతాంశ్చపిత్తాన్ కఫాన్ ।
కాసక్షీణక్షతక్షయగ్రహణికాపాండుభ్రమాకామలం ।
గుల్మాన్యంచయథానుపానవిధినామృత్యుంచజీయతే ॥

తా॥ శుద్ధాభ్రకమును 6 గురిగింజల ప్రమాణముగల తేనెలో పిప్పలి చూర్ణముచేసి దానితో సేవించిన మేహము శ్వాస విషవికారము కుష్ఠురోగము వాత రోగములు పిత్తరోగములు కఫరోగములు కాస క్షీణత్వము గాయము క్షయరోగము గ్రహణి పాండువు భ్రమ కామిల గుల్మము యివి మొదలగురోగములు అకాల మృత్యువు వీటిని నశింపంజేయు.

## మతాంతరే.

శ్లో॥ వాతపిత్తకఫాన్మేహకుష్ఠశ్వాసవిషభ్రమాః ।
గుల్మకాసక్షతక్షీణగ్రహణీపాండుకామలాః ।
భగందరాదికాన్హంన్యాదభ్రంకామబలప్రదం ॥

తా॥ అభ్రకభస్మము వాతము పిత్తము కఫము ప్రమేహము కుష్ఠువు శ్వాస విషము భ్రమ గుల్మము కాస క్షతక్షయము గ్రహణీరోగము పాండువు కామిల భగందరము యివి మొదలగురోగములను నశింపం జేయుటయే గాక వీర్యవృద్ధి బలము వీటిని సగా కలుగంజేయు.

## అపక్వ అభ్రకభస్మ దోషము.

శ్లో॥ చంద్రికాసహితమభ్రకంయదాజీవితంఝడితినాశయత్యదా ।
వ్యాఘ్రరోమ యివ దోష రక్షితం వాతసం వితనుతే గదా
న్బహూన్ ॥

తా॥ తళుకుతో కూడియుండిన అభ్రకభస్మమును సేవించిన ప్రాణహానికలుగు. లేక, « పెద్దపులివెండ్రుక కడుపులోపోయిన అనేకరోగములను పుట్టించుచందంబున ” అనేకరోగములనైనను కలుగంజేయు.

శ్లో॥ స్తోకామ్లత్వకపుట్టస్తోకైరపక్వైరభ్రకస్తథా।
యథావ్యాఘ్రస్యరోమేవఎంచత్వముపజాయతే ॥

తా॥ మాత్రాప్రమాణ విహీనంబును పుటహీనంబునగు అశుద్ధాభ్రకము వ్యాఘ్ర రోమముతో సమానమైన ప్రాణహానిని గలుగంజేయును.

అపక్వాభ్రకదోష శాంతి.

శ్లో॥ ఉమాఫలంవనేపిష్ట్వా సేవయేద్యోదినత్రయం అశుద్ధాభ్రకదో షేణవిముక్తస్సుఖమేధతే॥

తా॥ ఉసిరికవలుపును వుదకముతోనూరి 3 దినములు సేవించిన అశుద్ధ అభ్రక భస్మసేవనవలన జనించిన వికారములు తొలగి సుఖముగనుండు

పక్వ హరితాళభస్మ గుణము.

శ్లో॥ అశీతివాతాన్కఫపిత్తరోగాన్ కుష్ఠంచమేహంచగుదామయాంశ్చ। నిహంతి గుంజార్ధమితంతుతాళం షడ్వల్లఖండేన సమంచయుక్తం॥

తా॥ అర (½) గురిగింజయెత్తు హరితాళభస్మమును 6 వల్లముల కలకండ చూర్ణమునుచేర్చి సేవించిన అశీతి వాతములు కఫము పిత్తరోగములు కుష్ఠువు మేహము గుదరోగము యివి నివర్తించు.

శ్లో॥ హంతివాతామయాన్సర్వాన్ కఫపిత్తగుదామయాన్ ।
హరితాళంమృతింకుష్ఠంప్రమేహాంశ్చ జ్వరాదికాన్ ॥

తా॥ హరితాళభస్మము 80 విధములగు వాతరోగములు పిత్తరోగములు కఫ రోగములు గుదరోగము కుష్ఠురోగము ప్రమేహరోగము జ్వరాదిరోగములు వీటిని హరింపంజేయు.

అపక్వ హరితాళభస్మ దోషము.

శ్లో॥ అశుద్ధతాళంఖలుపీతవర్ణంసధూమకంవాతచయంచపిత్తం ।
సంగుత్వకుష్ఠంతనుతేనరాణాం దేహస్యనాశంప్రకరోతిసద్యః ॥

తా॥ అశుద్ధహరితాళభస్మము వాతసమూహము పిత్తము వరిగుత్వము కుష్ఠువు వీటిని గలుగం జేయుటయేగాక శరీరమునకు పీతధూమవర్ణములు శీఘ్రముగ నాశనము వీటిని సగా గలుగంజేయు.

అపక్వ హరితాళభస్మదోష శాంతి.

శ్లో॥ అజాజీశర్కరాయుక్తంసేవయేద్యోదినత్రయం ।
వికృతీస్తాలజానాస్యాద్వ్యథాదారిద్ర్యముద్యమే ॥

తా॥ తెల్లజీలకఱ్ఱరసము శర్కరతో 3 దినములు సేవించిన « ఉద్యోగము దారిద్ర్యమును పోగొట్టుచందంబున '' అపక్వహరితాళ భస్మజనితదోషమును నివర్తింపంజేయు

శ్లో॥ దాడిమస్యఫలంపక్వంజలంతస్యపిబేన్నరః ।
పింగవికారశాంతిస్స్యాత్పాతకంగురువందనే॥

తా॥ చక్కని దానిమ్మపండు రసమును త్రాగిన అపక్వహరితాళక భస్మ సేవనచే గలిగినదోషములు « గురువందనముచేత పాతకములు నశించునట్లు '' నశించు.

శ్లో॥ జీరకంశర్కరాయుక్తం సేవయేద్దినసప్తకం ।
తాళవికారశాంతిస్స్యాద్దారిద్ర్యముద్యమేయథా ॥

తా॥ జీలకఱ్ఱ శర్కర వీటినిసమముగజేర్చి 7 దినములు పుచ్చుకొనిన « ఉద్యోగముచే దారిద్ర్యము తొలగుచందంబున '' అపక్వ హరితాళకభస్మము సేవించుటవలన గలిగినదోషములు నశించు.

శ్లో॥ కూష్మాండస్వరసందేయందుగాలభాంత్యైనచా ।
రాజహంసీరసంతాళవ్యాలవికృతిశాంతికృత్॥

తా॥ బూడిదగుమ్మడు దుద్దగొండివేళ్ళు రాజహంస వీటిరసమును సమముగ జేర్చి పానముచేసిన అపక్వ హరితాళం భస్మసేవనచే జనించిన దోషములునివర్తించు.

శ్లో॥ సువర్ణపుష్పభూనింబక్వాథంసేవేద్దినత్రయం ।
తాళవికారశాంతిస్స్యాత్కామశాంతిర్యథాస్త్రియః ॥

తా॥ నల్లపుమ్మెత్తపూలుగాని లేక త్రాకుడువేళ్ళు నేలవేము వీటిని సమభాగములుగాజేర్చి దంచి కషాయముబెట్టి త్రాగిన « సౌందర్యవతియగు స్త్రీసంగముచే కామము తృప్తిజెందు చందంబున '' అపక్వహరితాళక భస్మ సేవనవలన గలిగిన దోషములు హరించు.

శ్లో॥ యథారసవిషంహన్యాద్దోషద్ధేచగంధకం ।
ససితాసర్పాక్షీగస్తథాతాళవిషంరపుః ॥

తా॥ ఆవుపాలతో శుద్ధగంధక చూర్ణము నూరిచి దానిని సేవించిన పాదరస దోషంబును శర్కర సర్పాక్షీరసము వీటిని సమముగ జేర్చి పుచ్చుకొనిన అపక్వ హరితాళక భస్మసేవనచే గలిగిన దోషములు తొలగు.

పక్వ మనశ్శిల గుణము.

శ్లో॥ మనశ్శిలాసర్వరసాయనాఖ్యాతిక్తాకటూష్ణాకఫవాతహంత్రీ।
సత్వాత్మికాభూత విషాగ్నిమాంద్యం కండూంచకాసక్షయ
హారిణీచ॥

తా॥ మణిశిల భస్మము సర్వ రసాయనములతో సమానముగను చేదుగను కారముగను వుష్ణముగను సాత్వికముగను నుండు. మఱియు కఫము వాతము భూతబాధ విషము అగ్నిమాంద్యము దురద కాస క్షయ వీటిని నశింపంజేయు

శ్లో॥ జ్వరంనేత్రామయంశ్వాసంకాసంభూతభయంకఫం।
కృచ్ఛ్రింవిషంమనోగుష్టాహంతికుష్టాదికామయాన్॥

తా॥ శుద్ధ మణిశిలభస్మము జ్వరము నేత్రరోగము శ్వాస కాస భూతపీడ కఫరోగము మూత్రకృచ్ఛ్రము విషము కుష్టువు యివి మొదలగు రోగములను నశింపంజేయు.

అపక్వ మనశ్శిల దోషము.

శ్లో॥ మనశ్శిలా మందబలంకరోతిజంతూన్ధ్రువంశోధనమంతరేణ।
మలస్యబంధంకిలమూత్ర రోగంసశర్కరంకృచ్ఛ్ర గదంచకు
ర్యాత్॥

తా॥ పక్వముగాని మనశిలభస్మమును సేవించిన బలహీనత జంతురోగము మలబంధము సున్నపు సుద్దతో గూడియుండు మూత్రకృచ్ఛ్రము వీటిని గలుగంజేయు.

శ్లో॥ అశుద్ధాకునటీకుర్యాద్వాంతిర్భ్రాంత్యాదికాన్గదాన్॥

తా॥ శుద్ధిజేయని మనశ్శిలభస్మమును సేవించిన వాంతి భ్రాంతి యివి మొదలగు అనేక రోగములను గలుగంజేయు.

అశుద్ధ మనుశిలదోష శాంతి.

శ్లో॥ గోక్షీరంమాక్షికయుతంపిబతేయోదినత్రయం।
కునటీతస్యదేహేచవికారంనకరోతిహి॥

తా॥ అవుపాలతో తేనెనైచి 3 దినములు సేవించిన అశుద్ధ మనశ్శిలభస్మ సేవనచే జనించిన దోషము నివర్తియగు.

### శుద్ధ సౌవీరభస్మ గుణము.

శ్లో॥ సౌవీరంగ్రాహిమధురంచక్షుష్యంకఫవాతజిత్ ।
సిధ్మక్షయాస్రనుచ్ఛితంస్రోతోఞ్జనమపీదృశం ॥

తా॥ శుద్ధసౌవీరభస్మము గ్రాహకముగను (భేదికట్టుట) తియ్యగను నేత్రహిత కారిగను శీతలముగను నుండు. మఱియు కఫము వాతము సిధ్మరోగము క్షయ రక్త దోషము కండ్లనీరుగారుట వీటిని హరింపంజేయు

### అశుద్ధ సౌవీరభస్మ దోషము.

శ్లో॥ అశుద్ధసౌవీరాద్దేహేనేత్రేచభవంతిరోగాః ॥

తా॥ అశుద్ధ సౌవీరభస్మమును సేవించిన శరీరము నేత్రము వీటియందనేక రోగములను గలుగంజేయు.

### అశుద్ధ సౌవీరదోష శాంతి.

శ్లో॥ త్రిఫలాసేవనాద్భవతిసౌవీరజనితవికారాణాంశాంతిః॥

తా॥ త్రిఫలములను సేవించిన అశుద్ధ సౌవీరభస్మ జనితదోషములు నివర్తియగు.

### పక్వఖర్పరభస్మ గుణము.

శ్లో॥ త్రిదోషజిత్పిత్తకఫాతిసార క్షయజ్వర ఘ్నోరసకోతిరూక్షః ।
నేత్రామయానాంప్రకరోతినాశంశ్యాద్రంజకఃకామలనాశనశ్చ॥

తా॥ పక్వమైన ఖర్పరభస్మము రూక్షముగను మనోల్లాసకరముగను నుండు. మఱియు త్రిదోషములు పిత్తము కఫము అతిసారము క్షయ జ్వరము నేత్రరోగములు కామిల వీటిని నశింపంజేయు.

శ్లో॥ రసకోహరతేరోగాన్రక్తదోషంగుదామయం ।
జీర్ణజ్వరమతీసారంప్రదరాదిగదానపి॥

తా॥ శుద్ధిజేసిన ఖర్పరభస్మము రక్తదోషము గుదరోగము జీర్ణజ్వరము అతిసారము ప్రదరరోగము యివి మొదలైన యనేకరోగముల నశింపంజేయు.

## అపక్వ ఖర్పరభస్మ దోషము.

శ్లో॥ అశుద్ధఃఖర్పరఃకుర్యాద్వాంతింభ్రాంతింవిశేషతః ।
తస్మాద్విశోధ్యప్రయత్నేనయావద్వాంతివివర్జితః ॥

తా॥ అశుద్ధ ఖర్పరభస్మము వాంతి భ్రాంతి వీటిని గలుగంజేయు. గానయిట్టి గుణములు గలుగక యుండునటుల శుద్ధిజేయందగు.

## అశుద్ధ ఖర్పరభస్మదోష శాంతి.

శ్లో॥ రసకనిషేవణాద్యేయదిరోగాఃప్రాదుర్భవంతిమనుజానాం ।
తేనాశమాప్నువంతిపీతంగోమూత్రపానతఃసప్తాహం ॥

తా॥ గోమూత్రమును 7 దినములు పానముజేసిన అశుద్ధ ఖర్పర భస్మజనిత రోగములు నివర్తించు.

## పక్వ వజ్రభస్మ గుణము.

శ్లో॥ ఆయుఃప్రదంసద్గుణదంచవృష్యం దోషత్రయప్రశమనంసకలా
మయఘ్నంసూతేంద్ర బంధవధసద్గుణదంప్రదీప్తం మృత్యుం
జయోత్తదమృతోపమమేవవజ్రం॥

తా॥ శుద్ధవజ్రభస్మము ఆయుస్సు సద్గుణము వీర్యపుష్టి శరీరకాంతి వీటిని గలుగం జేయుటయేగాక అమృత తుల్యముగనుండు మరియు త్రిదోషములు సమస్త రోగములు అపమృత్యువు వీటిని బోగొట్టును. ఇది కట్టబడిన రసము మారితమైనరసము దీనితోసమానమైన గుణముమ గలుగంజేయు

## అశుద్ధాఽపక్వ వజ్రభస్మదోషము.

శ్లో॥ పీడాంవిధత్తేవివిధాంనరాణాం కుష్ఠంక్షయం పాండుగదంచదు
ష్టం । హృత్పార్శ్వపీడాంకురుతేఽతిదుస్సహాంమశుద్ధవజ్రం గురు
మాత్మహంత్యజేత్ ॥

తా॥ అశుద్ధపక్వ వజ్రభస్మము శరీరమునకు నానావిధములైన బాధలు కుష్టము క్షయము దుష్టమగు పాండురోగము హృద్రోగము పార్శ్వపీడ సహించగూడని రొమ్మునొప్పి పార్శ్వనొప్పి ఆత్మహత్య వీటిని గలుగంజేయుగాన దీనిని సేవించ వలదు.

అశుద్ధాఽపక్వ వజ్రభస్మదోష శాంతి.

శ్లో॥ సితామధుఘృతైస్సాకంగోదుగ్ధందినసప్తకం।
విధినాసేవితంహంతివజ్రదోషంచిరోత్థితం॥

తా॥ పాలయందు చక్కెర తేనె నెయ్యి వీటిని జేర్చి 7 దినములు విధిపూర్వకముగ సేవించిన బహుకాలమునుండి గలిగియుండిన అశుద్ధాపక్వ వజ్రభస్మ సేవనచే గలిగిన దోషము నివర్తించు.

పక్వ వైక్రాంతభస్మ గుణము.

శ్లో॥ వైక్రాంతోవజ్రసదృశోదేహంలోహంకరోతిహి ।
విషఘ్నోరసరాజస్యజ్వరకుష్ఠక్షయప్రణుత్॥

తా॥ శుద్ధవైక్రాంత భస్మము వజ్రభస్మముతో సమానమైనగుణము గలిగియుండు. శరీరమును యినుమువలె దృఢముగజేయు మఱియునిది అశుద్ధ రసభస్మ దోషము జ్వరము కుష్ఠము క్షయము వీటిని నివర్తింపజేయు.

అపక్వ వైక్రాంతభస్మ దోషము.

వాక్యం॥ అశుద్ధవైక్రాంతోవజ్రవద్దోషకర్తాభవతి॥

తా॥ అశుద్ధ వైక్రాంతభస్మము అశుద్ధ వజ్రమునకుగల దోషములను గలుగంజేయు.

అశుద్ధాఽపక్వ వైక్రాంతభస్మదోష శాంతి.

వాక్యం॥ అశుద్ధవైక్రాంతభస్మశాంతిర్వజ్రవజ్జ్ఞేయా॥

తా॥ అశుద్ధాపక్వ వైక్రాంతభస్మ దోషమునకు అశుద్ధా పక్వవజ్రభస్మ దోషమునకు జెప్పియుండు శాంతిని జేయందగు.

పక్వ ప్రవాళభస్మ గుణము.

శ్లో॥ ప్రవాళంమధురంసామ్లంకఫపిత్తాదిదోషనుత్ ।
వీర్యకాంతికరంస్త్రీణాంధృతేమంగళదాయకం॥
క్షయపిత్తాస్రకాసఘ్నందీపనంపాచనంలఘు।
విషభూతాదిశమనంవిద్రుమంనేత్రరోగహృత్॥

తా॥ పక్వమగు ప్రవాళభస్మము తీపుగను పుల్లగను చులకనగను నుండు. మఱియు వీర్యవృద్ధి శరీరకాంతి దీనిని ధరించిన స్త్రీలకు మంగళము అగ్నిదీపనము జీర్ణము వీటిని గలుగంజేయు, మఱియు నిది కఫము పిత్తము క్షయ రక్తపిత్తము కాసము విషము భూతాదిదోషము నేత్రరోగము వీటిని నివర్తింపంజేయు.

అపక్వ ప్రవాళభస్మ దోషము.

వాక్యం॥ అశుద్ధప్రవాళభక్షణాద్బవంతిరోగాహ్యనేకే॥

తా॥ అశుద్ధ ప్రవాళ భస్మమును సేవించిన అనేకరోగములు గలుగు.

అశుద్ధ ప్రవాళభస్మదోష శాంతి.

వాక్యం॥ అశుద్ధప్రవాళముక్తకయోరపివికారశాంతిర్వజ్రవజ్ఞేయా॥

తా॥ అశుద్ధ ప్రవాళ భస్మసేవనచే జనించిన దోషములకు వజ్రభస్మ దోషమునకు జెప్పంబడిన శాంతిని జేయందగు

ముక్తకాదిదోష శాంతి.

శ్లో॥ ఘృతంమధుసితాయుక్తంగోదుగ్ధేనసమంపిబేత్ ।
తస్యముక్తప్రవాళస్యహీరకస్యవిషంహరేత్ ॥

తా॥ నెయ్యి తేనె కలకండ ఆవుపాలు వీటిని సమభాగములుగ చేర్చి పుచ్చుకొనిన అశుద్ధమగు ముత్యములు పగడములు వజ్రములు మొదలగువాని భస్మసేవనచే జనించిన దోషములు మానును.

వజ్రమందారయోర్దోష శాంతి.

శ్లో॥ శీతవారిసితాయుక్తంపానంవజ్రీవిషాపహం ।
వస్త్రవాయుస్తథాకార్యశ్శీతచ్ఛాయాంచసేవయేత్ ॥

తా॥ చల్లనివుదకములో కలకండ చూర్ణమునువైచి పుచ్చుకొనినను వస్త్రముచే వచ్చెడిగాలిని సేవించినను చల్లని నీడయందుండినను బొంతజెముడుపాలు తీగజముడు పాలు జిల్లేడుపాలు వీటి సేవననలన జనించిన దోషము మానును

విషముష్టివిత్తులదోష శాంతి.

శ్లో॥ ఘృతంమధుసితాయుక్తంసదాపిబతియోనరః ।
విషకోచవికారస్యశాంతిస్తత్ప్రజాయతే ॥

తా॥ నెయ్యి తేనె ఖండశర్కర నీటిని నేకముగజేర్చి ప్రాతస్సాయంకాలములయందు సేవించిన నివతుష్టివిత్తుల భక్షణచే జనించినదోషము మానును.

అశుద్ధ భల్లాతకదోష శాంతి.

శ్లో॥ సితయాసహయామాచ్ఛమేఘనాదరసస్యచ।
తస్మాత్స్యాద్భల్లవిషంహంతియథాలింగప్రసేవనాత్॥

తా॥ జీడిగింజల సేవనచే జనించిన దోషము చిర్రికూర రసములో ఖండశర్కర కలిపి పుచ్చుకొనిన లింగారాధనచే పాతకంబులు తొలంగు చందంబున 1 యామములో నివర్తించు.

అశుద్ధ కర్పూరదోష శాంతి.

శ్లో॥ ధాన్యాకంసితయాయుక్తంవారిమర్దితపానతః।
కర్పూరస్యనివృత్తిస్స్యాన్మహిషీశకృతంస్తథా॥

తా॥ కర్పూరసేవనచేజనించిన దోషము ధనియాలు వుదకముచేనూరి ఖండశర్కరవైచి పానముజేసిన లేక గేదెపేడరసము పుచ్చుకొనినను శాంతియగు.

అశుద్ధగురుగింజలదోష శాంతి.

శ్లో॥ మేఘనాదరసోగ్రాహ్యంశర్కరాయుక్తపానతః।
ఉచ్చటాయావికారస్యశాంతిస్స్యాద్దుగ్ధసేవనాత్॥

తా॥ గురిగింజ సేవనచే జనించినదోషము చిర్రికూర రసములో ఖండశర్కర కలిపి పుచ్చుకొనినను లేక ఆవుపాలు పానముజేసినను శాంతినిజెందు.

అశుద్ధ గన్నేరువిషదోష శాంతి.

శ్లో॥ సితాయుక్తంసదానేయందధిహామహిషంపయః।
తథాచార్కత్వచాపీతంకరవీరవిషాపహం॥

తా॥ గన్నేరు సేవనచే జనించినదోషము ఖండశర్కర చూర్ణము పెరుగులో వైచి పానముజేసినను లేక గేదెపాలలో జిల్లేడువేరుపట్ట చూర్ణమువైచి పుచ్చుకొనినను నివర్తియగు.

అశుద్ధ నేపాళగింజలదోష శాంతి.

శ్లో॥ ధాన్యాకంసితయాయుక్తందధినాసహాయఃపిబేత్।
దంతిబీజవికారస్యనివృత్తిస్తస్యజాయతే॥

తా॥ సేపాళగింజల సేవనచే జనించినదోషము ధనియాలు కలకండ వీటిని పొడిచేసి పెరుగులోవైచి త్రాగిన శాంతినిజేయు.

అశుద్ధ నవాసాగరదోష శాంతి.

శ్లో॥ గర్దభస్యవిశంభక్షే త్రద్ధై నవనాగరం ।
మృత్తికాగైరికాసీమకాంచత్రుట్యంచశాంతికృత్ ॥

తా॥ నవాసాగరము సేవనచే జనించినదోషము గాడిద పెంటికలరసమును త్రాగిన తొలుగుటయగాక మట్టి కావిరాయి అన్నభేది వీటిని సేవించిన వానివలన జనించినదోషములు సగామానును

శీతలా దాహదోష శాంతి.

శ్లో॥ మధూదకయుతంపీతంశీతలందాహనాశనం ।
నీలికాంచఘృతేపిష్ట్వాదేహలేపేచశాంతికృత్ ॥

తా॥ శీతలాదాహముచే జనించినదోషము తేనెను వుదకములోవైచి పానము జేసినను లేక నీలియాకులో నెయ్యివైచి నూరి శరీరమునకు లేపనము చేసికొనినను నివర్తించు

అశుద్ధ వత్సనాభిదోష శాంతి.

శ్లో॥ పటూశనస్యవృక్షస్యరసఃపలప్రమాణతః।
శర్కరాయుక్తపానేనవత్సనాగవిషంహరేత్ ॥

తా॥ వత్సనాభి సేవనచే జనించిన దోషము పలప్రమాణము పటూళసవృక్ష రసములో శర్కరవైచి సేవించిన నివృత్తియగు.

అశుద్ధ ఖదరదోష శాంతి.

శ్లో॥ ఖదిరోత్థంగోపయసాసితాయుక్తంతత్రైవచా ।
యస్సేవయేద్వామమేకంభల్లవికృతిశాంతికృత్ ॥

తా॥ చంద్రసేవచే జనించినదోషము ఆవుపాలలో ఖండశర్కర మూర్ణమువైచి పానముజేసిన 1 ఝామములో నివర్తించుటయు గాక జీడిగింజలచే జనించినదోషము సగా నివర్తియగు.

దుష్టవాత జాదిరోగదోష శాంతి.

శ్లో॥ దుష్టవాతోరసేన్యాప్తేనాకరోకప్రజాయతే ।
చించామ్లకసితాక్షౌద్రాన్ దాపయేత్పూర్వకర్మలే ॥

తా॥ వాయువు సూర్యతాపముచే దుష్టమగుటంజేసి లూకరోగము జనించు. అదిశాంతి జెందుటకై చింతపండు నెల్లికాయులరసము ఖండశర్కర తేనె వీటిని ప్రత్యేక ప్రత్యేకముగా వుదకములో కలిపి పానముచేయవలయు.

భ్రమరమాక్షిక విషదోష శాంతి.

శ్లో॥ మహిషీనవనీతంచటంకణైస్సహామర్దయేత్ ।
మాక్షికభ్రామరస్యాంతంనాశుఫేనేచతత్సమం ॥

తా॥ తుమ్మెదలు అడవియీగలు వీటి విషదోషమువకు యెనుముపెన్న వెలిగారము వీటిని సమభాగముగ గ్రహించి మర్దించి శరీరమునకు లేపనము జేసికొనిన మానుటయేగాక నల్లమందుచే జనించిన వికారము నగామానును.

జంగము విషదోష శాంతి.

శ్లో॥ వంధ్యాకర్కోటికామూలంఛాగమూత్రేణభావితం ।
నస్యంకాంజికసంపిష్టంవిషోపహాతచేతసాం ॥

తా॥ గొడ్డుబీరతీగెను మేకమూత్రముతో మర్దించి అందులో పుల్లనికలిచేర్చి నస్యముచేసిన జంగమ విషదోషము నివర్తించు.

కోద్రవ ధాన్యదోష శాంతి.

శ్లో॥ కోద్రవాణాంభవేన్మూర్ఛాదేయంక్షీరంసుశీతలం ।
సగుడఃకూశ్మాండకరసోహంతిమద్యంసకోద్రవం ॥

తా॥ అరికెఅన్నమును భుజించినందున మూర్ఛగలిగెనేని ఆవుపాలతోగాని బూడిదె గుమ్మడికాయరసములో బెల్లమును కలిపిగాని పుచ్చుకొనిన కోద్రవధాన్య భక్షణచే గలిగిన వికారము మానును

నాగఫేన విషదోష శాంతి.

శ్లో॥ బృహత్యుద్రాంసందుగ్ధంపలమాత్రంనిషేవణాత్ ।
నాగఫేనంవిషంయాతిసజీవతిచిరంపుమాన్॥

తా॥ నాదఫేన భక్షణచే జనించిన దోషము వాకుడురసము ఆవుపాలలో కలిపి యందొక పలమువంతున సేవించిన నివర్తించుటయుగాక చిరకాలము జీవించు.

మూషికా ద్యల్పజంతు విషదోష శాంతి.

శ్లో॥ భల్లాతార్కపలంముస్తాశిపికచ్ఛపలంతథా ।
రాలసిద్ధార్థపత్రేషాంచూర్ణధూపప్రభావతః ॥
మూషకాముశకామత్కుణావిషకీటకాః ।
పలాయంతేగృహంముక్త్వాయుద్ధాయుద్ధేతికాతరాః ॥

తా॥ ఎలుకలు దోమలు యీగలు నల్లులు విషజంతువులు యివి నశించుటకై జీడిగింజలు జిల్లేడుకాయలు తుంగముస్తెలు లీటకోవెల కాయలు యాతుభూదము తెల్ల ఆవాలు వీటిని చూర్ణముచేసి గృహములో ధూపమిడిన «యోద్ధనువ భయమునుజెంది బరుగిడువాని చందంబున'' యివి పలాయనంబులగు.

సంష్ట్రి విషదోష శాంతి.

శ్లో॥ త్రిఫలాచందనంకుష్ఠమార్ద్రకంఘృతసంయుతం ।
పానలేపసమాయోగోదంష్ట్రిస్యవిషనాశనః ॥

తా॥ తేనెటీగల విషముచే జనించిన దోషము త్రిఫలములు శ్రీగంధము కోష్ఠు అల్లము వీటిని చూర్ణముకేసి నేతిలోకలిపి పానలేపనములు జేసిన హరించు.

ఉమ్మెత్తవిత్తుల విషదోష శాంతి.

శ్లో॥ వృంతాకఫలబీజస్యరసోద్విపలమాత్రయా ।
భక్షణాద్భక్తధుత్తూరవిషంనశ్యతినిశ్చితం ॥

తా॥ ఉమ్మెత్తవిత్తుల భక్షణచే జనించిన దోషము వాకుడు విత్తులను వృదకము పైచినూరి రసముదీసి యందు 4 పలములు సేవించిన హరించు.

వృశ్చిక విషదోష శాంతి.

శ్లో॥ హింగుశ్చార్కపయోఘృష్టోదేయోపరిచదాపయేత్ ।
వృశ్చికస్యవిషంహంతిరజనీంసూర్యపతిర్యథా ॥

తా॥ వృశ్చిక విషదోషము యింగువ జిల్లేడుపాలు వీటిని సమముగనూరి వృశ్చికదష్టమైనచోట పదేపదే లేపము జేయుచుండినది «సూర్యోదయమౌదుటచే అంధకారము తొలగుభంగి'' తొలగు.

మృగాంక విషదోష శాంతి.

శ్లో॥ గవాంఘృతంసితాయుక్తంమృగాంకస్యచశాంతికృత్ ।
తద్వనచామ్లకరసస్సద్యోవిక్రుతిశాంతికృత్ ॥

తా॥ కస్తూరి సేవనచే జనించినదోషము శర్కరలో ఆవునెయ్యికలిపి సేవించినను లేక పుటికారాయిలరసము త్రాగినను నివర్తించును.

తుమ్మెదలకాటుచే జనించుదోషమునకు శాంతి.

శ్లో॥ గోదధిశుంఠిసంయుక్తం పానంభృంగీవికారనుత్ ।
శిఫన్నవంశజంతద్వజ్జలేపిష్ట్వాపిబేన్నరః॥

తా॥ తుమ్మెదలకాటుచే జనించినదోషము శొంఠిలో ఆవుపెరుగుకైచి నూరి ఆపెరుగులోనే కలిపి పానముజేసినను లేక సోపు పసపు వీటిని పుదకముపైచి నూరి ఆ పుదకానుపానములో సేవించినను నశించు.

సర్పాది విషదోష శాంతి.

శ్లో॥ గోజిహ్వాఫలిసీశక్రవారుణీవాత్రిపర్ణికా ।
ఏకైకాపానమాత్రేణసర్పాదిగరళంహరేత్ ॥

తా॥ సర్పాది విషదోషము యెద్దునాలుకచెట్టు తరిగోట్టుచెట్టు అగసి పెక్కుడుతీగ వీటిలో యేరసముకైనను పానముజేసిన తొలుగు.

పోకలు మొదలగువానిదోష శాంతి.

శ్లో॥ పూగీఫలంజడేశీతవస్త్రవాతోహితంభవేత్ ।
శర్కరాభక్షణాదేయామధువాశర్కరాన్వితం ॥

తా॥ వక్కలను భక్షించుటచే కలిగెడుదోషము (సొక్కు) చల్లనినీటియందు వస్త్రముతడిపి నావస్త్రముయొక్క గాలిసేవించినను లేక శర్కర లేక శర్కర నెయ్యి కలిపి సేవించిన నివర్తించు.

శ్వాన విషదోష శాంతి.

శ్లో॥ శ్వానస్యాపవిషంహంతిలేపంకుక్కుటవిష్ఠయా ।
గుడైస్తైలార్కదుగ్ధైశ్చలేపశ్వానవిషంహరేత్ ॥

తా॥ కుక్కకరచిన దోషము కోడిమలముకైనను లేక బెల్లము నువ్వులనూనె జిల్లేడుపాలు వీటిని నేకముగ కలిపి పైనను లేపనము చేయుచుండిన నివర్తించును.

సింహ బాలవిషదోష శాంతి.

శ్లో॥ మధ్వోష్ణజలమానతుందినంవింశతియఃపిబేత్ ।
తస్యసింహస్యబాలస్యవిషస్యాత్కదాచన ॥

తా॥ సింహాదుల విషదోషము (వ్యాఘ్రాదుల జంతువిషము) పూటకుడలము చొప్పన 20 పది దివసంబులు తేనెను పానముచేసిన తొలుగు.

శరట విషదోష శాంతి.

శ్లో॥ అర్కమూలవచాచూర్ణంపీతంశీతేనవారిణా ।
తస్యశరటవిషంసద్యశ్శాంతిర్భవతినిశ్చితం ॥

తా॥ తొండకాటుచే జనించిన విషదోషము జిల్లేడువేరు వస వీటిని చూర్ణము జేసి శీతోదకములో పైచి పానముచేసిన హరించు.

యూకాదిదంశన విషదోష శాంతి.

శ్లో॥ శ్రీమూలంగోజలేఘృష్ట్వాదేహలేపంచకారయేత్ ।
యూకాచలిక్షకావానాశయంత్యపితత్క్షణాత్ ॥

తా॥ గోమూత్రముచే మారేడువేరును గంధముతీసి శరీరమునకు లేపనము జేసికొనిన పేనులు యీరులు చీలపేనులు మొదలగునవి తత్క్షణమే నివర్తించు.

దుష్టజంతు విషదోష శాంతి.

శ్లో॥ విశంక్రౌంచంజలేఘృష్టానిత్యంపిబతియోనరః।
తస్యోదరేదుష్టజంతోర్విషంనస్యతితత్క్షణాత్ ॥

తా॥ క్రౌంచ పక్షిమలమును జలముచేనూరి ప్రతిదినము పానము జేయుచుండిన నట్టిమనుజుని దుష్టజంతువులు కరచినను అట్టిజంతువుల విషము అతిశీఘ్రముగ నశించు.

గృహగోధికా విషదోష శాంతి.

శ్లో॥ కటుత్రయంసింధుకరంజబీజంద్వయంనిశాయాఃకపికచ్ఛుబీజం।
నిహంతిపానేనవిలేపనేనవిషంసమస్తంగృహగోధికాయాః ॥

తా॥ బల్లిమొదలగువాని విషదోషములు శొంఠి పిప్పలి మిరియాలు సైంధవలవణము కానుగవిత్తులు పసపు మానిపసపు దురదగొండి విత్తులు వీటిని వుదకముతో నూరి త్రాగినను లేక లేపనము జేసికొనినను నివర్తించు.

చెవులయందుప్రవేశించిన జోరీగవికార శాంతి.

శ్లో॥ కర్ణప్రవేశేఖర్జూరతత్కర్ణేమూత్రకంక్షిపేత్।
తథాచతిలతైలంచధంకేవత్సస్యశల్యకం ॥

తా॥ చెవులయందు ప్రవేశించిన జోరీగల విషదోషము గోమూత్రము తిలతైలము వీటిని కలిపి కొంచము వెచ్చజేసియైనను లేక ఆవుదూడ పేడరసమైనను చెవులలో వేయుచుండిన నివర్తియగు.

శ్వేతమూషకకృత గ్రంథిదోష శాంతి.

శ్లో॥ ఊర్ధ్వాత్ప్రపతితంమూషం శ్వేతవర్ణంసుదారుణం ।
పాతస్థానేభవేద్గ్రంథిస్సగ్రంథిశ్శ్రమదాయకః ।
శస్త్రేణగ్రంథింవిస్ఫోట్యఖరస్యశకృతంక్షిపేత్ ।
తేనదుష్టస్యగ్రంథేశ్చవికృతేశాంతికృద్భవేత్ ॥

తా॥ అతిదుష్టమగు శ్వేతమూషకము ఊర్ధ్వంబుగనుండి శరీరముమీద పడెనేని నచట గ్రంథులుజనించి మరణముగలుగు ; గనుక గ్రంథులు జనించినతోడనే నదట శస్త్రముచే కొంచముగీచి గాడిదపెంటికలను లేపనముజేసిన నాగ్రంథులు శమించు.

భ్రమరకృత జలోదరదోష శాంతి.

శ్లో॥ షట్పాదేచోదరేప్రాప్తేజలోదరఃప్రజాయతే ।
తస్యశుక్పిప్పలీదేయావికృతేశాంతికృత్సదా ॥

తా॥ కడుపులో తుమ్మెద ప్రవేశించుటచే జలోదరరోగము జనించు. దానికి పిప్పళ్లను సేవింపుచుండిన నాదోషము నివర్తియగు.

సర్వవిషములదోష శాంతి.

శ్లో॥ తైలంచామ్లంతథానిద్రాంవర్జయేద్విషపీడితః ।
తండులంఘృతదుగ్ధంచశ్రేష్ఠంపథ్యంవిషాతురే ॥

తా॥ విషపీడితులు మంచినూనె పులుసు నిద్ర మొదలగువాటిని వర్జించి బియ్యపుఅన్నము నెయ్యి పాలు వీటిని అనుపానములుగ సేవింపుచుండిన హితముగ నుండును.

గద్య॥ ఇతి శ్రీమదాంధ్ర భాషానువాద భూషితే, అనుపానరత్నాకరే
సువర్ణాదీనాంసర్వ పక్వభస్మనాం గుణదోష తచ్ఛాంతి విశేష
కథనన్నామ షష్ఠస్తరంగః.

శ్రీరస్తు.

# అనుపానరత్నాకరము.

## ఆంధ్రతాత్పర్యము.

### సప్తమస్తరంగము.

### యోగరాజగుగ్గులు.

శ్లో॥ నాగరంపిప్పలీచవ్యంపిప్పలీమూలచిత్రకైః । భ్రిష్టంహింగ్వజమోదంచసర్షపాజీరకద్వయం ॥ రేణుకేంద్రయవాఃపాఠా విడంగంగజపిప్పలీ।కటుకాతివిషాభార్గీవచామూర్వేతిభాగతః । ప్రత్యేకంశాణికానిస్యుర్ద్రవ్యాణీమానివింశతిః।ద్రవ్యేభ్యస్సకలేభ్యశ్చత్రిఫలాద్విగుణాభవేత్ । ఏభిశ్చూర్ణీకృతైస్సర్వైస్సమోదేయస్తుగుగ్గులుః । వంగంరౌప్యంచనాగంచలోహసారం తథాభ్రికం । మండూరంరససిందూరంప్రత్యేకంపలసమ్మితం। గుడపాకసమంకృత్వాఇమందద్యాద్యథోచితం।ఏకపిండంతతః కృత్వాధారయేద్ఘృతభాజనే । గుటికాశ్శాణమాత్రాస్తుకృత్వాగ్రాహ్యాయథోచితాః। గుగ్గులుర్యోగరాజోయంత్రిదోషఘ్నోరసాయనః । మైథునాహారపానానాంత్యాగోనైవాత్ర విద్యతే । సర్వాన్వాతామయాన్కుష్ఠానర్శాంసిగ్రహణీగదం। ప్రమేహంవాతరక్తంచనాభిశూలంభగందరం। ఉదావర్తంక్షయంగుల్మమపస్మారమురోగ్రహం । మందాగ్నిశ్వాసకాసాంశ్చనాశయేదరుచింతథా । రేతోదోషహరఃపుంసాంరజోదోషహరస్త్రియాం । పుంసామపత్యజనకోవంధ్యానాంగర్భదస్తథా॥

తా॥ శొంఠి పిప్పళ్ళు చవ్యము మోడి చిత్రమూలము వేయించిన యింగువ అజామోదము తెల్లఆవాలు జీలకఱ్ఱ సహజీర రేణుకలు కొడిశవిత్తులు అగరుశొంఠి వాయువిడంగములు గజపిప్పలి కటుకరోహిణి అతివస గంటుభారంగి వస చాగమట్ట యివి ప్రత్యేక ప్రత్యేకముగ కాణప్రమాణము త్రిఫలములు 40 కాణములు యిటుల వీటినన్నిటిని చూర్ణించి యిందుకు సమానముగ * శుద్ధిజేయబడిన గుగ్గులమును మెత్తగ నూరి బెల్లమువలె పలచనగ పాకుబెట్టి అందు పైచూర్ణమునుజేర్చి బాగుగ కలియబెట్టి అందు వంగభస్మము రౌప్యభస్మము నాగభస్మము లోహభస్మము అభ్రకభస్మము మండూరభస్మము రససిందూరము వీటినన్నిటిని ప్రత్యేకముగ 1 పలముచొప్పునవైచి బాగుగ కలియ బెట్టి కాణప్రమాణముగ గుటికలుజేసి వాటిని నెయ్యివాడిన కుండయం దునిచి యందొకమాత్రను పుచ్చుకొనిన త్రిదోషములు సమస్త వాతరోగములు కుష్ఠువులు మూలవ్యాధులు సంగ్రహణులు ప్రమేహములు వాతరక్తము నాభిశూలభగం దరము వుదావర్తము క్షయరోగము గుల్మములు అపస్మారము వురోగ్రహరోగము అగ్నిమాంద్యము శ్వాసకాసలు అరుచి శుక్లధాతుగతదోషములు రజోగతదోషములు యివియన్నియు నశించు. ఇది యోగరాజ గుగ్గుల రసాయనమని జెప్పంబడు. దీనిని మైధునాహార పానాదిపథ్యంబులు లేకనే సేవింపవలయు; మఱియు నీయోగరాజ గుగ్గులమును సేవించెడి పురుషులకు పుత్రోత్పాదశక్తి స్త్రీలవంధ్యాకు గర్భదారణశక్తి యివి గలుగు.

## నారాయణచూర్ణ విధి.

శ్లో॥ చిత్రకత్రిఫలావ్యోషం జీరకంహావుషావచా । యవానీపిప్పలీ
మూలంశతపుష్పాజగంధికా । అజమోదాశరీధాన్యంవిడంగం
స్థూలజీరకం। హేమాహ్వపౌష్కరంమూలంశౌరోలవణపం
చకం । కుష్ఠంచేతిసమాంశానివిశాలాస్యాద్విభాగికా । త్రివృ
త్త్రిభాగావిజ్ఞేయాదన్త్యాభాగత్రయంభవేత్ । చతుర్భాగాసా
తలాహ్యేత్సర్వాణ్యేకత్రచూర్ణయేత్ । పాచనస్నేహనాద్యై
శ్చస్నిగ్ధకోష్ఠస్యరోగిణః । దద్యాచ్చూర్ణంవిరేకాయసర్వశూ
లప్రణాశనం । హృద్రోగేపాండురోగేచకాసేశ్వాసేభగందరే।
మందాగ్నౌచజ్వరేకుష్ఠేగ్రహణ్యాంచగలగ్రహే ॥

---

* గుగ్గులమును, దశమూల కషాయముతోనైనను లేక త్రిఫలకషాయముతోనైనను శుద్ధిజేయవలయు.

తా॥ చిత్రమూలము కరక తాండ్ర యునిరికలు శొంఠి మిరియాలు పిప్పళ్ళు జీలకఱ్ఱ బోడతరము వస వోమము కోడి పెద్దసోపు అడవితులసి అజామోదము కచోర్చరములు ధనియాలు వాయువిడంగములు పెద్దజీలకఱ్ఱ వృశ్చికాస్త్రి పుష్కరమూలము సద్యక్షారము యవక్షారము సైంధవలవణము సౌవర్చలవణము బిడాలవణము సముద్రలవణము సాంబరలవణము చంగల్వకోష్టు యివి దినుసు కొక్కొకభాగము పెద్ద పాపరవేళ్ళు 2 భాగములు తెగడ 3 భాగములు నేపాళపువేళ్లు 8 భాగములు నంజరేణు 4 భాగములు యిటుల వీటినన్నిటినిదంచి చూర్ణించి దీనిని రోగికిచ్చుటకు ముందు, పాచనస్నేహ రేచనాదులచే వానియుదరము శుద్ధియగునటులంజేసి పిదప నీచూర్ణమును యుక్తానుపానములతో నొసంగిన హృద్రోగము పాండురోగము శ్వాస కాసలు భగందరము అగ్నిమాంద్యము జ్వరము కుష్ఠువు సంగ్రహణి గళగ్రహము మొదలగు సర్వరోగంబులు నశించు.

## మృత్యుంజయరస నిర్మాణ విధి.

శ్లో॥ విషస్యైకంతథాభాగంమరీచంపిప్పలీంకణాం । గంధకస్యతథా
భాగంభాగంస్యాట్టంకణస్యచ । సర్వత్రసమభాగంస్యాద్వింగు
ళస్తుద్విభాగకం । మూర్ణయేత్ఖల్వమధ్యేతుముద్గమానాంవటీం
చరేత్ । జంబీరస్యరసేనాత్రకార్చ్యంహింగుళశోధనం । రస
శ్చైత్సమభాగస్యాద్విగుళంనేష్యతేతథా। గోమూత్రశోధితం
చాత్రవిషస్సైరవిశోధితం । మృత్యురూపం జ్వరంహంతిమృ
త్యుంజయరసస్సృతిః।తీవ్రజ్వరేమహాఘోరేపురుషేయావ
నాన్వితే । పూర్ణమాత్రా ప్రదాతవ్యా విచారీచభిషగ్వరైః ।
స్త్రీబాలవృద్ధక్షీణేషువ్యార్ధమాత్రాప్రకీర్తితా । అతివృద్ధేచక్షీ
ణేచశిశౌచాల్పవయస్యపి । తూర్యమాత్రాప్రదాతవ్యావ్యవ
స్థానారనిశ్చితా । నవజ్వరేమహాఘోరేయామైకానాశయే
ద్ధృవం।మధ్యజ్వరేతథాజీర్ణేత్రిర్యామాన్నాశయేద్ధ్రువం। సప్తా
హాత్సన్నిపాతోత్థంజ్వరంజీర్ణకసంజ్ఞకం॥

తా॥ గోమూత్రములో శుద్ధిచేసినవచనాభి 1 భాగము మిరియాలు 1 భాగము పిప్పలి 1 భాగము జీలకఱ్ఱ 1 భాగము గంధకము 1 భాగము వెలిగారము 1 భాగము నిమ్మరసములో శుద్ధిచేసిన * యింగిలీకము 2 భాగములు వీటినన్నిటిని ఖల్వమునం దుంచి నిమ్మపండ్ల రసముతో నూరి పెసర గింజంతమాత్రలు చేసి సేవించిన మృత్యు భీషణమగు జ్వరమును బోగొట్టుగాన మృత్యుంజయ రసమనంబడు. మఱియు యౌవన పురుషులకు ఘోరమైన తీవ్రజ్వరమునందు 1 మాత్ర యివ్వవలయు. మఱియు స్త్రీలు బాలురు వృద్ధులు క్షీణత్వమును జెందినవారు వీరలకు ½ మాత్ర యివ్వవలయు. అతి వృద్ధులు అతిక్షీణులు శిశువులు వీరలకు 1 మాత్రలో నాలుగోభాగ మివ్వవలయు. మహాఘోరమగు నవజ్వరమునందు సేవించిన నది 1 యామమునకు నివర్తించు. మధ్య జ్వరము జీర్ణజ్వరము వీటియందు సేవించిన 3 దినములలో నశించు. సన్నిపాతమువలన గలిగిన జీర్ణజ్వరమునందు సేవించిన 7 దినములలో హరించు.

వసంతకుసుమాకర రసనిర్మాణ విధి.

శ్లో॥ ప్రవాళరస సమౌక్తికాభ్రకమిదంచతుర్భాగభాక్పృథగ్భస్మ
తారజితహేమనీరద్వ్యంశకే। అథోభుజగరంగకంత్రిలవకాంవిమ
ర్దాఖిలం। శుభేహనిసిభావయేద్భిషగియంది యానస్తశః।
క్రమైర్వృషనిశేక్షుజైః కమలమాలతీపుష్పజైః। రసైః కదలి
కందజైర్మలయచందనాదుద్భవైః। వసంతకుసుమాకరోరస
పతిర్ద్విపల్లోశితస్సమస్తగదహృద్భవేత్కలనిజానుపానైరయం॥

తా॥ ప్రవాళభస్మము 4 భాగములు రసభస్మము 4 భాగములు మౌక్తిక భస్మము 4 భాగములు అభ్రకభస్మము 4 భాగము రౌప్యభస్మము 2 భాగములు స్వర్ణభస్మము 2 భాగములు లోహభస్మము 3 భాగములు నాగభస్మము 3 భాగములు వంగభస్మము 3 భాగములు వీటినన్నిటిని ఖల్వమునందునిచి అడ్డసరము మానిపసుపు చెఱుకు తామరపూలు జాజిపూలు అరటిగడ్డ కృష్ణాగరు చందనము వీటిరసములచేత గాని ప్రత్యేకముగ నొక్కొకదానిచే 7 భావనలుచేసి కరాటమునందునిచికొని 2 వల్లములప్రమాణము అనుపాన విశేషములచే సేవించిన సమస్తరోగములు నివర్తించు.

---

* రసము 1 భాగము చేర్చినచో ఇంగిలీకమును చేర్చవలదు.

జాయతేతా ప్రస్తదాశర్కరయాయుతం । సర్పింగుడూచ్యా
గృష్ణీంయాద్ద్వంశరోచనయాయుతం । ఖర్జూరందాడిమంద్రా
క్షామిక్షుఖండానిచారయేత్ ॥ అరువౌనిస్తుషంధాన్యంఘృతభృ
ష్టంసశర్కరం । దద్యాత్తద్ధాజ్వరేధాన్యంగుడూచీక్వాథమా
హరేత్ । ఉశీరవాసకక్వాథందద్యాత్సమధుశర్కరం । రక్త
పిత్తేకఫేశ్వాసేకాసేచస్వరసంక్షయే । అగ్నిభృష్టంజయామూ
ర్ణంమధునానిశిదీయతే । నిద్రానాశేతిసారేచగ్రహణ్యాంమం
దపావకే । సౌవర్చలాభయాకృష్ణాచూర్ణముష్ణజలైః పిబేత్ ।
శూలేజీర్ణేతిథాకృష్ణా మధుయుక్తాజ్వరేహితా । ప్లీహోదరే
నాంతరక్తేఛర్ద్యాంచైవసువాంసురే । నాసికాపుటరక్తేషురసం
దాడిమపుష్పజం । దూర్వాయాస్స్వరసం నస్యేప్రదద్యాచ్ఛ
ర్కరాయుతం। కోలమజ్జాకణాబర్హింతుభస్మసశర్కరం । మ
ధునాలేహయేచ్ఛర్దిహిక్కాకాస్యశాంతిదే । విధిరేషః ప్ర
యోజ్యస్తుసర్వస్మిన్పోటలీరసే । మృగాంకేహేమగర్భేచమౌ
క్తికాఖ్యేరసేషుచ । ఇత్యేవంలోకనాథోఽయం రసస్సర్వరుజో
జయేత్ ॥

తా॥ శుద్ధ * బుభుక్షితమగు పాదరసము 2 భాగములు శుద్ధిజేసిన గంధకము 2 భాగములు యిటుల వీనినినూరి కజ్జలిచేసి పాదరసమునకు నాలుగింతలు పసపుఛాయ గల గవ్వలనుదెచ్చి అందు యీ కజ్జలినునిచి వెలిగారమును 1 భాగము గ్రహించి ఆవు పాలతోనూరి ఆగవ్వలయందలి కజ్జలిపైటికి రాకుండునటుల దానినోటికిపూసి పిదప శంఖపుతునకలను 8 భాగములు గ్రహించి 2 మంటి శరావములనుదెచ్చి యందొక దానికి సున్నముపూసి శంఖపుతునకలలో సగము వైచి దానిపై కజ్జలిజేసిన గవ్వలనునిచి దానిపై మిగిలి యుండెడి సగము శంఖపుతునకలనువైచి సున్నముచే లేపనముజేసిన 2 వ శరావమునుమూసి బాగుగచీలయిచ్చి యెండించి 4 మూలలును చదరముగనుండు

---

* సువర్ణాది ధాతువులను గ్రహించుటకు యోగ్యముగునటుల గంధకాదులచే జారణముచేయబడిన పాదరసము బుభుక్షిత మనంబడు.

నటుల గజములోతున పల్లముత్రవ్వి దానిలోపల 1 మూర ప్రమాణముగల మరియొక పల్లమునుత్రవ్వి అందు శరావసంపుటమునునిచి దానిపై మన్నుమూసి అడవియేరు పిడకలతో గజపుటంబిడి స్వాంగశీతలమున దానిని బైటికిదీసి శరావమందలి యౌషధములను ఖల్వమున జక్కగనూరి చూర్ణముజేయ వలయును. ఇదియె లోకనాథరసమనంబడు. ఈ లోకనాథరసము 6 గురిగింజలయెత్తును 29 మిరియముల చూర్ణములో కలిపి వాతరోగంబులయందు నేతి అనుపానముతోడను పిత్తరోగంబులయందు వెన్నతోడను శ్లేష్మరోగంబులయందు తేనెతోడను యివ్వవలయును. మఱియు నీలోకనాథరసము అతిసారము క్షయరోగము అరుచి సంగ్రహణి కృశత్వము అగ్నిమాంద్యము దగ్గు వుబ్బసము గుల్మము వీటికి ప్రశస్తంబుగనుండు. దీనిని సేవించినతోడనే ఘృతాన్నమును 3 గ్రాసములు భుజించి మంచముమీద పరుపులేకనే క్షణకాలము వెల్లకిలబరుండవలయును మఱియు పులుసును వర్జించి ఘృతాన్నము తియ్యనిపెరుగు వీటిని పుచ్చుకొనవలయును. విశేషముగ అడవిలోనుండెడు జింక మొదలగువాని మాంసములను నేతితో పక్వముజేసి భక్షింపవలయును. సాయంకాలమున ఆకలిగలిగెనేని పాలు అన్నమును భక్షించి నోరుచక్కై పెసలవడలను నేతితోజేసి పుచ్చుకొనవలయును. మఱియు నువ్వులు వుసిరికవోలుపు వీటినినూరి కల్కమును జేసియైనను లేక నెయ్యి నైనను శరీరమునకు లేపనము జేసికొని కించి దుష్ణోదకములో స్నానము జేయవలయును. తిలతైలమును బొత్తిగ స్పర్శింపందగదు. మారేడుపండు కాకరకాయలు వంకాయలు చిన్నమత్స్యములు చింతపండు మద్యములు యింగువ శొంఠి మినుములు మసూరధాన్యములు కుశ్మాండము ఆవాలు కాంజికము కారవల్లి మొదలగు కళారాములుగ నుండెడి కూరలు కూరఆకు ఫలములు వీటిసేవనయు శ్రమగలుగ జేసికొనుట మైథునంబొనర్చుట ఆగ్రహించుట పగలునిద్రించుట కంచుపాత్రయందు భుజించుట వీటిని వర్జించవలయును. ఇదియె దీనికి పథ్యము. మఱియు నీలోకనాథరసమును శుక్లపక్షమునందు శుభనక్షత్రముతో గూడిన పంచమి దశమి పౌర్ణమి మొదలగు సంపూర్ణ తిథులయందు తనకు చంద్రతారాబలము చూచుకొని పూజించి కన్యకకు భోజనంబిడి శక్త్యనుసారముగ సువర్ణాది దానంబుల నొసంగి వుదయమున 2 గడియలలోపల సేవింపవలయును. దీనిని సేవించుటచే శరీరమునకు తాపము గలిగెనేని శర్కర తివ్వసత్తు వెదురుప్పు వీటిని నేకముగజేసి పుచ్చుకొనవలయును. మఱియు ఖర్జూరపు దాడిమపండు ద్రాక్షపండు చెఱుకుతుంటలు వీటిని కొంచకొంచముగ భుజించు చుండవలయును. ఇటులంజేసిన

తాపము శమించు. ధనియాలనుదంచి పొట్టుదీసి దానిని నేతిలోవేయించి అందు శర్కరను లోకనాథరసమును కలిపి పుచ్చుకొనిన అరుచి నశించు. ధనియాలు తిప్పతీగె వీటికషాయమున లోకనాథరసము కలిపి పుచ్చుకొనిన జ్వరమునశించు. వట్టివేళ్లు అడ్డసరపాకు వీటి కషాయమున తేనె శర్కర కలిపి యందు లోకనాథ రసమునుజేర్చి పుచ్చుకొనిన రక్తపిత్తము కఫము శ్వాస కాస స్వరభంగము యివి నశించు. బంగి ఆకును కొంచముగవాడ్చి చూర్ణముచేసి అందు లోకనాథ రసమును కొంచముగ తేనెయును కలిపి రాత్రులయందు పుచ్చుకొనిన నిద్రపట్టనివానికి నిద్రవచ్చుటయు గాక అతిసారము సంగ్రహణి యివి నశించి అగ్నిదీపనముగలుగు. సౌవర్చలవణము కరకపిందెలు పిప్పళ్ళు వీటినిచూర్ణించి అందు లోకనాథరసమును కలిపి వుష్ణోదకముతో పుచ్చుకొనిన శూలలు అజీర్ణములు యివి నశించు. పిప్పలిచూర్ణమున తేనె లోకనాథరసము వీటిని కలిపి పుచ్చుకొనిన జ్వరములు నశించు. దాడిమపూల రసమున లోకనాథరసమును కలిపి పుచ్చుకొనిన జ్వరములు నశించు. దాడిమపూల రసమున లోకనాథరసమును కలిపి పుచ్చుకొనిన కడుపులో యెడమ పార్శ్వమున జనించెడి ప్లీహోదరము వాతరక్తము వాంతులు మూలవ్యాధి ముక్కులో రక్తముకారుట యివి నశించు. గరికెస్వరసమున శర్కరకలిపి అందు లోకనాథరసమును జేర్చి వస్యముజేసిన ముక్కులోస్రవించెడి రక్తమునశించు. రేగువిత్తులోనిపప్పు పిప్పళ్ళు నెమలిరెక్కల భస్మము వీటియందు శర్కర తేనెకలిపి లోకనాథ రసమునువైచి పుచ్చుకొనిన వాంతులు యెక్కిళ్ళు యివి నశించు. మఱియు పోటలీ మృగాంకము హేమగర్భము మౌక్తికము మొదలగు స్వరసములయందును లోకనాథ రసమునకు జెప్పబడిన పథ్యములు అనుపానములు వీటిని అనుష్టించవలయు. ఈ లోకనాథరసము సర్వరోగములను హరింపజేయు.

## స్వర్ణమాలినీ వసంతరస నిర్మాణవిధి.

శ్లో॥ స్వర్ణంముక్తాదరదమరిచంభాగవృద్ధ్యాగృహీతం ।
ఖర్పరస్త్రోప్రథమమఖిలంమర్దయేన్మ్రక్షణేన ।
యావత్స్నేహోవ్రజతివిలయంమర్దనేదేయతే౽సౌ ।
గుంజాద్వంద్వంమధుయుగధయూమాలినీప్రాగ్వసంతః ॥

తా॥ స్వర్ణపత్రము (అపరంజి) 1 భాగము మా_క్షికభస్మము 2 భాగములు పారదభస్మము 3 భాగములు మిరియాలు 4 భాగములు ఖర్పరభస్మము 8 భాగములు వీటిని ఖల్వమునందునిచి మైనముకీతిగ నగువరకు జక్కగ మర్దించి మాత్రలుజేసి తేనె జీలకర్రచూర్ణము వీటితో 2 గురిగింజలప్రమాణము సేవించిన సమస్తరోగములు నివర్తించు.

బృహన్మాలినీ వసంతరస నిర్మాణవిధి.

శ్లో॥ వైక్రాంతమభ్రం రవితాప్య రౌప్యం గంధప్రవాళంర సభస్మలోహం । సటంకణంశంబుకభస్మ సర్వంసమస్తమేతచ్చ వరీరజన్యోః ద్రవైర్విమర్ద్యంమునిసంఖ్యయాచకస్తూరికాసీతకరేణపశ్చాత్ । తదాబృహత్పూర్వకమాలినీప్రాక్వసంతినామారసదోరసోయం॥

తా॥ వైక్రాంత భస్మము అభ్రకభస్మము తామ్రభస్మము హేమమాక్షిక భస్మము రౌప్యభస్మము శుద్ధగంధకము పగడభస్మము రసభస్మము లోహభస్మము వెలిగారము శంఖభస్మము వీటిని ఖల్వమునందునిచి పిల్లపీచర నీలిఆకు వీటి రసముతో మర్దించి భావనజేయవలయు ఇటుల 7 మార్లుచేసి పిదప కస్తూరి పచ్చకర్పూరము వీటినిజేర్చి మరల పైరసములతో మర్దించి భావనజేసిన నిది బృహన్మాలినీవసంత రసమనంబడు. ఇది సర్వరోగములను వశింపంజేయు.

పాశుపతరస నిర్మాణవిధి.

శ్లో॥ శుద్ధంసూతంద్విభాగంధంత్రిభాగంతీక్ష్ణభస్మకం । త్రిభిస్సమంవిషందేయంచిత్రకక్వా ధభావితం । ధూర్తబీజ స్యభస్మాపి ద్వాత్రింశద్భాగసంయుతం। కటుత్రయంత్రిభాగంస్యాల్లవంగైలాచతత్సమం।జాతీఫలంతథాకోశమర్ధభాగంనియోజయేత్ । తిథాంశంలవణంపంచస్నుహ్యర్క్రండతిన్త్రిడి । అపామార్గాశ్వత్థజఞ్చక్షారందద్యాద్విచక్షణః। హారీతకీయవక్షారంస్వర్జికాహింగుజీరకం । టంకణం చసూతతు ల్యమమ్లయోగేనమర్దయేత్ । భోజనాంతే ప్రయోక్తవ్యోగుంజాఫలప్రమాణతః। రసఃపాశు పతోనామసద్యఃప్రత్యయకారకః । దీపనఃపాచనోహృన్యాసదోహ్యహన్తివిషూచికాం॥

కా॥ శుద్ధరసభస్మము 1 భాగము గంధకము 2 భాగములు కాంతలోహభస్మము 3 భాగములు వసనాభి 6 భాగములు వుమ్మెత్తవిత్తుల భస్మము 32 భాగములు త్రికటుకములు 3 భాగములు లవంగములు యేలకులు యివి ప్రత్యేకముగ 3 భాగములు జాజికాయ ½ భాగము జాపత్రి ½ భాగము పంచలవణములు ½ భాగము బొంత జెముడు జిల్లేడు ఆముదపుచెట్టు చింతచెట్టు వుత్తరేణి రావి వీటిభస్మము కరక్కాయ యవక్షారము సర్జక్షారము యింగువ జీలకర్ర వెలిగారము యివియన్నియు ప్రత్యేకముగ 1 భాగము వీటినన్నిటిని చిత్రమూల కషాయముతో నూరి సీదనుయెండించి మరల నిమ్మపండ్ల రసముతో నూరి గురిగింజంత మాత్రలుజేయవలయు. ఇదే పాశుపత రసమనంబడు. దీనిని భోజనముజేసిన తర్వాత 1 మాత్రను సేవించిన విషూచికా రోగము నివర్తించుటయేగాక అగ్నిదీపనము పాచనము మనోల్లాసము వీటిని సగా గలుగంజేయు.

పర్పటీరస నిర్మాణవిధిః.

శ్లో॥ రసంత్రిగుణగంధేన మర్దయిత్వా సభృంగకం। లోహపాత్రేష్వ తాభ్యక్తే ద్రావితం బదరాగ్నినా॥ ఊర్ధ్వాధో గోమయం దత్వా కదళ్యాః కోమలే దళే। స్నిగ్ధే ప్రతే హ్యయోదర్వ్యా పర్పటాకారతాం నయేత్। పాదేలోహే వినిక్షిప్తే లోహపర్పటికా భవేత్। తామ్రేపాదేవినిక్షిప్తే తామ్ర పర్పటికా భవేత్। విష పాదంచయుంజీత త్వసాధ్యే ష్వామయేషుచ। సురసాయాజయన్త్యాశ్చ కన్యకాధకరూష యోః। త్రిఫలాయా మునే ర్భార్జ్యా ముండ్యాత్రికటుపంచయోః। భృంగరాజస్యవహ్నేశ్చ ప్రత్యహం ద్రవభావితం। ఆర్ద్రికస్వరసేనాథ సప్తధా భావయేత్పునః। అంగారేస్వేదయేద్దేవ పర్పటీరసముత్తమం। గుంజాష్టకం దదేతాస్య తాంబూలీపత్రసంయుతం। పిప్పలీరసకైశ్చాపి నిర్గుండ్యా హ్యనుపానకం చరేత్। త్రికంటకస్యమూలాని శుంఠిచ్చిత్వా వినిక్షిపేత్। అజాక్షీరే పనిర్ధార్యం యావక్షీరం విపాచయేత్। తత్క్షీరం పాయయేద్రాత్రౌ సకణం భోజయేదపి। కూష్మాండం వర్జయేచ్చించా వృంతాకం కర్కటీమపి। అరనాలంచ తైలంచ మైథునంచ వివర్జయేత్। మాసత్రయంతు సేవేత కాసశ్వాసాపనుత్తయే॥

తా॥ రసము 1 భాగము గంధకము 3 భాగములు వీటిని ఖల్వమందునిచి గుంటగలగరాకు రసముతో నూరి లోహపాత్రమునకు లోపల నెయ్యి చరిమి అందునిచి రేగుకట్టెలతో మంటవేసి ద్రవించుట వలన కాచి పిదప ఆవుపేడను గుండ్రముగకట్టి దానిపై అరటిఆకుతుము పరచి దానిపై మగల ఆవుపేడను గుండ్రముగకట్టి అందు యినపగరిటెలో కరిగిన పైరసమును బోసి అప్పడమువలె గుండ్రముగునటుల యినపగరిటెతో చేయువలయును. ఇది పర్పటీరసమనంబడు పైరసగంధకములు మిళితముగ కరుగునపుడు అందురసమునకు 4 వ భాగము లోహభస్మమునైచిన లోహపర్పటీ యనబడును. రసమునకు 4 వ భాగము తామ్రభస్మమునైచిన తామ్రపర్పటీ యనబడును. అసాధ్యరోగముల యందు రసమునకు 4 వ భాగము వస నాభిని జేర్చవలయును. తులసి ఘసిరికె కలబంద కంది అగ్నిసము అగసి చిర్రి గుంటగలగర చిత్రమూలము వీటియొక్క రసములు త్రిఫలములు గంటుభారంగి త్రికటుకములు వీటియొక్క కషాయములు పైరసకషాయములలో ప్రతిదానితోను వొక్కొకదినము భావనజేసిన పిదప అల్లపురసముతో 7 మార్లు భావనజేసిన పిదప బొగ్గుల నిప్పుసెగయందు కొంచముగ కాచినసిద్ధమైన పర్పటీరసము దీనిని 8 గురిగింజలయెత్తు తమలపాకులోపెట్టి సేవించి పిదప పిప్పలికషాయముగాని లేక వావిలి కషాయముగాని పానము జేయవలయును. మేకపాలకు సమముగ వుదకముజేర్చి అందు పల్లేరువేరు శొంఠి వీటినినలగగొట్టినైచి నీరంతయును యిగురునటులకాచి అందు పిప్పలీచూర్ణమునునైచి దానిని రాత్రియందు సేవించి భోజనము జేయువలయు ఈ ఔషధమును సేవించునపుడు గుమ్మడికాయ చింతపులుసు వంకాయ దోసకాయ కూటినీళ్ళు నూనె స్త్రీసంభోగము వీటిని వర్జింపవలయును. ఇటుల 3 మాసములు సేవించిన కాసశ్వాసలు నివర్తించు.

జయామాత్ర నిర్మాణ విధి.

శ్లో॥ విషంత్రికటుకంముస్తంహరిద్రానింబపత్రకం।
విడంగమష్టమంచూర్ణంఛాగమూత్రై ర్విమర్దయేత్ ।
చణకాభావటీకార్యాజ్జయానామయోగవాహికా ॥

తా॥ వసనాభి త్రికటుకములు తుంగముస్తెలు మానిపసపు వేపాకు వాయువిడంగములు వీటిని సమభాగములుగ గ్రహించి చూర్ణించి మేకమూత్రముతో నూరి శెనగగింజలంత మాత్రలు జేయువలయును. ఇదియేజయామాత్ర యనంబడు. దీనినితగుమైన అనుపానములతో సేవించిన సర్వరోగములు నివర్తించు.

## జయంతీవటీ నిర్మాణవిధి.

శ్లో॥ విషంపారాశ్వగంధాచవచాతాలీసపత్రకం।
మరీచంపిప్పలీనింబమజామూత్రేణతుల్యకం।
వటికాపూర్వవత్కార్యాజయన్తీయోగవాహికా॥

తా॥ వసనాభి విషబొద్ధి పెన్నేరుగడ్డ వస తాళీసపత్రి మిరియాలు పిప్పళ్ళు వేపాకు వీటిని సమముగజేర్చి చూర్ణించి మేకమూత్రముతో నూరి శెనగగింజలంత మాత్రలుజేయవలయును. ఇదియే జయంతీవటి యనంబడు. దీనిని యుక్తానుపానములతో సేవించిన సమస్తరోగములు హరించు.

గద్య॥ ఇతి శ్రీమదాంధ్రభాషానువాదభూషితే అనుపానరత్నాకరే
యోగరాజగుగ్గులు నారాయణచూర్ణ మృత్యుంజయాది
రసానాం నిర్మాణ వివేక కథనన్నామ
సప్తమస్తరంగః.



శ్రీ ర స్తు.

# అనుపానరత్నాకరము.

## ఆంధ్ర తాత్పర్యము.

### అష్టమస్తరంగము.

**ధాతువులు ఉపధాతువులు రసములు ఉపరసములు విషములు**
**ఉపవిషములు రత్నములు ఉపరత్నములు**
**వీట్లయొక్క వివరములు.**

**ధాతువులవివరము.**

శ్లో॥ స్వర్ణంరూప్యంచతామ్రంచరఙ్గంయశదమేవచ ।
సీసంలోహంచసప్తైతేధాతవోగిరిసంభవాః ॥

**తా॥ స్వర్ణము రౌప్యము తామ్రము వంగము జసదము సీసము లోహము యీ 7 సప్తధాతువులకు పేళ్లు. ఇవియన్నియు పర్వతమునందు జనించునవి.**

**ఉపధాతువులు.**

శ్లో॥ సప్తోపధాతవస్స్వర్ణమాక్షికంతారమాక్షికం ।
తుత్థంకాంస్యంచరీతిశ్చసిందూరశ్చశిలాజతుః ॥

**తా॥ స్వర్ణమాక్షికము రౌప్యమాక్షికము తుత్థము కాంస్యము ఇత్తళి సిందూరము శిలాజతు యీ 7 న్ను ఉపధాతువులకు పేళ్లు.**

రసము.

శ్లో॥ రసాయనార్థిభిర్లోకైః పారదోరస్యతేయతః।
తతోరసఇతిప్రోక్తస్సచధాతురపిస్మృతః॥

**తా॥ రసాయనమును కోరినజనులచేత కోరబడును గనుక రసమనబడును. ఇది ధాతువనియును చెప్పంబడును.**

## ఉపరసములు.

శ్లో॥ గంధోహింగుళమభ్రికతాళకశిలాస్స్రోతోంజనంటంకణం ।
రాజావర్తకచుమ్బకౌస్ఫటికశంఖఃఖటీగైరికం ।
కాసీసంరసకఙ్కపర్దసికతాబోలంచకంకుష్ఠకం ।
సౌరాష్ట్రీచమతాఅమీఉపరసాస్తస్యకించిద్గుణైః ॥

తా॥ గంధకము హింగుళము అభ్రికము హరితాళకము మనశిల స్రోతోంజనము (వల్లసురము) వెలిగారము రాజావర్తకము చుంబకపాషాణము స్ఫటికము శంఖము ఖటీగైరికము కాసీసము రసకము గవ్వ యిసుక బోళము కంకుష్ఠము సౌరాష్ట్రిము యివి ఉపరసములనంబడుః ఇది రసమునకంటె కొంచెము తక్కువగుణముగలది.

## విషములు.

శ్లో॥ విషంతుగరళఃక్ష్వేడ స్తస్యభేదానుదాహరే ।
వత్సనాభస్సహారిద్రఃసక్తుకశ్చప్రదీపనః ।
సౌరాష్ట్రికఃశృంగకశ్చకాలకూట స్తథైవచ ।
హాలాహాలోబ్రహ్మపుత్రో విషభేదాఅమీనవ ॥

తా॥ విషము గరళమనియు క్ష్వేడమనియు చెప్పంబడు. వత్సనాభి హారిద్ర సక్తుక ప్రదీపన సౌరాష్ట్రిక శృంగక కాలకూట హాలహాల బ్రహ్మపుత్ర యిటులవిషము 9 భేదములు కలదిగనుండు.

## ఉపవిషములు.

శ్లో॥ అర్కక్షీరంస్నుహీక్షీరంతథైవకరిహారికా ।
కర్వీరకోధదుత్తూరఃపఞ్చచోపవిషాస్మృతాః ॥

తా॥ జిల్లేడుపాలు బొంతజెముడుపాలు ముంటవిత్తు గన్నేరు ఉమ్మెత్తయని ఉపవిషములు 5 విధములుగనుండు.

## రత్నములు.

శ్లో॥ వజ్రంగారుత్మకంపుష్పరాగోమాణిక్యమేవచ ।
ఇంద్రనీలశ్చగోమేద స్తథావైడూర్యమిత్యపి ।
మౌక్తికంవిద్రుమశ్చేతిరత్నాన్యుక్తానివైనవ ॥

తా॥ వజ్రము మరకతము పుష్పరాగము మాణిక్యము యింద్రనీలము గోమేధకము వైడూర్యము ముత్తియము పవడము ఇవి నవరత్నములనంబడు.

## ఉపరత్నములు.

శ్లో॥ ఉపరత్నానికాచశ్చకర్పూరాశ్మాతథైవచ।
ముక్తాశుక్తిస్తథాశంఖఇత్యాదీనిబహూన్యపి॥

తా॥ కాచమణి (గాజుఱాయి) కర్పూరపురాయి ముత్తెపుచిప్ప శంఖము ఘుఏ మొదలైనవి ఉపరత్నములనంబడు.

ఇతి శ్రీమదాంధ్రభాషానువాదభూషితే అనుపానరత్నాకరే
యోగరాజగుర్గులు నారాయణచూర్ణ మృత్యుంజయాది
రసానాం నిర్మాణ వివేక కథనంనామ
అష్టమస్తరంగః.

సమాప్తము.

---

శ్రీ రస్తు.

## వైద్యగ్రంథములు.

| | రూ. | అ. |
|---|---|---|
| వైద్యచింతామణి 2 వాల్యములు తె. తా. గ్లేసుకాగితములపై అచ్చొత్తించి కలికోమీదుగ ప్రింటిచేసి తయారుచేయబడిన మేలుప్రతి | 10 | 0 |
| బసవరాజీయము తె. తా. మేలుప్రతి కలికోబైండు గిల్టుపేరు | 7 | 0 |
| అష్టాంగహృదయము, వాగ్భటము సూత్రస్థానము తె. తా. | 6 | 0 |
| ,, చికిత్సాస్థానం ప్రత్యేకముగా అచ్చగుచున్నది | 6 | 0 |
| అశ్వవైద్యశాస్త్రము | 2 | 8 |
| అనుపానమంజరి | 0 | 8 |
| అనుపానరత్నాకరము సాదాప్రతి | 0 | 12 |
| ,, మేలుప్రతి | 1 | 0 |
| అనుపానతరంగిణి తె. తా | 0 | 12 |
| పద్యవైద్యజీవనము అను లోలంబ రాజీయము. | 0 | 8 |
| చికిత్సారత్నము | 1 | 4 |
| చికిత్సాసారము | 2 | 8 |
| మానవధర్మచంద్రిక | 2 | 0 |
| మాధవ నిదానము | 2 | 8 |
| సర్బత్తుపాకావళి | 0 | 8 |
| సుశ్రుత శారీరస్థానము | 2 | 8 |
| శార్ఙ్గధర సంహిత | 3 | 0 |
| వైద్యామృతము | 1 | 4 |
| సర్వౌషధి గుణకల్పము | 2 | 8 |
| వాజీకరణకల్పద్రుమము | 1 | 8 |
| కాలజ్ఞానము | 0 | 4 |
| ధన్వంతరి నిఘంటువు | 2 | 8 |
| గుణపాఠము తె తా. సాదాప్రతి | 2 | 8 |
| ,, మేలుప్రతి | 3 | 0 |

| | రూ. | అ. |
|---|---|---|
| నాడీనక్షత్రమాల | 0 | 4 |
| నాడీజ్ఞానము | 0 | 3 |
| నాడీనిదానము | 0 | 4 |
| నాడీవిజ్ఞానము | 0 | 4 |
| షడ్రసనిఘంటువు | 0 | 8 |
| వైద్యశతశ్లోకి మేలుప్రతి | 0 | 6 |
| వ్యాసప్రోక్త వైద్యము | 1 | 8 |
| అగస్త్యప్రోక్త వైద్యము | 1 | 8 |
| వశిష్ఠప్రోక్త వైద్యము | 1 | 8 |
| గదనిగ్రహము సోఢలకృతం | 2 | 8 |
| కుమారతంత్రము రావణకృతము | 0 | 8 |
| భేషజకల్పము | 0 | 6 |
| చక్రదత్త | 3 | 12 |
| రాజమార్తాండము | 0 | 10 |
| అజీర్ణమంజరి | 0 | 4 |
| విషవైద్య చింతామణి | 2 | 0 |
| రసయోగ రత్నాకరం | 0 | 12 |
| బృహద్వైద్య రత్నాకరం | 2 | 8 |
| వృక్షాయుర్వేదము | 0 | 4 |
| టీకాచెల్లి వైద్యము | 0 | 2 |
| ధన్వంతరి విజయము | 0 | 10 |
| నేత్రదర్పణము | 0 | 8 |
| వ్రణచికిత్స | 0 | 8 |
| దంతశోధని | 0 | 8 |
| వైద్యప్రస్తారము | 0 | 8 |
| ఆరోగ్యదర్పణము | 0 | 4 |
| మలయాళమంత్రరాజీయము 2 భాగములు మంత్రయంత్రములుగలది | 1 | 12 |
| ధన్వంతరి వైద్యచికిత్సాసారము | 0 | 12 |
| వనమూలికాధర్మశాస్త్రమను సిద్ధమూలికారహస్యము మంత్రయంత్రము లుగలది | 1 | 0 |

పినుగు - వెంకటకృష్ణారావుపంతులు,
2/40, పెద్దునాయుని వీధి, మద్రాసు.